# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

19/10/84

## రోజుకొక లైలా

రచన: టెంపోరావ్

## కలల సుందరి

రచన: చంద్రశేఖర అజాద్

## స్వప్నాల రహస్యం

రచన: ఎమ్. ఆర్. ఎస్. ప్రసాదరావు

## మొదటి రాత్రి

రచన: మిస్. కె. మధుబాల

అగ్ని కిరీటం - మూడవ భాగం

అపరాధ పరిశోధన సప్లిమెంట్ —131
నవంబరు, 1984
వెల: రు. 6-00
ఏడాది చందా: 72 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
శ్యామ దామోదర్ రెడ్డి

సంపాదక వర్గం:
టెంపోరావ్
శ్యాంబాబు
ఏ. వీ. మోహన్రావ్
బొమ్మిడి అచ్చారావు
విద్వాన్ షీలాదేవి

కార్యాలయం:
అపరాధ పరిశోధన కార్యాలయం
నారాయణగూడ, హైదరాబాదు-29
ఫోన్-64843

ముద్రణ:
క్రాంతి ప్రెస్,
2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# రోజుకొక లైలా

టెంపోరావ్

ంతో బస్సు క్రిక్కిరిసి వుంది. సీట్లులేక అనేకమంది నిలబడి వున్నారు.

రాజేశ్వరి నిలబడి వుంది. ఆమె కిరువైపులా మనుషులు నిలబడి వున్నారు. వెనకనుంచి ఆమెను యెవరో తోస్తున్నారు. ఆమె చిరాకుగా వెనక్కి చూసింది. ఒక యువకుడు వెనకనే నిలబడి వున్నాడు. అతడి వయస్సు యిరవైఐదు దాటివుండదు. ఆమె వయస్సే!

ఆమె పిరుదులకు అతడి శరీరం తగుల్తోంది. ఆమె ముందుకు జరగాలని చూసింది. కాని ఖాళీలేదు. ఏమీ చెయ్యలేక ఆమె నిస్సహాయంగా వుండిపోయింది.

పదినిమిషాల తర్వాత ఒక బస్టాప్‌లో బస్సు ఆగింది. ఆమె మెల్లిగా ముందుకు వెళ్ళి దిగింది. వేగంగా పేవ్‌మెంటమ్మట అడుగులు వేస్తోంది.

“ఏమండోయ్!” అర్చారు ఎవరో వెనకనుంచి.

“మిమ్మల్నే!” అర్చారు మళ్ళా.

వెనక్కి తిరిగి ఆమె చూసింది. ఆ యువకుడే! అతడి చేతిలో వున్న వస్తువువైపు ఆమె ఆశ్చర్యంగా చూసింది.

"ఈ పర్సు మీదేనా?" అడిగాడతను.

"నాదే! మీకెలా వచ్చింది?" ప్రశ్నించిందామె ఆశ్చర్యంతో.

అతడామె ప్రశ్నకు వెంటనే జవాబివ్వలేదు. ఆమె హేండ్ బాగ్ కేసి చూశాడు. బాగ్ ను ఎవరో బ్లేడుతో కుడివైపున కోసేశారు.

"చూశారా! లక్కీగా అది నేను చూసి అతడి చేతిలోంచి పర్సు లాక్కున్నాను. అతడు మనుషులని తోసుకుంటూ వెళ్ళి కిందకు దూకేశాడు" అన్నాడతను.

"మీకు చాలా థాంక్స్! అందులో చాలా డబ్బు ఏవో కొనాలని బజారుకు బయల్దేరాను. ఆ పర్సు పో యింటికి పోవలసి వచ్చేది" అందామె.

అతడామెవైపు నవ్వుతూ చూశాడు.

"బస్సులో నేనింకా పైకి వెళ్ళాలి. కాని మిమ్మల్ని మళ్ళా కనుక్కోవడం కష్టమని యిక్కడే దిగేశాను" అని పర్సును ఆమెకిచ్చాడు.

"థాంక్యూ సో మచ్!" అందామె.

"డబ్బు అంతా వుందో లేదో చూసుకోండి!"

"వుండక ఎక్కడకి పోతుంది?"

"అయినా నా తృప్తికోసం చూడండి."

ఆమె పర్సు తెర్చిచూసింది.

"అణా పైసల్తో సరిగ్గా వుందండి. మళ్ళా మీకు థాంక్స్" అందామె.

పేవ్ మెంటుమీద యిద్దరూ పక్కపక్కనే నడుస్తు

"మీ పేరు?"

"రాజేశ్వరి."

"నా పేరు వినోద్" అన్నాడతను.

"మీరు యీ పట్నంలోనే వుంటున్నారా?" అడిగిందామె.

"నాది విజయవాడ. వ్యాపారంమీద యిక్కడకు తరచు వస్తూ వుంటాను."

సమీపంలో హోటల్ ఎవరెస్టు బోర్డు కనిపిస్తోంది.

"కాఫీ తాగుదాం రండి" అన్నాడతను.

"భోజనం చేసి వస్తున్నాను. ఇప్పుడు కాఫీ యేమిటి?" అందామె.

అతడు తీయగా నవ్వాడు.

"కాఫీ పేరుతో మీతో కాస్సేపు మాట్లాడే అవకాశం వుంటుంది" అన్నాడతను.

"పదండి" అందామె.

ఇద్దరూ హోటల్ హాల్లోకి వెళ్లారు. ఒక ఫామిలీ కాబిన్‌లోకి నడిచారు. కుర్చీల్లో పక్క పక్కనే కూర్చున్నారు.

బాయ్ లోపలకు వచ్చాడు.

"కాఫీ మాత్రం తెప్పించండి. మరేమీ వద్దు!" అందామె.

అతడు కాఫీ ఆర్డరిచ్చాడు. బాయ్ వెళ్ళిపోయాడు. ఆమె నవ్వుతూ అతడివంక చూసింది.

వినోద్‌లో విశేషమైన ఆకర్షణ వుంది. ఖరీదైన పాంట్, స్లాక్‌లో వున్నాడతను. చేతికి సిటిజన్ వాచ్ వుంది. మెరుస్తూన్న బూట్లు. అమెరికన్ క్రాపు. సన్నటి మీసాలు. ఫిలిం హీరోలా వున్నాడతను.

అతడామెను చూస్తూ వుండిపోయాడు. మరణించిన సినీతార సావిత్రిని పోలి వుందామె. ఆమె పళ్ళు తెల్లగా మెరుస్తున్నాయి. పెద్ద కళ్ళు, నల్ల పూసల గొలుసుదంక అతడు చూశాడు.

"మీకు పెళ్ళయిందనుకుంటాను!" అన్నాడతను.

"అయిందిలెండి" అందామె క్లుప్తంగా.

ఆమె కంఠంలో ఏదో అసంతృప్తి ధ్వనిస్తోంది.

"మీ సంసారం హేపీగా సాగడం లేదా?"

ఆమె విచిత్రంగా నవ్వింది.

"నా భర్త నన్ను డబ్బుకోసం, ఉద్యోగంకోసం పెళ్ళాడారు. నామీద ఆయనకంతగా ప్రేమలేదు. ఆఫీసులో వుందో సెనో టైపిస్టు ఆయనకోసం" అందామె.

"ఇదంతా విని విచారిస్తున్నాను. మీకు దూరంగా వుండే భర్త మూర్ఖుడై వుండాలి!" అన్నాడతను.

మెల్లిగా ఆమె చెయ్యిని అతడు పట్టుకున్నాడు. ఆమె తన చెయ్యిని వెనక్కి తీయలేదు. ఆమె చెయ్యిని ఆప్యాయంగా నిమిరాడతను.

అతడామె కళ్ళలోకి ఆప్యాయంగా చూశాడు.

"విధి మనల్ని విచిత్రంగా కలిపింది. యెందుకో!" అన్నాడతను.

"అది విధికే వదిలిపెడదాం" అందామె నవ్వుతూ.

కాఫీ వచ్చింది. ఇద్దరూ కాఫీ తాగారు. అతడు బిల్లు చూసి డబ్బు చెల్లించాడు.

"ఇంత తొందరగా మిమ్మల్ని వదల బుద్ధి కావడం లేదు" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. మౌనంగా అతడివైపు చూసింది.

"మీ జీవిత కథ వినాలనిపిస్తోంది!"

ఆమె నవ్వింది.

"నా హోటలు గదికి వెళ్దాం పదండి" అన్నాడతను.

"ఇప్పుడు కాదు."

"నేనివాళ విజయవాడ వెళ్ళిపోవాలి."

"మళ్లా వస్తాయగా?"

అతడామె కళ్ళలోకి తీక్షణంగా చూశాడు.

"మీతో పరిచయమయ్యాక రాకుండా వుండగలనా?" అన్నాడతను.

కాబిన్‌లోంచి యిద్దరు బయటకు నడిచారు. అతడు టైమ్ చూశాడు. పదకొండు దాటింది.

"అరగంటసేపు నా హోటల్ గదికొచ్చి మీరు కూర్చుంటే నేనెంతో సంతోషిస్తాను" అన్నాడతను.

"పదండి వెళ్దాం" అందామె.

అతను రోడ్డు కిరువైపులా చూశాడు. దూసుకు పోతున్న టాక్సీని ఆపాడు. ఆమె వెనక సీటుమీద కూర్చుంది. పక్కనే కూర్చుని అతడు తలుపు మూశాడు.

"హోటల్ మెట్రోకి పద!" అన్నాడు డ్రయివర్తో.

టాక్సీ తారు రోడ్డమ్మట దూసుకుపోయింది. అతడామె చెయ్యి పట్టుకుని మెల్లిగా నిమురుతూ వుండి పోయాడు.

## 2

హోటల్ మెట్రో కాంపౌండులో టాక్సీ ఆగింది. ఇద్దరూ కిందకు దిగారు. మీటర్ చూసి అతను డ్రయివర్ చేతిలో పదిరూపాయిల నోటు పెట్టి చిల్లర వుంచుకో మన్నాడు.

రాజేశ్వరి, అతనూ లాంజిలోకి వెళ్ళారు. ఒకవైపున రిసెప్షన్ కౌంటరు వుంది.

"ఇక్కడే వుండండి. నేను వెళ్ళి తాళంచెవి తెస్తాను" అన్నాడతను.

అతడు కౌంటరు ముందుకు వెళ్ళాడు. మేనేజర్ జాన్ అక్కడ ఒంటరిగా కూర్చుని వున్నాడు.

"హలో!" అన్నాడతను వినోద్‌ను చూసి.

"ఒక గది తాళంచెవి యిలా పడేయండి!" అన్నాడతను.

"రిజిస్టర్‌లో సంతకం పెట్టాలి!"

"అదంతా అనవసరం. నేనా గదిలో వున్నట్లు ఎవరికీ తెలియనక్కరలేదు.'

జాన్ అతడికి తాళంచెవి యిచ్చాడు.

"ఎవరా పిట్ట?" అడిగాడు జాన్ దూరంలో నిలబడి వున్న ఆమెవైపు చూస్తూ.

"నా లైలా!" అన్నాడు వినోద్ నవ్వుతూ.

"నీవు రోజుకొక లైలా!" అని వ్యంగ్యంగా నవ్వాడు.

వినోద్ ఆమెవైపు వేగంగా వెళ్ళాడు. తాళంచెవి మీద రూమ్ నంబరు 20 అని తెల్లటి అక్షరాల్లో రాసి వుంది.

"రండి" అన్నాడతను.

ఆమె అతడి వెనకనే కదిలింది.

అందంగా వున్న గదిలోకి వాళ్ళు వెళ్ళారు. అతడు తలుపుమూసి లోపలనుంచి తాళం వేశాడు. స్విచ్ నొక్కాడు. ఫాన్ తిరగసాగింది. పెద్ద సోఫాలో ఇద్దరూ పక్కపక్కనే కూర్చున్నారు.

క్షణకాలం అతడు ఆమెవైపు చూశాడు. "మీ గురించి చెప్పండి" అన్నాడతను.

"ఇరవయ్యో ఏట నాకు పెళ్ళయింది. అప్పట్లో నా భర్త నిరుద్యోగి. ఇంటర్ నేషనల్ ట్రేడర్స్ కంపెనీకి మేనేజర్‌గా నా భర్త నియమించబడ్డారు, నాన్న రెక మండేషన్ వలన. అదికాక నాన్న యిరవై వేలు కట్నం ఇచ్చాడు. నాన్న వున్నంతకాలం ఆయన నన్ను బాగా నే చూశారు. నాన్నంటే ఆయనకు భయం. నాన్న పోయి రెండేళ్ళయింది. అప్పటినుంచీ మా మధ్య అగాథం ఏర్పడింది" అందామె.

అతడు మౌనంగా విన్నాడు. ఆమె గది నలువైపులా చూసింది. గమ్మత్తుగా నవ్వింది.

"ఈ హోటల్ గదిని నాతో మాట్లాడ్డంకోసం మీరు తీసుకున్నట్లు వున్నారు!" అందామె.

అతడామె భుజంమీద చెయ్యి వేశాడు.

"యూ ఆర్ రైట్. నేను మరో హోటల్లో వుంటు న్నాను. ఆ గదిలో నా సెక్రటరీ వుంటాడు. అందుకని యీ గది తీసుకున్నాను. మీరు యిది ఎలా వూహిం చారు?"

"వెరీ సింపిల్, మిష్టర్ వినోద్! ఇది మీ గది అయి వుంటే మీ గుడ్డలూ అవీ వుండేవి. అటువంటివి ఏవీ లేవుగా!"

"మీ తెలివితేటలకు నా జోహార్లు!" అన్నాడతను.

ఆమె లేచి పక్కనున్న బాత్ రూమ్‌లోకి వెళ్ళి తిరిగి వచ్చింది. అతడు అమాంతంగా లేచి తన చేతుల్తో ఆమెను చుట్టేశాడు. ఆమె పెదిమలను బలంగా ముద్దెట్టు కున్నాడు.

ఆమె అతడి కళ్ళలోకి లోంటెగా చూసింది.

"నేను పెళ్ళయిన స్త్రీని!" అందామె.

10

"ఐ లవ్ యూ!" అన్నాడతను వుద్రేకంతో.

"నా బాగ్ కోసి నా పర్సును దొంగిలించిన దొంగ ఏ దేవుడో అయి వుండాలి. అతడి మూలంగానే మనం కలిశాం. నా భర్త నాకు దూరంగా వుంటున్నా నాకు మరెవరితోటీ సంబంధం లేదు. కాని మిమ్మల్ని చూడగానే ఏదో నన్ను మీ వైపు లాక్కుపోయింది" అందామె.

"రాజేశ్వరీ!" అన్నాడతను

"వినోద్!" అందామె.

ఆమె చేతులు అతడిని చుట్టేశాయి. క్షణకాలం ఇద్దరూ కౌగలించుకుని వుండిపోయారు.

ఆమెను తీసుకెళ్ళి అతడు పరుపుమీద పడుకోబెట్టాడు. పక్కనే కూర్చుని ఆమెవైపు ఆప్యాయంగా చూశాడు.

"మన ప్రేమను యిలాగే వుంచుకుందాం. కామంతో దాన్ని కలుషితం చేయొద్దు" అందామె.

వుద్రేకంతో అతడామె మీదకు ఒరిగిపోయాడు.

"ప్రేమలో రగులుకునే కామం మన ప్రేమను ద్విగుణీకృతం చేస్తుంది" అని అతడామెను అనేకచోట్ల ముద్దాడసాగాడు.

రెండు గంటల తర్వాత యిద్దరూ లేచి సోఫాలో కూర్చున్నారు.

"నేనిక వెళ్ళాలి" అందామె.

"నేను విజయవాడనుంచి రాగానే నీతో యెలా మాట్లాడ్డం?" అడిగాడతను.

ఆమె తన ఫోన్ నంబరు చెప్పింది.

"ఆ నంబరుకు ఫోన్ చెయ్యండి" అందామె.

"ఒకవేళ నీ భర్త రిసీవర్ తీస్తే!"

"నాడార్ స్టోర్స్ నాగలింగం మాట్లాడుతున్నా

నని, కొత్త స్టాకు వచ్చిందని చెప్పండి. మేం బట్టలు ఆ షాపులో కొంటూ వుంటాం" అందామె నవ్వుతూ.

ఆమెతో అతడుకూడా షాపింగ్ కు వెళ్లాడు. టాక్సీలో తీసుకువెళ్ళి ఆమెను ఇంటి సమీపంలో దించాడు.

"మళ్ళా వచ్చాక నీకు ఫోన్ చేస్తాను. బై బై" అన్నాడతను.

ఆమె యింటివైపు వెళ్ళిపోయింది. గుమ్మంలో నిలబడి బయటకు చూస్తూ నిలబడింది. రోడ్డమ్మట టాక్సీ ఆమె పక్కనుంచి దూసుకుపోయింది.

అతడివైపు ఆప్యాయంగా చూస్తూ ఆమె చెయ్యిని వూపింది.

## 3

ఇంటర్ నేషనల్ ట్రేడర్స్ మేనేజర్ రామ్మూర్తి ఎదురుగా కూర్చున్న వ్యక్తివైపు నవ్వుతూ చూశాడు.

"మిష్టర్ టామ్, చెప్పండి."

టామ్ ఒక రిపోర్టును అతడికిచ్చాడు.

"అందులో అంతా రాసివుంది. చదవండి" అన్నాడు టామ్.

టామ్‌కి సిగరెట్ యిచ్చి, తనో సిగరెట్ వెలిగించాడు రామ్మూర్తి. రిపోర్టును చదవసాగాడు. చదవడం పూర్తయ్యాక టామ్‌వైపు చూశాడు.

"రాజేశ్వరి దారి తప్పిందన్నమాట!" అన్నాడు రామ్మూర్తి.

"భర్త నిర్లక్ష్యంచేస్తే భార్య పెడమార్గాన పడ్తుంది" అన్నాడు టామ్.

అతడివైపు రామ్మూర్తి సూటిగా చూశాడు.

"అతనెవరు?"

"వివరాలు తెలియవు."

"మిష్టర్ టామ్, అతడెవరో కనుక్కోండి. అతడి ఫోటో ఒకటి నాకు కావాలి."

"రహస్యంగా ఫోటోతీసి మీకిస్తాను."

"నా భార్యను వెంటాడుతూనే వుండండి. మరి కొంత మందితో ఆమెకు సంబంధాలు వుండొచ్చు. అంతా నాకు కావాలి."

"మీరు చెప్పినట్లే చేస్తాను. నాకు వెయ్యిరూపాయిలు యివ్వండి."

జేబులోంచి వెయ్యి రూపాయిలుతీసి రామ్మూర్తి టేబుల్ మీద పడేశాడు. టామ్ నోట్లను భద్రంగా తన బాగ్ లో దాచుకున్నాడు.

"నేను వెళ్ళొస్తాను, సార్" అని టామ్ బయటకు వెళ్ళిపోయాడు.

రామ్మూర్తి సిగరెట్ వెలిగించి ఆలోచిస్తూ కూర్చు న్నాడు. తను పనిచేసే కంపెనీకి అధిపతి తన మామయ్య. మామయ్య మరణించాక కంపెనీ అత్త చేతుల్లోకి వెళ్ళింది. అత్త పిసినారి. డబ్బును దాచుకుంటుంది కాని ఖర్చుపెట్టదు.

గదిలోకొచ్చిన సత్యభామను చూడగానే అతడి ఆలోచనలకు అంతరాయం కల్గింది. అతడి కెదురుగా ఆమె నిలబడింది.

అతడామెవైపు చూస్తూ వుండిపోయాడు. సత్యభామ యిరవై ఏళ్ళ యువతి. మూడేళ్ళనుంచి తన కంపెనీలో పనిచేస్తోంది. ఆమె అతడికి ప్రాణంతో సమానం!

సత్యభామ కళ్ళమ్మట నీళ్లు కారుతున్నాయి.

"భామా, ఏమైంది?" అడిగాడతను.

ఆమె కుర్చీలో కూర్చుని ఏడ్వసాగింది. రామ్మూర్తి లేచి ఆమె పక్కకు వెళ్ళి భుజంమీద చెయ్యి వేశాడు.

"ఏం జరిగిందో చెప్పు."

"గోపాల్‌ని వాళ్ళు చంపేశారు" అందామె.

"ఎవరు?"

"హైజాకర్స్" అందామె.

మద్రాసునుంచి బొంబే వెళ్ళే విమానాన్ని హైజాక్ చేసి లాహోరులో దింపారని అతడు పొద్దుట దిన పత్రికలో చదివాడు. కాని పూర్తిగా చదవలేదు.

"ఆ ప్లేనులో గోపాల్ ఏం చేస్తున్నాడు?"

"అతడు ఆ ప్లేనులో కో పైలట్. కాక్‌పిట్‌లోకి వెళ్ళి హైజాకర్స్ గోపాల్ నెత్తిమీద యినుపకడ్డీతో కొట్టారు. విశేషంగా రక్తం పోయింది. అతడు మర ణించాడు."

ఆమె మళ్ళా ఏడ్వసాగింది.

"విధిని మనం ఎదిరించలేం" అన్నాడతను.

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"మీరు నన్ను ప్రేమిస్తున్నా నన్నారు. నా కోసం ఏదైనా చేస్తానన్నారు!"

"చేస్తాను" అన్నాడు.

"నాకు మా అమ్మ తప్ప యీ లోకంలో మరెవ్వరూ లేరు...."

"నేనున్నానుగా!" అన్నాడతను అడ్డొస్తూ.

"నన్ను పెళ్ళాడండి."

"ఎందుకంత తొందర?"

ఆమె అతడివంక సూటిగా చూసింది.

"గోపాల్, నేనూ ప్రేమించుకున్నాం. ఒకసారి

మహాబలిపురం వెళ్ళాం. ఆ రోజున అనుకోకుండా ఇద్దరం ఒక్కటయ్యాం. నేను గర్భవతిని. ఈ విషయం తెలిస్తే అమ్మ ఆత్మహత్య చేసుకుంటుంది. గోపాల్ నన్ను పెళ్ళాడలేడు. మీరు నన్ను రక్షించాలి" అందామె.

"భామా, నువ్వు బెంగ పెట్టుకోకు. నేను నిన్ను రహస్యంగా గుళ్ళో పెళ్ళాడ్తాను. మీ అమ్మకు ఏ ప్రమాదం రాకుండా చూస్తాను."

రామ్మూర్తి ఆమె కన్నీళ్ళను తుడిచాడు. ఆమెను కౌగలించుకుని పెదిమలను ముద్దాడాడు.

"భామా, కొంతకాలంపాటు నువ్వు మా యింట్లోనే వుండాలి. పరిస్థితులు అనుకూలంగా వున్నపుడు నువ్వు మా యింటికి మారొచ్చు" అన్నాడతను.

"అలాగేనండి" అందామె.

అతడామె కళ్ళలోకి చూశాడు.

"నీకు అబార్షన్ చేయిస్తాను. మాయిని మచ్చగా ఆ బిడ్డ మన మధ్య వుండనక్కరలేదు" అన్నాడతను.

"ఆ బిడ్డ పుట్టి పెరగాలి. అందుకే నన్ను పెళ్ళాడమని మిమ్మల్ని కోరాను" అందామె.

ఆమెవైపు అతడు ఆశ్చర్యంగా చూశాడు.

"గోపాల్‌కి మాటిచ్చాను. అది నేను నిలబెట్టాలి" అందామె.

"నీతత్వం నాకర్థం కావడంలేదు!"

"గోపాల్ ఒంటరివాడు. ఈ బిడ్డ పుడ్తే అతడి వంశం నిలుస్తుంది. విమానాల్లో పనిచేసేవాళ్ళు యే క్షణంలోనైనా చావచ్చని అతను నాతో అన్నాడు. ఏదేనా ప్రమాదం తనకు సంభవిస్తే తన బిడ్డ నిల్చేటట్లు నన్ను చూడమన్నాడు. చూస్తానన్నాను."

"భామా, నువ్వొక దేవతవు! నీ యిష్టప్రకారం అంతా చేద్దాం" అన్నాడతను.

## 4

ఆ రోజున రామ్మూర్తి యింట్లోనే వున్నాడు టెలిఫోన్ మ్రోగింది. అతడు వెళ్ళి రిసీవర్ని ఎత్తాడు.

"హాలో" అన్నాడు.

"అమ్మగారున్నారా?" అడిగాడొకతను.

"ఎవరు?"

"నాడార్ స్టోర్స్ నాగలింగం సార్" అన్నాడతను.

భార్యను పిలిచి అతడు రిసీవర్ని ఆమెకిచ్చాడు. ఆమె ఏదో మాట్లాడింది, తగ్గు స్వరంలో. రిసీవర్ని పెట్టి వెళ్ళిపోతోంది.

"ఎవరతను?"

"నాడార్ స్టోర్స్, బట్టల కొట్టతను. కొత్త సాకు వచ్చిందట. అందర్కీ ఫోన్ చేసి చెప్తున్నాడు" అందామె.

"ప్రస్తుతం ఏదీ కొనకు. నా దగ్గర డబ్బులేదు. మీ అమ్మ డబ్బిస్తే ఎన్నైనా కొనుక్కో!" అన్నాడతను.

"మిమ్మల్ని నేను డబ్బు అడగనులెండి" అని ఆమె వెళ్ళిపోయింది.

అతడు పడగ్గదిలోకి నడిచాడు. ఆమె దుస్తులు మార్చుకుంటోంది. అతడు వేగంగా టెలిఫోన్ దగ్గరకు వెళ్ళి, రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాడు.

"హలో, టామ్ స్పీకింగ్!"

"మిస్టర్ టామ్, రామ్మూర్తి హియర్. నా భార్య బయల్దేరి ఎక్కడికో వెళ్ళబోతోంది. ఫాలో హర్"

అన్నాడతను.

"ఇల్లు వదిలి బయటకు రావడానికి ఆమెకెంత టైము పడుతుంది?"

"పదినిమిషాల్లో ఆమె స్టార్టు అవచ్చు."

"పదినిమిషాల్లో మా మనిషి అక్కడుంటాడు."

"మిస్టర్ టామ్, రాజేశ్వరితో తిరిగే వ్యక్తిని గురించి ఏదైనా తెలిసిందా?"

"యిన్‌వెస్టిగేషన్ సాగుతోంది. తెలియగానే మీకు రిపోర్టిస్తాం."

"వాళ్ళిద్దరూ దగ్గరగావున్న ఫోటో ఒకటి కావాలి."

"అదంత సులువైన పనికాదు."

"ఎంత ఖర్చవుతుంది?"

"వెయ్యి రూపాయిలు."

"ఆల్‌రైట్. వెయ్యి ఇస్తాను. గెట్ మి ది ఫోటో!" అన్నాడతను.

రాజేశ్వరిని చూసి అతను రిసీవర్ పెట్టేశాడు. కనీసం 10 నిమిషాలు ఆమెను ఆపాలి. లేకపోతే టామ్ మనిషికి ఆమె దొరక్కపోవచ్చు.

అతడు పైనుంచికిందదాకా ఆమెను చూశాడు. కొత్త పెళ్ళికూతురులా తయారైంది.

"ఎక్కడకీ వేషం?"

"అమ్మదగ్గరకెళ్ళాలి."

"ఆరోగిష్టిదాన్ని చూడ్డానికి ఇంత డ్రెస్ ఎందుకు?"

"తన కూతురు బాగుందని చూసి అమ్మ సంతోషిస్తుంది" అందామె.

అతడు టైమ్ చూశాడు. పది నిమిషాలు అయింది. ఆమె బయటకు నడిచింది. గుమ్మంలో నిలబడి ఆమెవైపు

చూస్తూ నిలబడ్డాడతను.

ఆమె బస్టెండువైపు నడుస్తోంది. టామ్ మనిషి ఆమె వెనకనే కదులుతున్నాడు.

రాజేశ్వరి బస్సులో ఎక్కింది. ఒకచోట దిగి తల్లి యింటివైపు నడిచింది.

పెద్ద ఇల్లు. చుట్టూ విశాలమైన కాంపౌండు. చక్కటి పూల మొక్కలు వున్నాయి. తిన్నగా ఆమె ముందు హాల్లోకి వెళ్ళింది.

పెద్ద సోఫాలో తల్లి వెల్లకిలా పడుకుని వుంది. వంటామె పక్కనే నిలబడి వుంది.

రాజేశ్వరి తల్లి కామాక్షి యింట్లో ఎక్కువగా తిరగలేదు. కీళ్ళ నొప్పులు, వుబ్బసం వగైరా రోగాలు ఆమెను మంచం పట్టించాయి.

"రా అమ్మా, కూర్చో! గౌరీ పిల్లకు కాఫీ పట్రా" అంది తల్లి.

కుర్చీలో కూర్చుని రాజేశ్వరి తల్లి వంక చూసింది. ఆమె ఎంతకాలం బతుకుతుందో చెప్పడం కష్టం.

"అమ్మాయి, నేనింకా ఎంతకాలం యిలా ఒంటరిగా జీవించాలి? నువ్వు వచ్చి యిక్కడ వుండమ్మా" అంది తల్లి.

"వద్దమ్మా" అంది రాజేశ్వరి.

"నేను పోయాక యీ యిల్లు నీదే అవుతుంది. ఆ అద్దె కొంప వదిలి యిక్కడే వుండొచ్చుగా?"

"నాతో ఆయనకూడా వస్తారు. యిల్లరికం అల్లుడికి బాధ్యతలు తెలియవు. అక్కడుంటే వచ్చిన దానితో బతకడం నేర్చుకుంటారు" అంది రాజేశ్వరి.

వంటామె కాఫీ తెచ్చింది. కొంత కాఫీని ఆమె తల్లి గ్లాసులో పోసింది. తతిమ్మాది తను తాగింది.

"అమ్మా, నాకు కొంత డబ్బు కావాలి!"

"అల్లుడు యివ్వడంలేదూ?"

"ఆయన యివ్వడంలేదని నీకు చెప్పానుగా!"

"అవును, చెప్పావు. అతడికి నాల్గు వేలు జీతం ఇస్తోంది కంపెనీ. ఏం చేస్తున్నాడు?" అంది కామాక్షి.

"ఎవరి ఖర్చులు వాళ్ళవుంటాయి" అంది రాజేశ్వరి.

తల్లి కూతురివైపు చూసింది.

"డబ్బును దాచుకోవాలమ్మా. ఖర్చు పెట్టేయ కూడదు" అందామె.

రాజేశ్వరి నవ్వింది.

"అమ్మా, తేనెటీగలు ఎంతో పాటుపడి తేనెని పోగుచేస్తాయి. చివరకి వాటిని చెదరగొట్టి తేనెను పట్టుకు పోతారు మనుషులు, డబ్బు విషయం కూడా అంతే. నువ్వు దాచేస్తావు. రేపు నా చేతుల్లోకొస్తుందని. నీళ్ళలా ఖర్చుపెడ్తాను" అంది రాజేశ్వరి.

"అది నిజమే" అంది కామాక్షి.

ఇద్దరూ క్షణకాలం నిశ్శబ్దంగా కూర్చున్నారు.

"అమ్మాయి, యిదుగో తాళంచెవి. పైకి వెళ్ళి నీకు కావలసింది తీసుకో!" అందామె.

"అమ్మా, మై డియర్ మదర్" అని రాజేశ్వరి పైకి వెళ్ళింది.

గాడ్‌రెజ్ సేఫ్‌ను తెర్చింది. నోట్లకట్టలు కుప్పలుగా పడున్నాయి. కట్టలను సరిగ్గా సర్దే శక్తి తల్లికిలేదు. డబ్బొస్తే దాన్ని సేఫ్‌లో పడేసి తాళం వేసేస్తోంది.

రాజేశ్వరి రెండు వేలు తీసుకుంది. కిందకు దిగి తాళం

చెవిని తల్లికిచ్చింది. ఆమె బుగ్గమీద ఆప్యాయంగా ముద్దెటుకుంది.

"వెళ్ళొస్తానమ్మా" అంది రాజేశ్వరి.

"మళ్ళా ఎప్పుడొస్తావమ్మా?"

"రోజు విడచి రోజు వస్తూనే వున్నానుగా" అందామె.

"అమ్మా, నిన్ను ప్రతి నిమిషం చూడాలనిపిస్తోంది. నువ్వు ఎప్పుడూ నాకళ్ళముందుంటే నేను ఆనందిస్తాను."

"ఆ రోజుకోసం ఎదురుచూద్దాం" అని రాజేశ్వరి బయటకు నడిచింది.

రోడ్డుమ్మట పోతున్న ఆటోను ఆమె ఆపింది. యెక్కి సీటుమీద కూర్చుంది.

"ఎక్కడికమ్మా?" అడిగాడు డ్రయివర్.

"పారిస్ కి పద" అందామె సాలోచనగా.

## 5

హోటల్ మెట్రోలో టాక్సీ ఆగింది. వినోద్ నవ్వుతూ టాక్సీ దగ్గరకు వచ్చాడు. అతడివైపు ఆమె ఆనందంగా చూసింది.

ఆమె కిందకు దిగింది. మీటరు చూసి అతడు డబ్బు చెల్లించాడు. ఇద్దరూ మేడమీదున్న 313 నంబరు గదిలోకి వెళ్ళారు.

సోఫాలో కూర్చున్నారు. కాస్సేపు అతడు ఆమెను చూస్తూ వుండిపోయాడు.

రాజేశ్వరి రంభలా వుంది. శీకాయితో తలంటుకొని నీళ్ళు పోసుకుంది. విశాలమైన ఆమె కాటుక కళ్ళు అయస్కాంతంలా అతడిని ఆకర్షిస్తున్నాయి. లిప్ స్టిక్ తో ఆమె పెదిమలు ఎర్రగా మెరుస్తున్నాయి. పొడుగాటి

వాలుజడ. చెవులకు తెల్లటి రాళ్లున్న కమ్మలు. ఆమె ఖరీదైన పట్టుచీర ధరించింది.

"నువ్వు చాలా అందంగా వున్నావు!" అన్నాడతను.

ఆమె కళ్ళు చిట్లించింది.

"మీ చెయ్యి యిలా యివ్వండి" అందామె.

అతడు కుడిచెయ్యిని ఆమె ఒళ్ళో పెట్టాడు. హేండ్ బాగ్ లోంచి ఒక వుంగరంతీసి అతడి వేలుకు పెట్టింది.

"నా హృదయంలోని మీ రూపంలా యీ వుంగరం ఎప్పుడూ మీ వేలికుండాలి" అందామె.

"వుంటుంది. నువ్వు పెట్టినచోటే వుంటుంది" అన్నాడతను వుద్రేకంతో.

"విజయవాడనుంచి ఎప్పుడొచ్చారు?"

"రాగానే నేను చేసిన మొదటి పని నీకు ఫోన్ చెయ్యడమే" అన్నాడతను.

చటుక్కున అతడు లేచాడు. గదిలో పచార్లు చేస్తూ ఆమె ముందు ఆగాడు.

"నాది విజయవాడ కాదు, ఈ వూరే. నీతో అబద్ధం చెప్పడం పాపంగా భావించి నిజం చెప్తున్నాను. నా గురించి నీకు పూర్తిగా నిజం చెప్పదల్చాను."

"చెప్పండి" అందామె.

"నేనొక పిక్ పాకెట్ ని. అదృష్టవశాత్తూ ఇంతవరకూ జైలుకి వెళ్ళలేదు. నేను పట్టుబడలేదు. ఆ రోజు నీ హేండ్ బాగ్ కొసింది నేనే!"

ఆమె ఏమంటుంది? గదిలోంచి కోపంగా వెళ్ళిపోతుందా? తన ముఖం వంక యిటుపైన చూడనంటుందా? అతడి గుండె వేగంగా కొట్టుకుంటోంది.

"మీరు జేబుదొంగని నాకు తెలుసు" అందామె.

"ఎలా తెలుస్తున్నావు?"

"ఆ రోజు మీతో కొన్ని గంటలపాటు వున్నాను. మీ పాంటు జేబులో వున్న బ్లేడును చూశాను" అందామె.

"అంతా తెలిసి నాకు నీ సర్వస్వాన్నీ యిచ్చావా?"

"జేబుదొంగ ప్రేమకు అనర్హుడు కాకపోవచ్చు! ప్రేమ దొంగను దొరగా మార్చొచ్చు!" అందామె.

అతడు ఆమె కళ్ళలోకి చూశాడు.

"నాలో అటువంటి పరివర్తన వుద్భవించింది. నిన్ను కల్సుకున్నాక గత జీవితానికి నేను గుడ్ బై చెప్పేశాను."

"మీరు చెప్పింది విని చాలా సంతోషిస్తున్నాను" అందామె.

"నా దగ్గర లక్షపైన వుంది. దానితో యేదో వ్యాపారం చేసుకుని బతకాలని నా ఆశ" అన్నాడతను.

"మంచి మార్గాన వెళ్ళడం మనిషికి మంచిది. ఇతర్ల నష్టాలు మన లాభాలు కాకుండా జీవించాలి" అందామె.

అతడామె పక్కనే కూర్చున్నాడు.

"నిజం తెల్సాక నువ్వు ఏమంటావో అని చాలా భయపడ్డాను" అన్నాడతను.

"పెళ్ళి అయినాక నా భర్తను నేనెంతగానో ప్రేమించాను. డబ్బుకోసం ఆయన నన్ను పెళ్ళాడాడని గ్రహించాను. ఇద్దరం దూరమయిపోయాం. అప్పటినుంచి చూస్తున్నాను. మీరు నన్ను ఎంతో ఆకర్షించారు. మీ దగ్గర ఏముంది, ఎంతుంది అని నేను చూడలేదు. మీ దగ్గర ఏమీ లేకపోయినా నా ప్రేమ తరగదు."

అతడామెను బలంగా హృదయానికి హత్తుకున్నాడు. మెరుస్తూన్న ఆమె జుత్తులోకి వేళ్ళను పోనిచ్చి, ఆమె

పెదిమలను వుద్రేకంతో మూదెటుకున్నాడు.

"సాయంత్రం ఐదు లోపల నేను వెళ్లాలి" అందామె.

"మనిద్దరం ఎప్పుడూ కలిసే వుండాలి" అన్నాడతను.

"ఆ రోజు రావచ్చు. ఆ దినంకోసం యిద్దరం ఎదురు చూద్దాం" అందామె.

"రాజేశ్వరీ, నువ్వు నా జీవితాన్ని మార్చేశావు. ఇటుపైన నేను తలెత్తుకుని బతకొచ్చు" అన్నాడతను.

# 6

గదిలో రెండు ఫ్లోరసెంట్ లైట్లు వెల్గుతున్నాయి. సోఫాలో కూర్చుని రాజేశ్వరి ఏదో పత్రిక చూస్తోంది.

చప్పుడు చేయకుండా రామ్మూర్తి గదిలోకొచ్చి ఆమె కెదురుగా నిలబడ్డాడు

"శ్రీవారు యిలా వచ్చారేమిటి?" అందామె.

"నీతో మాట్లాడవలసిన అవసరం ఏర్పడింది" అన్నాడతను.

ఆమె అతడివైపు చూసింది.

"ఇవాళ పొద్దుటే పోయావు. సాయంత్రం ఆరింటికి వచ్చావు. ఎక్కడికెళ్లావు?"

"బట్టల షాపు కెళ్లాను. అమ్మాయింటికి వెళ్ళి అక్కడ వుండిపోయాను."

అతడు వెటకారంగా నవ్వాడు. ఒక ఫోటోనుతీసి ఆమె వైపు పడేశాడు. టాక్సీ పక్కనే నవ్వుతూ ఆమె వినోద్‌తో మాట్లాడుతోంది! ఈ ఫోటో తన భర్తకు ఎలా వచ్చింది?

"నువ్వు యివాళ హోటల్ మెట్రోకి వెళ్లావు అతడితో సాయంత్రందాకా గదిలో వున్నావు!"

"వున్నానేమో!" అందామె.

"నువ్వు నా భార్యవు. కులటవు కాదనుకుంటాను" అన్నాడతను.

"నేను మీ భార్యనని యీ ఫోటో చూశాక గుర్తొచ్చిందా?" ప్రశ్నించిందామె.

అతను మాట్లాడలేదు. మౌనంగా సిగరెట్ వెలిగించాడు.

"ఈ ఫోటో మీ అమ్మ చూస్తే ఏమంటారు? నిన్ను చెడామడా తిడ్తారు" అన్నాడతను.

"ఎవరు ఎంత తిట్టినా నాకు కేర్ లేదు" అందామె.

"బరి తెగించావన్నమాట!"

"మీకు నేనక్కర లేదని గ్రహించాను. డబ్బుకోసం మీరు నన్ను పెళ్ళాడారు. ఏ కోశానా మీకు నామీద ప్రేమలేదు" అందామె.

"నాకంటె ఎక్కువగా ఆ పిక్‌పాకెట్ వినోద్ నిన్ను ప్రేమిస్తున్నాడా?"

ఆమె తృళ్ళిపడింది. అతడివైపు కోపంగా చూసింది.

"అతను పిక్‌పాకెట్ కావచ్చు, గజదొంగ కావచ్చు. కాని అతడికి హృదయముంది. డబ్బుకోసం అతడు నా దగ్గరకు రాలేదు" అందామె.

"నువ్వు నీ జీవితాన్ని చేతులారా నాశనం చేసుకుంటే ఆ బాధ్యత నీదే. నాకు యాభై వేలు కావాలి. మీ అమ్మ నడిగి పట్రా."

"పట్రాకపోతే?"

"ఈ ఫోటో తీసుకెళ్ళి మీ అమ్మకు చూపిస్తాను. ఆమెతో మాట్లాడతాను. నువ్విలా ఒక పిక్‌పాకెట్‌తో కులుకుతున్నావని తెలిస్తే ఆమె నిన్ను మన్నించదు."

ఆమె అతడివైపు సూటిగా చూసింది.

"వెళ్ళి అమ్మకు చూపించండి!" అందామె.

"అంతేనా?"

"మీరు ఏంచేసినా నేను భయపడను. మీరు చేసేది చేయండి. ఐ డోంట్ కేర్!" అందామె.

## 7

రోడ్డు దీపాలు వెలుగుతున్నాయి. రామ్మూర్తి స్కూటర్ని వేగంగా పోనిచ్చాడు.

కాంపౌండులో స్కూటర్ ఆపి అతను దిగాడు. టైము చూశాడు. తొమ్మిది దాటింది. అతడు ముందు హాల్లోకి వెళ్ళాడు.

వంటామె గౌరి అతడిని పలకరించింది. "రండి. ఆమె నిద్రపోతున్నారు" అందామె.

అతడు ఆమె దగ్గరగా వెళ్ళి ఆ తవైపు పరీక్షగా చూశాడు. ఏదో అనుమానం వచ్చి ఆమెను ముట్టుకు చూశాడు. నాడి కొట్టుకోడంలేదు. ఆమె మరణించింది.

"ఈమె యిలా ఎంత సేపటినుంచి పడుకొని వుంది?" అడిగాడతను.

"సాయంత్రం నుంచయ్యా" అంది వంటామె.

అతను టెలిఫోన్ దగ్గరకు వెళ్ళి, రిసీవర్ ఎత్తి తన యింటి నంబరు తిప్పాడు.

"హాలో" అంది రాజేశ్వరి.

"నేను మీ అమ్మ యింట్లో వున్నాను. ఆమె మరణించింది. వెంటనే రా!" అన్నాడతను.

"ఆమె ఫోటో చూశాక మరణించిందా?" అడిగిందామె.

"ఆమెకు ఫోటో చూపించే అవకాశం నాకు లేకుండా పోయింది. పుణ్యాత్మురాలు ముందుగానే కన్నుమూసింది"

అన్నాడతను.

అటువైపున రాజేశ్వరి ఏడుస్తోంది.

"రాజేశ్వరీ, వెంటనే రా!" అన్నాడతను.

"వస్తున్నాను" అందామె.

రాజేశ్వరి హోటల్ మెట్రోకి ఫోన్ చేసింది. రూమ్ నంబర్ 33కి కనెక్షన్ యివ్వమంది.

"హలో, వినోద్!" అన్నాడతను.

"మా అమ్మ చనిపోయింది" అందామె ఏడుస్తూ.

"రాజేశ్వరీ, నువ్వు ఎక్కడున్నావు?"

"నా యింట్లో."

"నీ తల్లి యింటికి వెళుతున్నావా?"

"వెళ్ళాలి" అందామె.

"నేను నీతో రావచ్చా?"

"ధైర్యంగా రావచ్చు" అందామె.

"నువ్వు అక్కడే వుండు. నేను టాక్సీలో వస్తాను. వెంటనే అక్కడకు వెళ్దాం" అన్నాడతను.

"రండి" అని ఆమె రిసీవర్ పెట్టేసింది.

కాంపౌండులో టాక్సీ ఆగింది. వినోద్, రాజేశ్వరి దిగారు. వినోద్ డబ్బిచ్చి టాక్సీని పంపించేశాడు. ఆమె లోపలకు వెళ్ళింది. తల్లి శవంమీదపడి ఏడ్వసాగింది.

రామ్మూర్తి ఆమెను ఓదార్చసాగాడు.

"ఎంత ఏడ్చినా లాభంలేదు. ధైర్యం తెచ్చుకో!" అన్నాడు రామ్మూర్తి.

ఆమె మాట్లాడలేదు. కొంచెం దూరంలో నిలబడి వున్న వ్యక్తివైపు రామ్మూర్తి కోపంగా చూశాడు. ఎంత ధైర్యం? ఆమె వినోద్‌ని కూడా తీసుకొచ్చిందా?

రామ్మూర్తి లోలోపల ఆలోచించసాగాడు.

కామాక్షి మరణంతో ఎంతో ఆస్తి తన భార్యకు వస్తుంది. తను జాగ్రత్తగా వ్యవహరించాలి!

మర్నాడు కామాక్షి దహనం చేయబడింది. రామ్మూర్తి తన భార్య గదిలోకి వెళ్ళాడు.

"ఇప్పుడు ఏం చేయదల్చావు?" అడిగాడు.

"దేన్ని గురించి మీరు అడుగుతున్నారు?" అందామె.

"మనం ఆ యింటికి వెళ్ళిపోదాం" అన్నాడతను.

"వద్దు" అందామె.

"ఆ యిల్లు ఏం చేస్తావు?"

"అద్దెకిస్తాను" అందామె.

"నా సలహాల ప్రకారం నువ్వు చేయడం మంచిది" అన్నాడతను.

"నాకు ఎవరి సలహాలూ అక్కర లేదు. ఏం చేయాలో నాకు తెలుసు" అందామె.

అతడామెవైపు సూటిగా చూశాడు.

"ఇంటర్నేషనల్ ట్రేడర్స్ కంపెనీకూడా నీదే. నన్ను మేనేజర్ గా వుంచుతావా, పొమ్మంటావా?" అడిగాడతను.

"అదంతా మీ నడవడిమీద ఆధారపడి వుంటుంది" అందామె.

అతడామె దగ్గరగా వెళ్ళాడు. చేతుల్తో ఆమెను చుట్టబోయాడు. ఆమె వెనక్కి జరిగింది.

"రాజేశ్వరీ, నువ్వంటే నాకెంతో యిష్టం" అన్నాడతను.

"అందుకే సత్యభామను రహస్యంగా పెళ్ళాడారా?" అందామె.

"అది నీకెలా తెలుసు?"

"నా గురించి మీ కెలా తెలుసో అలాగే మీ గురించి నాకు తెలుసు. మిష్టర్ టామ్ మనిద్దరి తరఫునా పని చేస్తున్నాడు" అందామె.

"బాస్టర్డ!" అన్నాడతను కోపంగా.

# 8

తెల్లవారింది. హోటల్ బాయ్ 33వ నంబరు గది ముందుకు వెళ్ళాడు. తలుపును తట్టాడు. ఎవరూ జవాబివ్వలేదు. తలుపును తోశాడు తెరుచుకుంది.

అతడు లోపలకు వెళ్ళాడు. మంచంమీద ఒక స్త్రీ నగ్నంగా పడుకుని వుంది. పరుపు దగ్గరగా వెళ్ళాడు హోటల్ బాయ్.

ఆమె రక్తం మడుగులో పడుంది. భయంకరంగా అరుస్తూ హోటల్ బాయ్ బయటకు పరుగెత్తాడు. కింద నున్న మేనేజర్ గదిలోకి దూరాడు.

"ఏమైంది?" అడిగాడు మేనేజర్ జాన్.

"33 నంబరు గదిలో హత్య జరిగింది, సార్" అనాడు బాయ్.

మేనేజర్ జాన్ పైకి వెళ్ళి, అంతా చూసి తన గదికి చేరుకున్నాడు. టెలిఫోన్ రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాడు.

"హాలో, ఇన్ స్పెక్టర్ నాయర్" అంటో కంఠం.

"సార్, నేను జాన్, హోటల్ మెట్రో మేనేజర్ని. 33 గదిలో హత్య జరిగింది. వెంటనే రండి" అన్నాడతను.

"మిష్టర్ జాన్, ఎవర్నీ ఆ గదిలోకి వెళ్ళనివ్వకండి. నేను వస్తున్నాను" అన్నాడు ఇన్ స్పెక్టర్.

"అలాగే సార్" అని జాన్ రిసీవర్ని పెట్టేశాడు.

సిగరెట్ పీలుస్తూ జాన్ కుర్చీలో కూర్చున్నాడు. పోలీసుల రాకకోసం అతను ఎదురుచూస్తున్నాడు.

హోటల్ ముందు పోలీసు జీప్ ఆగింది.

ఇన్‌స్పెక్టర్ నాయర్ కిందకు దిగాడు. మేనేజర్ జాన్ అతడికి నమస్కారించాడు.

"రండి, ఇన్‌స్పెక్టర్, 33 నంబరు గదిలో వుంది ఆమె శవం" అన్నాడు జాన్.

ఇన్‌స్పెక్టర్ నాయర్ మేనేజర్‌తో 33 నంబరు గదిలోకి వెళ్లాడు. కాన్‌స్టేబుళ్ళు బయట పచార్లు చేస్తున్నారు.

అందంగా వున్న పడగ్గది, పక్కనే యాటాచ్‌డ్ బాత్‌రూమ్. ఇన్‌స్పెక్టర్ నాయర్ మంచం పక్కకు వెళ్ళాడు.

వెల్లకిలా పడివుందామె. కత్తితో అనేకచోట్ల ఆమె నగ్న శరీరాన్ని కసితో ఎవరో పొడిచారు. తెల్లటి దుప్పటి రక్తమయంగా వుంది.

సమీపంలో వున్న సోఫామీద ఒక పట్టుచీర, జాకెట్, బ్రాసియర్, పావడా వున్నాయి. హత్యకు వుపయోగించిన ఆయుధం గదిలో లేదు.

"ఎవరీమె?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఒకతను యీ గదిని అద్దెకు తీసుకున్నాడు. మా రిజిష్టర్‌లో మిష్టర్ అండ్ మిసెస్ వినోద్ అని రాశాడు" అన్నాడు జాన్.

"వినోద్ ఎక్కడున్నాడు?"

"అతడు ఏమైనాడో ఎవ్వరికీ తెలియదు" అన్నాడు జాన్.

ఇన్‌స్పెక్టర్ నాయర్ క్షణకాలం ఆలోచించి

మేనేజర్ వైపు తిరిగాడు.

"వినోద్ ఇంతకుముందు ఇక్కడ గదితీసుకున్నాడా?"

"చాలాసార్లు తీసుకున్నాడు" అన్నాడు జాన్.

"అప్పుడుకూడా యీ స్త్రీ అతడితో వుందా?"

"వుంది, సార్" అన్నాడు మేనేజర్.

సోఫాలో వున్న హేండ్ బాగ్‌ను యిన్‌స్పెక్టర్ చూశాడు. అందులో బాంకి సేవింగ్స్ అకౌంట్ పాస్ బుక్ వుంది. ఆమె పేరు, అడ్రెసు, ఫోన్ నంబరు అందులో రాయబడి వున్నాయి.

మిసెస్ వి. రాజేశ్వరి!

ఇన్‌స్పెక్టర్ నాయర్ మేనేజర్ వైపు తిరిగాడు.

"పక్కనే వున్న 32, 34 గదుల్లో యెవరేనా ఉన్నారా?"

"34 గది ఖాళీగా వుంది" అన్నాడు జాన్.

"ఆ గది తలుపు తెరవండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

ఒక కానిస్టేబుల్ శవం పడున్న గదిలో కాపలా ఉన్నాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ పక్క గదివైపు నడిచాడు. మేనేజర్ జాన్ తాళం తీశాడు.

గదిలో వున్న ఫోన్ దగ్గరకు వెళ్లాడు యిన్‌స్పెక్టర్ నాయర్. రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాడు. చాలాసేపు రింగయ్యాక ఎవరో అటువైపు రిసీవర్ని ఎత్తారు.

"హలో" అందో కంఠం అటువైపునుంచి.

"హలో, యిన్‌స్పెక్టర్ నాయర్ హియర్! అది రాజేశ్వరిగారి యిల్లేనా?"

"హలో, ఇది నా ఇల్లు. ఐయామ్ రామ్మూర్తి. రాజేశ్వరి నా భార్య."

"ఆమె ఇంట్లో వున్నారా?"

"లేదు. ఎక్కడికో వెళ్ళింది."

శవం ఎవరిదో తెలిసినట్లు అనిపించింది ఇన్‌స్పెక్టర్‌కి.

"రామ్మూర్తిగారూ, మీకోసం మా జీప్ పంపుతున్నాను. వెంటనే యిక్కడకు రండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

"ఏమైంది?"

"మీరు రెడీగా వుండండి" అని యిన్‌స్పెక్టర్ రిసీవర్ని పెట్టేశాడు.

ఒక కాన్‌స్టేబుల్ని పిల్చి ఏం చేయాలో చెప్పాడు. కాన్‌స్టేబుల్ బయటకు వెళ్ళిపోయాడు.

పదిహేను నిమిషాల్లో జీప్ తిరిగివచ్చింది. రామ్మూర్తి గాభరాగా 33 నంబరు గదిలోకి వచ్చాడు. ఇన్‌స్పెక్టర్ నాయర్ అతడిని మంచం దగ్గరకు తీసుకెళ్ళాడు.

నగ్నంగా పడున్న శవంవైపు భయంతో చూశాడు రామ్మూర్తి. ముఖాన్ని పక్కకు తిప్పేసుకున్నాడు.

"ఆమె మీ భార్య రాజేశ్వరేనా?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"కాదు యిన్‌స్పెక్టర్! ఆమె నా భార్య కాదు. నా భార్య యీ హోటల్లో ఎందుకుంటుంది? నన్ను మీరు యిక్కడకు యెందుకు తీసుకొచ్చారు?" ప్రశ్నించాడు రామ్మూర్తి.

సమీపంలో సోఫామీద పడున్న దుస్తులను, హేండ్ బాగ్‌ను చూపించాడు ఇన్‌స్పెక్టర్ నాయర్. వాటిని చూసి రామ్మూర్తి త్రుళ్ళిపడ్డాడు.

"అవన్నీ నాభార్య రాజేశ్వరివే!" అన్నాడు రామ్మూర్తి.

దగ్గరగా వెళ్ళి వాటివైపు పరీక్షగా చూడసాగాడు.

ఇన్‌స్పెక్టర్ నాయర్ మేనేజర్ జాన్ వైపు చూశాడు.

"మిస్టర్ జాన్, శవాన్ని సరిగ్గా చూశారా?"

"పొద్దుటే శవాన్ని చూడ్డం నాకు నచ్చదు. పరుపు వైపు ఓసారి చూసి, ఎవరో పడున్నారని కనిపెట్టి మీకు ఫోన్ చేశాను" అన్నాడు జాన్.

"మిస్టర్ జాన్, మీరుకూడా శవాన్ని పరీక్షగా చూడండి" అన్నాడు ఇన్‌స్పెక్టర్.

మేనేజర్ జాన్ నగ్నంగా పడున్న శవంవైపు చూశాడు. అతడి ఆశ్చర్యానికి అంతులేదు.

"ఈమె మిసెస్ వినోద్ కాదు. ఈమె పేరు నాగ లక్ష్మి. ఈమె 10 నంబరు గది తీసుకుంది" అన్నాడతను.

"ఆ గదిలో వుండవలసిన నాగలక్ష్మి యీ గదిలో ఎందుకుంది?" అన్నాడు నాయర్ ఆలోచిస్తూ.

సమీపంలో వున్న వాళ్ళు మౌనందాల్చారు.

"అంతా అయోమయంగా వుంది. దుస్తులు, హేండ్ బాగ్ రాజేశ్వరివి. శవం నాగలక్ష్మిది" అని ఇన్‌స్పెక్టర్ నాయర్ బయటకు నడిచాడు.

రూమ్ నంబరు 3 ' ముందు ఆగాడు. తలుపును తట్టాడు. జవాబులేదు. తలుపును తోశాడు. తెర్చుకుంది. ఇన్‌స్పెక్టర్ నాయర్, మేనేజర్ జాన్, రామ్మూర్తి గదిలోకి వెళ్ళారు. నైట్ గౌన్ ధరించిన ఒక స్త్రీ పరుపుమీద గాఢ నిద్రలో వుంది.

ఆమెవైపు ఆశ్చర్యంగా చూశాడు రామ్మూర్తి.

"నా భార్య రాజేశ్వరి యీమే" అన్నాడు రామ్మూర్తి.

"మిసెస్ వినోద్ ఆమే" అన్నాడు జాన్.

అందరూ ఆశ్చర్యంగా నిద్రపోతున్న ఆమెవైపు

చూశారు.

"ఆమెను లేపుతాను" అన్నాడు రామ్మూర్తి.

"కాన్సెపట్లో ఆమె లేస్తుంది. అప్పుడు ఆమెతో మాట్లాడొచ్చు" అని యిన్స్పెక్టర్ నాయర్ బయటకు నడిచాడు.

అందరూ అతడిని వెంబడించారు. ఒక కాన్స్టేబుల్ని 30 గదిముందు కాపలా వుండమని చెప్పి ఇన్స్పెక్టర్ నాయర్ 38 నంబరు గదిలోకి నడిచాడు.

# 9

ఇన్స్పెక్టర్ నాయర్ నాగలక్ష్మి శవాన్ని మరోసారి చూశాడు. 30 గదిలోంచి ఆమె ఈ గదిలోకి నగ్నంగా వచ్చి వుండదు. ఆమె దుస్తులు ఎక్కడో వుండాలి!

మంచం కిందకు వంగి చూశాడతను. బ్లూ కలర్ గౌను రక్తం మరకలతో పడుంది. గౌను అనేకచోట్ల చిరిగింది.

గౌన్ వైపు ఇన్స్పెక్టర్ నాయర్ పరీక్షగా చూశాడు. హత్య జరిగే సమయంలో ఆ గౌను కిందపడి వుంటుంది. నాగలక్ష్మి యీ గదిలోకి వచ్చి ఎందుకు పడుకుంది? ఆమెను ఎవరు చంపారు? మిస్టర్ వినోద్ ఏమయ్యాడు? తీవ్రంగా ఆలోచిస్తూ, రామ్మూర్తి దగ్గరకు వెళ్లాడు యిన్స్పెక్టర్.

"వినోద్ అనే వ్యక్తి మీ భార్యతో వచ్చి యీ గది తీసుకున్నాడు. మిసెస్ వినోద్ పేర్తో మీ భార్య వ్యవహరిస్తోందిక్కడ. ఆ వినోద్ యెవరో మీకు తెలుసా?" అడిగాడు యిన్స్పెక్టర్.

విచారవదనంతో రామ్మూర్తి యిన్స్పెక్టర్ వైపు చూశాడు.

"ఇన్ స్పెక్టర్, మీకు ఏం చెప్పాలో తెలియడం లేదు!" అన్నాడు రామ్మూర్తి.

"తెలిసినదంతా చెప్పండి."

"నా భార్య పెద్దింటి పిల్ల. వినోద్ అనే వ్యక్తితో ఆమెకెక్కడో పరిచయమైంది. అతడితో ఆమె తిరుగుతోందని నాకు తెలుసు. అతడి దగ్గరకు వెళ్ళొద్దని ఆమెతో యెంతో చెప్పాను. కాని ఆమె నా మాట వినలేదు."

"వినోద్ ఏమి చేస్తున్నాడు?"

"అతడొక జేబుదొంగ. ఛీట్! డబ్బుకోసం నా భార్యతో అతడు స్నేహం చేస్తున్నాడని నాకు తెలుసు. కాని నా భార్య గుడ్డిది. నేనెంత చెప్పినా వినదు."

"నిన్న రాత్రి ఆమె మీ యింట్లో లేదా?"

"లేదు."

"ఆమె ఏమైందో కనుక్కోడానికి మీరు ప్రయత్నించలేదా?"

"ఆమే తిరిగివస్తుందని వూరుకున్నాను."

"వినోద్ పిక్ పాకెట్ అని మీకెలా తెలుసు?" అడిగాడు యిన్ స్పెక్టర్.

"కనుక్కున్నాను."

"ఎలా?"

"ఇన్ స్పెక్టర్, నా భార్య సరైన తోవమ్మట పోవటంలేదు. ఆమె యేం చేస్తోందో తెలుసుకోమని ఎవరెస్టు డిటెక్టివ్ ఏజన్సీ టామ్‌తో చెప్పాను. అతడు అంతా కనుక్కొని నాకు రిపోర్టు పంపాడు."

టామ్ పేరు విని ఇన్ స్పెక్టర్ నాయర్ తనలో తను

నవ్వుతున్నాడు. టామ్ దేవాంతకుడు.

డాక్టర్ సుధాకర్ గదిలోకొచ్చాడు. శవాన్ని పరీక్షించడం అతడు ప్రారంభించాడు. కొంతసేపయ్యాక అతడు నాయర్ ముందుకు నడిచాడు.

"రాత్రి పదకొండూ, పన్నెండు మధ్య యీమె మరణించి వుండాలి. చాలా కసితో చంపబడింది" అన్నాడు డాక్టర్ సుధాకర్.

శవం ఫోటోలు తీస్తున్నారు. ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆలోచిస్తూ బయటకు నడిచాడు. 30 గది ముందుకు వెళ్ళాడు. కాన్‌స్టేబుల్ బయట నిలబడి వున్నాడు.

"ఆమె లేచిందా?"

"చూడలేదు. సార్."

తలుపు మూసి ఇన్‌స్పెక్టర్ నాయర్ లోపలకు వెళ్ళాడు. ఆమె మంచంమీద లేదు!

ఆమె ఏమైంది? బాత్‌రూమ్‌లోకి వెళ్ళిందా?

"హలో, యిన్‌స్పెక్టర్, నమస్తే!" అందామె టెలిఫోన్ పక్కనుంచి.

"రాజేశ్వరిగారూ, ఎవరికేనా ఫోన్ చెయ్యాలా?" అడిగాడు యిన్‌స్పెక్టర్.

"చేశాను" అందామె.

ఇన్‌స్పెక్టర్ నాయర్ ఆమెవైపు చూశాడు.

"33 నుంచి మీరు యీ గదికి ఎలా వచ్చారు?" అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"ఈ గదిలోకి మారవలసిన అవసరం వచ్చింది."

"ఏమిటది?"

"అది మీకు అనవసరం" అందామె.

"రాజేశ్వరీ, రూమ్ నంబరు 33లో నాగలక్ష్మి హత్య

చేయబడింది!"

ఆమె ఉలిక్కిపడింది. ఇన్‌స్పెక్టర్ వైపు నిర్ఘాంత పోతూ చూసింది.

"ఎవరు చంపారామెను?"

ఆమె ప్రశ్నకు యిన్‌స్పెక్టర్ జవాబివ్వలేదు.

"వినోద్ ఎక్కడున్నాడు?"

"ఎందుకు?"

"నాగలక్ష్మిని అతడే చంపివుండాలని నా అభిప్రాయం."

"ఆయన నిన్న రాత్రి పదిన్నరకే యీ హోటల్ విడిచి వెళ్ళిపోయాడు" అందామె.

"మళ్లా హోటల్‌కి తిరిగి వచ్చి వుండొచ్చు."

"రాలేదు."

"రాజేశ్వరిగారూ, యిది హత్య. నేను అడిగే ప్రశ్నలకు సూటిగా జవాబివ్వండి."

"యిస్తున్నాను."

"ఈ గదిలోకి మీరు ఎందుకు మారారు?"

"ఎవరో నాకోసం రూమ్ నంబరు 33కి వస్తున్నారని వార్త వచ్చింది. ఆ వ్యక్తిని చూడ్డం నాకిష్టంలేదు. నాగలక్ష్మితో మాట్లాడి ఆమె గదికి మారాను. ఆమె వెళ్ళి 33లో పడుకుంది."

"33 నంబరు గదికి ఎవరు వస్తారని మీకు తెలిసింది?"

"నా భర్త రామ్మూర్తిగారు."

"ఆ వార్త మీకు ఎలా అందింది?"

"ఎవరెస్టు డిటెక్టివ్ ఏజన్సీ టామ్ ఫోన్ చేసి నాతో చెప్పాడు."

"అతడు మీ తరఫున పని చేస్తున్నాడా?"

"చేస్తున్నాడు" అందామె.

గదిలో అతడు పచార్లుచేసి ఆమె ముందు ఆగాడు.

"మీరు ఆ మంచంమీద వున్నారనుకుని హంతకుడు అక్కడ పడుకున్న నాగలక్ష్మిని పొడిచి, పొడిచి చంపాడు" అన్నాడు నాయర్.

ఆమె కళ్ళు మూసుకుంది. కాస్సేపట్లో కన్నీళ్ళు కిందకు కారాయి.

"మీరు గది మారినట్లు వినోద్ కి తెలుసునా?"

"తెలుసు. ఆయనా, నేనూ యీ గదికి వచ్చాం. ఇక్కడనుంచి ఆయన వెళ్ళిపోయారు."

"వినోద్ ఎక్కడున్నారు?"

"కాస్సేపట్లో ఆయన ఇక్కడుంటారు. మీరు ఆయనతో మాట్లాడొచ్చు" అందామె.

ఇన్ స్పెక్టర్ నాయర్ ఆమెవైపు సూటిగా చూశాడు. ఆమె ముఖం నిర్మలంగా వుంది. లోపల ఏదో వుంచుకుని పైకి మరొకటి చెప్పే వ్యక్తిలా లేదామె.

"మీ భర్త రామ్మూర్తిగార్ని గురించి మీరు ఏం చెప్పగలరు?"

"డబ్బుకోసం ఆయన నన్ను పెళ్ళాడారు. నాన్న తన కంపెనీకి మేనేజర్ గా ఆయన్ని నియమించారు. ఆయన నన్నెప్పుడూ ప్రేమతో చూడలేదు. ఈ మధ్యనే ఆయన ఆఫీసులో పనిచేసే టైపిస్టును రహస్యంగా పెళ్ళాడారని విన్నాను."

"ఎవరు చెప్పారు?"

"మిస్టర్ టామ్."

"టామ్ తన కత్తిని రెండువైపులా వాడుతున్నాడు" అన్నాడు నాయర్.

ఇన్‌స్పెక్టర్ నాయర్ బయటకు నడిచాడు. గుమ్మంలో నిలబడి వెనక్కి తిరిగి ఆమెవైపు చూశాడు.

"ఈ గదిలోంచి కదలకండి, నా పర్మిషన్ లేకుండా. వినోద్ వస్తే యిక్కడే ఉండమనండి" అన్నాడతను.

"అలాగే" అందామె.

శవం వున్న గదిలోకి వెళ్ళాడు యిన్‌స్పెక్టర్. డాక్టర్ సుధాకర్ తన పని ముగించి వెళ్ళిపోయాడు. మేనేజర్ జాన్ తన ఆఫీసు గదికి చేరుకున్నాడు. ఒక సోఫాలో రామ్మూర్తి కూర్చుని వున్నాడు.

అతడి కెదురుగా ఆగాడు యిన్‌స్పెక్టర్.

"నిన్న రాత్రి మీరు యిక్కడకు, యీ గదిలోకి, వచ్చారా?"

"రాలేదు."

"మీరు 33 నంబరు గదికి వస్తున్నారని రాజేశ్వరికి ఎవరో చెప్పారు!"

"ఎవ్వరూ చెప్పి వుండరు. ఆ పుకారును వినోద్, నా భార్య సృష్టించి వుంటారు."

"ఎందుకలా చేస్తారు?"

"ఈమెను నేనే చంపానని మీరు అనుమానించాలి. నేను ఉరితీయబడాలి. వాళ్ళకు కావలసింది అదే. నేను పోతే వాళ్ళిద్దరూ హాయిగా కులకొచ్చు!" అన్నాడతను.

"మీరు యిక్కడకు రాలేదంటారు?"

"రాలేదు. వినోద్ జేబుదొంగ. అతడు ఎంత ఘోరమైన పనేనా చేస్తాడు. నాగలక్ష్మి అతడి పాత ఖాతా అయివుంటుంది. తన జీవితంలోంచి వినోద్ ఆమెను తొలగించి వుంటాడు. ఆ నేరాన్ని నామీద మోపడానికి అతడు ప్రయత్నం చేస్తున్నాడు" అన్నాడు రామ్మూర్తి.

"రామ్మూర్తిగారూ, మీ భార్య రాజేశ్వరి ఎక్కడికీ పారిపోలేదు. 30 నంబరు గదిలో వుంది."

"అక్కడ ఏం చేస్తోంది?"

"నిన్న రాత్రి మీరు వస్తున్నారని తెలుసుకుని ఆమె మరో గదికి చేరుకుంది. ఆ గదిలో వుండే ఆమె ఇక్కడ పడుకుంది. రాజేశ్వరికి బదులు హంతకుడు నాగలక్ష్మిని చంపేశాడు."

"ఏ హంతకుడూ అంతమూర్ఖుడై వుండడు. హంతకుడు పొరబాటు చేసి వుండడు. తనకు కావలసినవ్యక్తినే అతడు చంపివుంటాడు" అన్నాడు రామ్మూర్తి.

అదే సమయంలో ఒక యువకుడు గదిలోకొచ్చాడు.

"వినోద్ నేనే" అన్నాడతను.

రామ్మూర్తి అతడివైపు ఆగ్రహంతో చూశాడు.

"మిష్టర్ వినోద్, మీరు నిన్న రాత్రి ఎక్కడకు వెళ్ళిపోయారు?"

"మరో హోటల్ కి."

"రాత్రంతా అదే హోటల్లో వున్నారా?"

"హోటల్ మేరీ, రూమ్ నంబరు 22. పదిన్నరకు యిక్కడనుంచి వెళ్ళిపోయాను. హోటల్ మేరీలో నా ఫ్రెండు కనిపించాడు. అతడూ, నేనూ పదకొండునుంచి పన్నెండుదాకా బీరు తాగుతూ కూర్చున్నాం. అతడు వెళ్ళిపోయాక నేను పడుకున్నాను"

"మీరు ఎందుకు వెళ్ళిపోయారు?"

"రాజేశ్వరి భర్త వస్తున్నాడని విని వెళ్ళిపోయాను. అతడు ఏం చేస్తాడో అని నా భయం!"

"నాగలక్ష్మితో మీకెలా పరిచయమైంది?"

"ఆమె రాజేశ్వరితో స్నేహం చేసింది. ఈ హోటల్లో

వుండి, ఆమె ఏదో హాస్పిటల్లో నర్సుగా పనిచేస్తోంది. రాజేశ్వరి ద్వారా ఆమె నాకు తెలుసు" అన్నాడు వినోద్.

శవం వైపు చూసి వినోద్ విచారవదనంతో యిన్‌స్పెక్టర్ వంక చూశాడు.

"ఈ అమాయకురాల్ని పొట్టబెట్టుకున్న హంతకుడిని మీరు వెంటనే పట్టుకోవాలి, సార్" అన్నాడు వినోద్.

"అతడు మీముందే వున్నాడు! దుర్మార్గుడు" అర్చాడు రామ్మూర్తి.

ఇన్‌స్పెక్టర్ నాయర్ చూపు వినోద్ నుంచి రామ్మూర్తి మీదకు వెళ్ళింది.

"ఇన్‌స్పెక్టర్, నిన్న రాత్రి రామ్మూర్తిగారు యీ హోటల్‌కి రావడం రిసెప్షన్‌లో వుండే గుమస్తా కామరాజు చూశాడు" అన్నాడు వినోద్.

"నన్ను యీ హత్యలో యిరికించడానికి అతడు ప్రయత్నిస్తున్నాడు. జేబుదొంగ మాటల్ని నమ్మకండి" అర్చాడు రామ్మూర్తి.

ఒక కానిస్టేబుల్ని పిల్చి, ఏదో చెప్పాడు నాయర్. అతడు వెళ్ళిపోయాడు. కాస్సేపట్లో ఒక యువకుడు లోపలకు నడిచాడు. అతడివైపు రామ్మూర్తి గాభరాగా చూశాడు.

"ఇన్‌స్పెక్టర్, కామరాజు నేనే సార్" అన్నాడతను.

రామ్మూర్తి వైపు చెయ్యి చూపించాడు ఇన్‌స్పెక్టర్.

"నిన్న రాత్రి ఆయన యీ హోటల్‌కి వచ్చారా?"

రామ్మూర్తివైపు పరీక్షగా చూశాడతను.

"ఆయన్ని చూశాను, సార్. వచ్చారు."

అమాంతంగా రామ్మూర్తి సోఫాలోంచి లేచాడు.

గుమ్మంవైపు పరుగెత్తాడు. అతడివైపు వినోద్ పులిలా దూకాడు. అతడిని బలంగా తన చేతుల్తో చుట్టి పట్టుకున్నాడు.

రామ్మూర్తి చేతులకు యిన్‌స్పెక్టర్ వాయర్ బేడీలు వేశాడు. అతడిని తోసుకెళ్ళి కుర్చీలో కూర్చోబెట్టారు.

పిచ్చివాడిలా అందరివైపూ రామ్మూర్తి చూశాడు. అతడి కళ్ళు ఎర్రగా వున్నాయి.

"నేను ఘోరమైన పాపం చేసినందుకు బాధపడుతున్నాను. జీరోవాట్ బల్బు కాంతిలో ఆమె నాకు సరిగ్గా కనపడలేదు. ఆ కారణంగా బదులు ఒక అమాయకురాల్ని హతమార్చినందుకు యెంత శిక్ష విధించినా భరిస్తాను" అన్నాడు రామ్మూర్తి.

—:అయిపోయింది:—

# కలల సుందరి

## చంద్రశేఖర అజాద్

"ఏమిటిరా అంత హడావుడి" అన్నాడు ప్రసాద్.

"నువ్వుముందు బయలుదేరు" తొందర చేశాడు సురేష్.

ప్రసాద్ ఇంక మాట్లాడలేదు. లేచి వెంటనే డ్రెస్ చేసుకున్నాడు. ఇద్దరూ ఊరవతల పార్కుకెళ్ళారు. ఆ పార్కులో, ఆ సమయంలో ఎవరూ లేరు. తోటమాలి ఏదో పని చేసుకుంటున్నాడు.

ఆ పార్కులో రాత్రిపూట లైట్లు వెలగవు. త్రోవ పొడుగునా రాలిపడున్న ఎండుటాకులు, పూలతో ఆ ప్రాంతమంతా అపరిశుభ్రంగా వుంది. క్రోటన్స్ అస్తవ్యస్తంగా పెరిగి వున్నాయి. పార్కు పక్కనే వున్న చెరువు నీటినిండా కప్ప గుడ్లు వున్నాయి. ఆ నీటినుండి ఓ రకమైన వాసన కొడుతూంది.

"ఇదేమిటిరా ఇక్కడకు తీసుకొచ్చావు. ఇక్కడ భరించలేనంత దుర్వాసనగా లేదూ" అన్నాడు ప్రసాద్.

"వాసనలేదు గీసనలేదుగాని ముందు నా కోమాట

ఇవ్వాలిరా" అన్నాడు సురేష్.

"ఏమిట్రోయ్. వింతగా అడుగుతున్నావు."

"ఏం లేదురా. ఓ సీక్రెట్."

"వ్యక్తిగతమా."

"అవును. అయితే ఇందులో నాకు కొన్ని సందేహాలున్నాయి. ఈ వార్త మనవాళ్ళకు తెలిస్తే గల్లంతు చేస్తారు. అందుకే నీ సలహాకోసం వచ్చాను."

"ఏమిటో చెప్పు."

"దయచేసి ఈ విషయం ఎవరికీ తెలియచేయకూడదు. ఇది నా రిక్వెస్టు."

"ఓ.కె. చెప్పు."

"నాకో లెటర్ వచ్చింది" అన్నాడు సురేష్.

"ఏం లెటరది."

"నువ్వే చదువు" అంటూ జేబులోనుండి తీసిచ్చాడు.

తెల్లటి కాయితం.

దానిమీద అక్షరాలు గుండ్రంగా వున్నాయి.

"ప్రియమైన సురేష్....

ఎవరో అని ఆశ్చర్యపోతున్నారు కదూ.... కనుక్కోండి చూద్దాం!

మీకు గుర్తుందా' మీరు నేను కాలేజీకి వెళుతుంటే నా వెంట వస్తుండేవారు. మీరొక్కరే కాదనుకోండి. మీతోపాటు ఆ దూడ మొఖం సుబ్బారావు, నల్లతుమ్మ మొద్దులా ఉండే గుప్తానో సేట్ గారో, రౌడి రంగడిలా మీసాల్లో వీర్రాజు (పేరు చూడండి. ఎంత భయంకరంగా ఉందో. నా ఉద్దేశ్యంలో "స్టూడెంట్" అనిపించుకోవ

టానికి ఉండే అరవ్తల్లో, క్లుప్తంగా ఉండే పేరే కాదు, అది ఆధునికంగానూ, అందంగానూ వుండాలి—'సురేష్'లా. అలాగే 'వెంకాయమ్మ' అనే పేరున్న అమ్మాయిల్ని మీరెంత గొడవ చేస్తారో మేమూ అంతే సుమా) ఇంక సో అండ్ సోగార్ళు చాలామందితో వస్తూ గొడవచేస్తుంటే మేమంతా కోపం నటించేవాళ్ళం.

నిజానికి మీ జనాభాకు అందంగా గొడవ చేయటం కూడా వచ్చా అని నా సందేహం. ఇరవై నాలుగ్గంటలూ కుళ్ళు జోకులు వెయ్యటం తప్పించి, భాషా దరిద్రం తప్పించి, మాకు వాంతులు రావటం తప్పించి అదేం గొడవో నా కిప్పటికీ అర్థం కాలేదు.

అయితే మీరు అందులోనుండి మినహాయింపు. మీ జోక్స్‌కోసమే నేను చెవులు రిక్కించేదాన్ని. ఎంత హ్యూమరస్‌గానూ, యెంత లవ్‌లీగానూ ఇంకా చెప్పాలంటే అట్రిసిక్‌గానూ ఉంటాయి. అందుకే ఐ లైక్ యూ సురేష్. మీరంటే నాకిష్టం కనుకే ఈ లెటర్ రాస్తున్నాను.

నేనెవరో ఊహించుకోండి. తిరిగి వారం రోజుల్లో మరో లెటర్ రాస్తాను. అప్పుడు నా అడ్రసుతోసహా. ఈ లోపు నే నెవరో కను క్కోవటానికి చిన్న క్లూ ఇస్తున్నాను. థాట్ ప్రోవోకింగ్ కోసమే సుమా. నన్ను తెలుసు కోవటానికి మీరెన్ని టీలు త్రాగారో, సిగరెట్లు ఎన్ని పెట్లు కాల్చారో [చట్టబద్ధ హెచ్చరిక—

పొగ [తాగటం హానికరం] ఈసారి రాస్తారు కదూ....

ఉంటాను. మీ ప్రియమైన
సి. బి."

చదివి తల పైకెత్తాడు.

"ఎవరంటావ్?" అన్నాడు సురేష్‌ని.

"అదే అర్థం కావటంలేదు. కాలేజిలో మనం ఎంత మంది వెనకబడ్డామో నీకు తెలియందేముంది. ఆడపిల్ల కనబడితే చాలు ఏదో ఒక జోక్ విసుర్తూ హంగామా చేసేవాళ్ళం" ఆలోచిస్తూ అన్నాడు.

"సి.బి. అంటే ఏమిటిరా."

"అదే అర్థం కావటంలేదు. సి. ఇంటి పేరయితే బి. పేరయి ఉండాలి. 'బి'తో మొదలయ్యే వారి పేర్లు నీకు గుర్తున్నాయా? భారతి.... భార్గవి, భరణి, భానుప్రియ."

"ఆవిడ కూడా అంటోంది 'బి' ఇంటిపేరయి 'సి' ఆమె పేరు కావచ్చు కదా!"

" 'సి'తో మొదలయ్యే వారెవరున్నారు" అంటూ ఆలోచించటం ప్రారంభించాడు సురేష్.

"నా అనుమానం మన వెధవల్లో ఎవడన్నా రాసి వేశాడేమో అని. సి.బి.ఐ. అని రాయబోయి సి.బి. అని రాసుంటారు."

"సి.బి. అన్నా కూడా క్రైంబ్రాంచే" అన్నాడు సురేష్.

ఇద్దరూ నవ్వుతున్నారు.

"నాకూ నువ్వన్నట్లు అనుమానం వేసింది. మన ఫ్రెండ్స్ ఎవరయినా గొడవ చేయటానికి రాశారేమో

అని. కాని ఆ తెల్లటి కాయితం చూడు. మన వెధవలకి అంత లేస్టుకూడా ఏడ్చిందా! దానిమీద ఉన్న అక్షరాలు యెంత అందంగా వున్నాయి. అలా రాయటం మన వాళ్ళలో ఒక్కడికి రాదని నేను ఛాలెంజ్ చెయ్య గలను. ఇంకో విషయం ఖచ్చితంగా చెప్పగలను. ఈ లెటర్లో భాష చూశావ్. అక్కడే నాకు అనుమానం. అలాంటి భాషలో లెటర్ రాయటం, కనీసం ఇమిటేట్ చేయటం కూడా మనలో ఎవడికీ సాధ్యంకాదు. ఓసారి శంకర్ గాడు లవ్ లెటర్ రాశాడు. అబ్బ .... ఆ భాష చూస్తే శరీరం ఎంత గగుర్పొడిచిందని."

"అన్నీ బూతులా."

"బూతులుకాదు. శ్రీనాథుడి శృంగార నైషధంనుండి మొదలయి, సమస్త కావ్యాల్లోని వర్ణనలు చేశాడు. అది చదువుకోవాలంటే ఓ తెలుగు నిఘంటువు కూడా కొనివ్వాల్సి వుంటుంది."

"ఆ మేరకు భాషాసేవ చేసినట్లేగా."

"నాకో విషయం అర్థంకాదు. వీళ్ళసలు ప్రేమలేఖలు ఎందుకు రాస్తారో. ప్రేమించుకోటానికా, తమ భాషా పాండిత్యాన్ని నిరూపించటానికా" అన్నాడు సురేష్.

"థాట్ ప్రొవోకింగ్ కోసమేమో" నవ్వుతూ అన్నాడు ప్రసాద్.

సురేష్ కొంచెంసేపు మాట్లాడలేకపోయాడు.

"అఫ్‌కోర్స్. ప్రేమలేఖల ప్రయోజనం అది కూడా కావచ్చు. నా ఉద్దేశ్యం మన ప్రేమను ఎగ్జిబిట్ చెయ్య టానికయినా మనకంటూ ఓ భాష ఏడ్చిందిగా. ఇప్పుడీ సి.బి. చూడు ఎంత చక్కగా రాసిందో .... అందుకే చెబుతున్నా ఈ లెటర్ రాసింది మనవాళ్ళు కాదు....

కాదు...."

"మరీ సస్పెన్స్ ఏమిట్రా?"

"కాలం మారిపోతోంది కదా. అందుకే లవ్ లెటర్ స్టైల్లోనూ మార్పులొస్తున్నాయి."

"దాన్ని నువ్వు లవ్ లెటరనకు. లైకింగ్ లెటరే."

"లైకింగ్ కూ, లవ్ కూ పెద్ద తేడా ఉంటుందనుకోను."

"పొరపాటు. ఇష్టం వేరు. ప్రేమ వేరు."

"సరే. ఆ గొడవ తర్వాత యిప్పుడు నేనేం చెయ్యాలి?"

"నువ్వేం చెయ్యొద్దు" అన్నాడు ప్రసాద్.

"అదేమిటిరా" అన్నాడు సురేష్ కంగారుగా.

"అవును. ఈ సి.బి. ఎవరో నాకు తెలియదు. తనెవరో తెలియచేస్తానంటూ ఆమె రాసింది. అందుకు ఓ వారం రోజులాగు. ఈలోపు నీ ప్రయత్నం చెయ్యి. బట్ ఒక్క విషయం. ఎన్ని టీలు. ఎన్ని సిగరెట్స్ తాగుతున్నావో లెక్క రాసుకో."

సురేష్ నవ్వాడు.

"నిజంగా లెటర్ రాసేది ఓ అందమైన అమ్మాయనుకో. ఆ తర్వాతేం చెయ్యాలి" అన్నాడు సురేష్.

"నువ్వూ లెటర్ రాయాలి."

"ఆ తర్వాత."

"ఆమె రాస్తుంది."

"ఫైనల్ గా...."

"ప్రేమకు గమ్యం ఏమిటని నువ్వు భావిస్తున్నావో దాన్నిబట్టి వుంటుంది."

"అంటే."

"కొంతమంది తమ ప్రేమకు గమ్యం బెడ్ మీదకు చేరటం అనుకోవచ్చు. మరికొందరు వివాహం చేసుకుని సంసార జీవితం గడపటం అనుకోవచ్చు. లేదా ఇంకేదైనా అనుకోవచ్చు. ఇవేవి నెరవేరాలన్నా అన్ని పరిస్థితులు సహకరించాలి. సో.... బెస్టాఫ్ లక్."

సురేష్ కొంచెంసేపలానే ఆలోచిస్తుండిపోయాడు.

"నాకూ ఈ విషయంలో అనుమానాలున్నాయి. నన్ను అల్లరిపెట్టటానికే ఇది యెవరైనా రాసివుంటే ఉండొచ్చు. వారం రోజుల తర్వాత లెటరంటూవస్తే, ఆమెవరో తెలిస్తే అప్పుడు ఆలోచిస్తాను. నిజానికి ప్రేమ గురించి ఇంతవరకు నేను ఆలోచించలేదు. యేది ఏమైనా ఈ వ్యవహారం మనిద్దరినడుమ వుండాలి.

"ఇంక వెళ్దామా" అన్నాడు ప్రసాద్.

"శ్రమ ఇచ్చానా."

"శ్రమేముంది. ఈ లవ్ గేమ్‌లో పాలు పంచుకోవటం నాకూ ఆనందంగా వుంది."

"ఈ గేమ్ సక్సెస్‌ఫుల్‌గా ముగియాలని నా కోర్కె."

ప్రసాద్ లేచాడు.

సురేష్ అనుసరించాడు.

## 2

వారంరోజులు గడిచాయి.

పోస్టుమన్ అందించిన లెటర్ ఆత్రంగా చించి చదువుతున్న సురేష్ మొఖంలో చకచక రంగులు మారిపోయాయి. పెదవులమీద చిరుదరహాసం .... పెరిగిన గుండె సవ్వడి.... లెటరంతా చదివి చిన్నగా అరుస్తూ గాల్లోకి లేచాడు సంతోషంగా.

వెంటనే ప్రసాద్ గదికి పరిగెత్తాడు.

"సక్సెస్ ప్రసాద్. విజయం సాధించా" అంటూ అతన్ని పట్టుకొని ఊపేశాడు.

"ఏమయిందిరా" అన్నాడు విడిపించుకుంటూ.

"లెటర్ రాసిందెవరో తెల్సా" అన్నాడు సురేష్.

వా స వా ని కి వారం రోజులక్రితం ఆ విషయం మాట్లాడుకున్నాక ప్రసాద్ ఆ సంగతి మరిచిపోయాడు. ఈ వారం రోజులు సురేష్ పైతం కలుసుకోలేదు.

"నాకెలా తెలుస్తుంది. ఇంతకీ ఎవరామె."

"నా కలల సుందరి."

"డోంటాక్ నాన్సెన్స్. మొన్నమొన్న ఎంతమందిని గొడవ చెయ్యలేదని అన్నావ్. ఈ రోజు ఎవరో తెలిసేసరికి కలల సుందరి అయ్యిందా?"

"అది కాదురా సి.బి. అంటే యేమిటనుకున్నావ్. కాలేజి బ్యూటీ."

"ఎవరా తల్లి."

"ఇంకా గుర్తు రాలేదు....ఆషా."

"ఓ! ఆ అమ్మాయా."

"అవును. ఆ అమ్మాయే. మనందరి కలలసుందరి. ఆమే లెటర్ రాసింది" ఉత్సాహంగా చెప్పాడు సురేష్.

"నిజమా" అప్రయత్నంగా అడిగాడు.

"ఇదిగో లెటర్" అందించాడు.

"డియర్ సురేష్....

వారంరోజుల సస్పెన్స్ బ్రద్దలు చేస్తున్నాను. ఇన్ని రోజులూ నేనెవరో కనుక్కోవటానికి మీరు చాలా ప్రయత్నాలు చేశారనుకుంటున్నాను. సి. బి. అంటే తెలిసిందా! "కాలేజి బ్యూటీ"

మీరంతా నన్నలా పిలుస్తుందేవారని నాకు తెలుసు. అందుకే అలా రాశాను. అలాగే భవిష్యత్ లోకూడా "సి.బి." అనే రాస్తుంటాను.

ఇంక మనం ఇంటర్మీడియట్ పూర్తిచేసి అందరం విడిపోయాం. ఇప్పుడు ఒక్కొక్కరు ఒక్కో చోట చదువుతున్నాం. అంతమాత్రాన మన స్నేహం అంతం కాకూడదు. మీరు లెటర్ రాయండి. నేనుకూడా తరుచుగా రాస్తుంటాను.

ఉంటామరి—

మీ

సి. బి."

చదివి సురేష్ కళ్ళలోకి చూశాడు ప్రసాద్.

అతని శరీరమంతా ఆనందంతోనూ, గర్వంతోనూ కూడిన భావంవల్ల నేమో ఓ విధమైన టెంక్షన్ కులోనయి ఉంది.

ఆషా అపురూపంగా వుంటుంది. వారిది సంపన్న కుటుంబం మాత్రమేకాదు. ఆధునికతను వారు తమ జీవితంలో ఓ భాగం చేసుకోగలిగారు. అందుకే ఆ ఊర్లో 'ఆషా' అంటే పెద్ద క్రేజ్. ఆమె వస్త్రధారణ విషయంలోనూ, ఆఖరకు ఆమె అప్పుడప్పుడు సైకిల్ తొక్కుకుంటూ కాలేజీకి వచ్చే విషయంలోనూ విద్యార్థులే గాక ఇంకా చాలామంది చర్చించుకునేవారు. ఆ పట్టణం స్థాయి అది.

ఆమె కళ్ళు నల్లగా వుంటాయి. తెల్లటి శరీరం. చీర కట్టినా పంజాబీ డ్రెస్ వేసినా, మినీ స్కర్ట్ వేసినా ఆమె పాలరాతి శిల్పంలా వుండేది. ఆ అమ్మాయి నిజం

గానే ఎందరో కలల సుందరి. ఆమెను అంతగా ఆరాధించేవారు. సురేష్ అలాంటి వ్యక్తినుండి లెటర్ రాగలదని ఊహించలేకపోవటానికి కారణం అదే.

"కంగ్రాచ్యులేషన్స్" అన్నాడు ప్రసాద్.

"థాంక్యూ."

"అయితే ఒక్క విషయం. 'ఆషా' నీకు లెటర్ రాయటం నిన్ను నిజంగా అభినందించదగ్గదే. ఎందుకంటే చాలామంది విద్యార్థుల్లో ఆ అమ్మాయి నిన్నే గుర్తు పెట్టుకొని, నీ అడ్రసు సంపాదించి మరీ లెటర్ రాసింది. పర్యవసానం కూడా ఆలోచించు. వారి కుటుంబ స్థితి గతులు, వారి కులం ఇవన్నీ దృష్టిలో వుంచుకో. పెన్ ఫ్రెండ్ షిప్ చేయటం వేరు. ఈ రోజు అనేక పత్రికల్లో అడ్రసులు తీసుకొని రాసేవారున్నారు. అంతకంటే ఎక్కువ చేసుకొని ప్రాబ్లమ్స్ క్రియేట్ చేసుకోకు. అదే నా సలహా" అన్నాడు ప్రసాద్.

"తప్పకుండా" అన్నాడు సురేష్ యాంత్రికంగా.

వాస్తవంగా అతనీ లోకంలో లేడు. 'ఆషా'కు వెంటనే లెటర్ రాయాలి. అదే ఆలోచన.

"మరి నేను వస్తారా" అన్నాడు సురేష్.

"మంచిది."

"మరోసారి చెబుతున్నానని ఏమనుకోకు. ఈ విషయం మనిద్దరి నడుమే వుండాలి" అన్నాడు సురేష్ బ్రతిమాలుతున్నట్లు.

"నీకూ ఓ విషయం చెప్పాలనుకుంటున్నాను. నా గురించి నువ్వేం సందేహం పెట్టుకోకు. 'ఆషా' లెటర్ రాసిందన్న ఉత్సాహంతో అనవసరంగా ఉద్రేకపడి ఊరంతా చెప్పేయకు. ఆ తర్వాత పరిస్థితులు చాలా

అసహ్యకరంగా వుంటాయి."

సురేష్ అవాక్కయి నిలబడ్డాడు.

నిజమే. సురేష్‌లో అలాంటి బలహీనత వుంది. ప్రసాద్ ఆ విధంగా హెచ్చరించకపోతే ఎవరో ఒకరికి చెప్పటం, ఆ వార్త అలా పాకి గందరగోళం ఏర్పడటం జరిగేదే.

"నేనెందుకు చెబుతాను" అని పైకయితే అన్నాడు కాని మిత్రుడ్ని మనసులో అభినందించకుండా వుండలేక పోయాడు.

ఉత్సాహంగా వెళుతున్న సురేష్‌వంక చూసి
జాలిగా నవ్వుకున్నాడు ప్రసాద్.

## 3

ఉమెన్స్ కాలేజీ ఆవరణ అది. వివిధ రకాల దుస్తుల్లో ఎంతో ఆకర్షణీయంగా తిరుగుతున్నారు యువతులు. ఆ ఆవరణలో విశాలమైన చెట్లున్నాయి. వాటి నీడలో గుంపులు గుంపులుగా కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

కాలేజీలో చేరగానే కొందరిలో కొన్ని మార్పులొస్తుంటాయి. అప్పటిదాకా ఏ గ్రామంలోనో, చిన్న టౌన్‌లోనో చదివి, పరిమిత వ్యక్తుల్తో సంబంధాలు పెట్టుకొని ఒక్కసారిగా ఈ వాతావరణంలో ఎడ్జస్టు కావటానికి ఇబ్బందిపడతారు. రకరాకాల వ్యక్తులు, వారి వస్త్రధారణ, ఫ్యాషన్స్ వెంటనే వారిని మారుస్తాయి. వారితో పోల్చుకుంటే తామెంత వెనకబడి ఉన్నామో క్షణక్షణం గుర్తుకు తెచ్చుకొని ఆ స్థాయినందుకోవటానికి తీవ్రంగా ప్రయత్నాలు సాగిస్తారు. మరోరకం తమ రాజకీయ దృక్పధానికి అక్కడే పునాదులు వేసుకుంటారు. చాలా తక్కువ శాతం మందే అటు ఫ్యాష

న్స్‌తో, రాజకీయాలతో అతీతంగా పుస్తకాలే ప్రపంచంగా గడిపేస్తుంటారు.

'ఆషా' హాస్టల్‌లో వుంటోంది. ఆషా అందగత్తె మాత్రమే కాదు. తెలివయింది. బాగా చదువుతుంది కూడా. అయితే ఆమెకు జీవితాన్ని 'ఈజీ'గా తీసుకోవటమనే దృక్పథం చిన్నతనంనుండి అలవాటయింది. ఎంత లావు విషయాన్నయినా అంతిగా పట్టించుకోదామె. ముఖ్యంగా ఆధునికత పేరుతో వచ్చే ఎలాంటి పద్ధతుల్నయినా అనుకరించటానికి ఆమె సిద్ధంగా వుండేది.

సాయంకాలం అయిదుగంట లవుతోంది. మొత్తం పదిమంది వున్నారక్కడ. ఆషా స్నేహితురాలు ఉష కూడా ఆమెతో పాటు చదువుతోంది. ఇద్దరూ రూమ్మేట్స్. అక్కడ ఏదో చర్చా కార్యక్రమం ఆరంభమయింది. అందులో ఓ లావాటి అమ్మాయి తనకొచ్చిన లెటర్ తీసి బిగ్గరగా చదువుతోంది. అందరూ శ్రద్ధగా వింటున్నారు. నడుమ జోక్స్ వేసుకొని నవ్వుకుంటున్నారు.

ఆషా వంతు వచ్చింది.

ఆషా చేతిలో గులాబిరంగు కాయితం నిగనిగలాడుతుంది. దాంట్లోకి పరీక్షగా చూస్తే 'లవ్' అనే అక్షరాలు కనిపిస్తాయి.

చదవటం మొదలు పెట్టింది.

ఆషాగార్కి,

'సింప్లిసిటీ' —కామెంట్.

"మీ లెటర్ చూసేంతవరకు మీ రెవరో అర్థం కాలేదు. రియల్లీ సస్పెన్స్. మీ రేదైనా వీక్లీకి సస్పెన్స్ నవల రాస్తే బాగుంటుంది."

"ఇంకా నయం క్షుద్ర నవల రాయమన్నాడు కాదు."

"క్షుద్రుడు."

గొల్లున నవ్వులు.

"మీా రెవరా అని చాలాసేపు (రోజులు) ఆలోచించాను. ఈ వారం రోజులూ అలా ఆలోచిస్తూనే వున్నాను. కొన్ని పేర్లు మరీ మరీ జ్ఞాపకం తెచ్చుకున్నాను. వెంటనే మన కాలేజీకి వెళ్ళి అటెండెన్సు రిజిష్టర్లో పేర్లన్నీ తిరగెయ్యాలనుకున్నాను. అసలిదంతా ఎవరో ఆడుతున్న డ్రామా అనుకున్నాను. అయితే ఒక్క విషయం. ఈ వారంరోజులూ ఉదయం కాఫీ....సాయంకాలం టీ మాత్రమే తీసుకున్నానని మనవి. సిగరెట్లు త్రాగుదామనుకున్నాను గాని మీా ప్రకటన హెచ్చరిక చూసి ఆగిపోయాను."

"వహ్వా రాముడు మంచి బాలుడు."

మీా మొదటి లెటర్లో నేనంటే ఇష్టం అని రాశారు. మీా రెండో లెటర్లో మీా రెవరో రాశారు. నాకు రాయటానికి మాటలు దొరకటం లేదు. నేనింకా షాక్లో వున్నాను. కోలుకున్నాక రాస్తాను సుమండి.

మీా మిత్రుడు
సురేష్."

"ఆహా....నీ బాయ్ ఫ్రెండ్ గడుసువాడే."

"ఉన్నదున్నట్లు చదివావా తల్లీ."

"ఎవరికైనా అనుమానం వుంటే చూసుకోవచ్చు" అంటూ లెటర్ ఇచ్చింది.

"ఓహ్! లవ్‌లీ....ఎంత బ్యూటిఫుల్ రైటింగ్" అంది చూస్తున్న అమ్మాయి.

ఆషా గర్వంగా తలూపింది.

"లెటర్లో చాలా రిజర్వ్‌డ్‌గా రాశాడే. 'ప్రియతమా' అనలేదు.

"నీ కళ్ళు మీనాల్లా, వున్నాయనలేదు. బోర్ బాబు" అంది సులక్షణ.

"నో....నో....అందరికంటే ఆషా లెటరే ఇంట్రెస్టింగ్‌గా వుంది. ముందు ముందు గురుడు చూడు ఎలా రాస్తాడో."

"ఎలా రాస్తాడంటావ్."

"ఏ భాషలో చెప్పమంటావ్" అందా అమ్మాయి.

"నీ ఇష్టం."

"లవ్ లెటర్‌లో విజ్ఞానాన్ని, కల్పననూ, అనుభూతిని సమపాళ్ళలో మేళవించి, దానికి సైన్స్ రంగరించి ఆషాను ఆకాశంనుండి భూమికి దించుతూ, భూమి నుండి ఆకాశానికి తీసుకెళ్తూ, ఆనందడోలికల్లో ముంచెత్తేటట్లు."

"హియర్....హియర్."

"సరేగాని ఆషా నీ బాయ్ ఫ్రెండ్‌కు ఓ ఐటెమ్ ఇవ్వు. "ప్రేమంటే యేమిటి?" "క్షుద్ర నవలలనగా నేమి?" రెండు పేజీల్లోపు రాయవలెను."

తిరిగి నవ్వుల జల్లు.

"ఐ హేట్ యువర్ కామెంట్ రజనీ....నవలల్లో క్షుద్ర నవలలు, సంసార నవలలు అంటూ ఏం లేవు. అన్నీ నవలలే" అంది రాధిక.

"దాన్నే మరోరకంగా చెప్పాలంటే మనుషుల్లో

ఆడవారూ, మగవారూ అంటూ లేరు. అందరూ మనుషులే" అంది రోజా.

"హియర్ ....హియర్" చప్పట్లు.

"సైలెన్స్" అరిచారెవరో.

అంతా నిశ్శబ్దం!

"మీరంతా ఓ విషయం గమనించారో లేదో ఇక్కడ వున్న వారిలో లెటరంటూ రానివారు ఒకరున్నారు. ఆమె...."

"ఉష" శక్తి పలికింది ఓలావాటి అమ్మాయి.

"బీయింగ్ రూమ్మేటాఫ్ ఆషా....ఉషకు బాయ్ ఫ్రెండ్ లభించకపోవటం దురదృష్టకరం. ఆ విషయంలో ఆషా చొరవ ప్రదర్శించాల్సిన అవసరాన్ని గుర్తింపచేస్తూ, వారం పదిరోజుల్లో ఫలితాలు చూపించాలని కోరుతూ సమావేశం ముగిస్తున్నాం."

అంతా లేచారు. ఉష ముఖంలో యెందుకో ఓ విచారపు రేఖ మెరిసి మాయమయింది. ఆ అమ్మాయికి వీరి పోకడలు విచిత్రంగా వున్నాయి. ఆషాలా తాను ఎడసు కాలేక పోతోంది.

జట
"ఏయ్ ఉషా ...వాళ్ళ కామెంట్స్‌ని విన్నావుగా. ఎవరో ఒక బాయ్ ఫ్రెండ్‌ని సంపాదించుకోలేవా" అంది ఆషా.

"నాకెందుకో అలాంటివిష్టం వుండదు."

"మరీ ఓల్డు వుమెన్‌లా మాట్లాడకు."

ఉష నవ్వింది.

"ఆషా నువ్వు సాహసం చేస్తున్నావు. నువ్వు రాసే ప్రతి ఉత్తరం ఏదో ఒకరోజు నిన్ను ఇబ్బందుల్లో పెడుతుంది."

అకస్మాత్తుగా ఆషా కఠినంగా మారిపోయింది.

"వాట్డూయూ మీన్."

ఉష గిలగిలలాడిపోయింది.

"ఎందుకంత కోపంగా చూస్తావ్. నువ్వు రాసిన ఉత్తరాలన్నీ రేపతను బ్లాక్ మెయిలింగ్‌కు వినియోగించుకుంటే."

"ఊఁ ఇంకా" అంది ఆషా వ్యంగ్యంగా.

"నీ పెళ్ళి ఎవరితోనో జరుగుతుంది. ఆ లెటర్స్ ఆయనకు అందచేస్తానంటాడు. అందుకోసం డబ్బు అడగొచ్చు మరేదైనా కోరొచ్చు. యెలాంటి మగాడయినా, యెన్ని అభ్యుదయం కబుర్లు చెప్పినా స్త్రీ శీలం విషయంలో సంకుచితంగా వుంటాడు. అందుకే ఇలాంటివి మంచిదికాదని నా సలహా."

ఆషా పకలబడి నవ్వింది.

"నీకు నామీదున్న అభిమానానికి థాంక్స్. కానీ ఉషా నేనేం చిన్న పిల్లను కాదు. నేను ఉత్తరాలు నా పేరుతో రాయటంలేదు. సి.బి. అనే పేరుతో రాస్తున్నాను. రెండు నేను నా బాయ్ ఫ్రెండ్‌గా సభ్యతా, సంస్కారాలు తెలిసిన వాడిని ఎన్నుకున్నాను. అతని మీద అలాంటి పూర్తి నమ్మకం వుండబట్టే రాస్తున్నాను. మాడు స్త్రీ—పురుషులు లెటర్స్ రాసుకున్నంతలో నే చెడిపోరని నేను చెప్పదలచుకున్నా...."

"నా ఉద్దేశ్యం అది కాదు" అనబోయింది ఉష.

"ప్లీజ్ లిజన్" వారించి చెప్పుకుపోయింది.

"జీవితంలో ఎలాంటి థ్రిల్స్ లేకుండా బ్రతకటం నా దృష్టిలో వ్యర్థం. ముందేం జరుగుతుందోనని తెలుసుకుంటూ నచ్చేకంటే అలాంటి బ్రతుకు అనవసరం కాగా

నువ్వు నా గురించి దిగులు పెట్టుకోవద్దు" అంది.

ఉష మాట్లాడలేదు.

"ఏమిటి మాట్లాడవు."

"ఏం మాట్లాడాలి. అతన్ని మట్టుకు ప్రలోభాలకు గురిచేయొద్దు."

"ప్రలోభమా! అంటే ఏమిటి?"

"నువ్వు అతన్ని ప్రేమిస్తున్నావనే ఆలోచన. ఆ నమ్మకం ముదిరితే అతను జీవితంలోనే దెబ్బతింటాడు."

"ఓహో! థాంక్యూ ఫర్ యువర్ సజెషన్" అంది ఆషా.

## 4

"ప్రియమైన ఆషా!

ప్రేమంటే ఏమిటని అడిగారు. మీరయితే నాలుగు ముక్కల్లో ఈ ప్రశ్న అడిగారు. కానీ అనంతమైన ఈ ప్రశ్నకు జీవితం మాత్రమే జవాబు చెప్పగలదని నా విశ్వాసం. మీరు మొదటి లెటర్‌లో నన్ను "లైక్" చేస్తున్నారంటూ రాశారు. 'లైకింగ్' అంటే ఏమిటి? ఇష్టమేనా? ఇష్టం ఎప్పుడు ఏర్పడుతుంది. ప్రేమించినప్పుడేగా. ప్రేమ లేనప్పుడు ఇష్టం ఎలా ఉంటుంది. అయిష్టంగా ఉంటూ కూడా ప్రేమించవచ్చా? దయచేసి మీ అభిప్రాయం తెలియచేయండి.

ఇంక ప్రేమ గురించి నాకు తెలిసింది నేను రాస్తాను. అది రెండు హృదయాల స్పందన. అదో అనుభూతి. అది శాశ్వతం. అనంతం. మీరు ఉమెన్స్ కాలేజీలో ఏం చేస్తుంటారో

క్షణక్షణం నే నూహించటానికి ప్రయత్నిస్తుంటాను.

నిమ్మల్ని చూసి చాలా కాలమయింది. అయినా మీ రూపం నా కళ్ళకు కట్టినట్లుంది. సాయంకాలం చల్లటిగాలి వీస్తున్నప్పుడు చందమామ అందం చూస్తున్నప్పుడు, వెన్నెల ప్రపంచం మీద పరుచుకున్నప్పుడు, విచ్చుకుంటున్న పువ్వును చూసినప్పుడు, పడుకోబోయేముందు, పడుకున్నాక, తిరిగిలేచాక మీరు గుర్తొస్తుంటారు. ప్రేమంటే అదేనని నా విశ్వాసం.

క్షుద్ర నవలల గురించి రాయమన్నారు. ప్రేమ లాంటి అనుభూతికి చెందిన విషయాల్ని రాస్తూనే గగుర్పాటు కలిగించే ఈ విషయం రాయటం నిజంగానే విచిత్రం.

ప్రేమ విజయం పొందితే అమరం.

ప్రేమ విఫలం అయితే క్షుద్రం.

ఎప్పుడూ మీ

సురేష్."

"చూశావా ఈ లేఖలో మార్పు. ప్రేమ విజయం పొందితే అమరం లేకుంటే క్షుద్రం అంటున్నాడు. అంటే అతను ఇప్పటికే నీమీద ఆశలు పెంచుకున్నాడు. ఆషా ఇంతటితో ఈ వ్యవహారం త్రుంచెయ్యి. అతని మానాన అతన్ని చదువుకోనీ" అంది ఉష.

"ఎందుకా నాన్సెన్స్. నేనతనికి లెటర్స్ రాయటం లేదా? నేను చదవటం మానేశానా? అతను ఎందుకు మానాలి. వట్టి రబ్బిష్."

"అందరూ అన్ని సంఘటనల్ని ఒకే రకంగా తీసుకో

లేరు."

"మా స్కుంటే నాకోటి అనిపిస్తుంది. నీకెవరూ బాయ్ ఫ్రెండ్స్ లేరని ఇన్ ఫీరియారిటీ లేదుకదా!"

దెబ్బతిన్నట్లు చూసింది ఉమ.

"ఆడది కోరుకుంటే బాయ్ ఫ్రెండ్స్‌కేం కొదువ. ముక్కూ మొఖం లేనిదానికయినా వందమందొస్తారు. ఈ విషయం గురించి జీవితంలో నేను మాట్లాడదలుచుకో లేదు" అంది సీరియస్‌గా.

"ఏమిటే అంత సీరియస్. నీలో అసలు సెన్సాఫ్ హ్యూమర్ బొత్తిగా లేదు."

"అంగీకరిస్తున్నాను."

"రియల్లీ ....ఆశ్చర్యంగా వుంది."

"అవును. ఆషా నువ్వు చాలా ముందుకు పోయావు. నీ ఎత్తులకు చేరుకోవటం నిజంగానే నాకు సాధ్యంకాదు. హ్యూమర్‌కూ, సెంటిమెంట్స్‌కూ, ప్రతిదానికీ కొన్ని లిమిట్సున్నాయని నా అభిప్రాయం. అవి నీ అభి ప్రాయాలతో ఏకీభవించనప్పుడు నీతో పోట్లాట అనవసరం. మనలో ఎవరో ఒకర్ని జీవితమే మారుస్తుంది."

"అబ్బా....అంత హెవీ డైలాగులు నేను భరించలేనే తల్లి" అంది ఆషా.

## 5

సురేష్ వాళ్ళది మధ్యతరగతి కుటుంబం. వాళ్ళ నాన్న గవర్నమెంటు ఉద్యోగం చేస్తున్నాడు. ఆయనకు పేకాట పిచ్చి వుంది. దాదాపు ఇరవై సంవత్సరాల నుండి పేకాడుతూనే వున్నాడు. బ్యాలన్స్‌లోనే వున్నానని ఆయన చెబుతుంటాడు. ఆయన ఆర్థిక పరిస్థితి ఏమిటో, బయట ఎన్ని అప్పులున్నాయో ఇంట్లో తెలియ

నివ్వడు. ఎలాంటి ఆర్థిక ఇబ్బందులు లేకుండా నే వారి సంసారం గడిచిపోతోంది.

సురేష్‌కు తమ్ముడున్నాడు. వారందరికీ ఇంట్లో స్వేచ్ఛ వుంది. సురేష్‌కు కావలసిన డబ్బు నెలనెలా అమ్మ పంపిస్తుంది. ఇంకా అవసరమయితే ఇంటినుండి తెప్పించుకోవటమో, వెళ్ళి తెచ్చుకోవటమో చేస్తుంటాడు.

సురేష్ బొమ్మలు వేస్తుంటాడు. అతని అభిమాన నటుడి వివరాలు సేకరిస్తుంటాడు. ఫోటోగ్రఫి అతని హాబీ. ఇటీవల కాలంలో అతని హాబీ లన్నీ మూలపడ్డాయి. చదువుమీద ఇంట్రెస్టు తగ్గిపోయింది. అతని డబ్బులో ఎక్కువ భాగం రంగులకే ఖర్చయిపోతోంది. సురేష్ రూమ్‌లో అతనొక్కడే వుంటాడు. ఆ గదినిండా అందమైన వర్ణచిత్రాలు గోడలకు అంటించబడి వుంటాయి.

"ఆమె కళ్ళు" ఇదో చిత్రం పేరు. దానికింద ఓ కవిత. ఆమె నడక....ఆమె హృదయం....ఇలా ఆషా రూపాన్ని విభిన్నంగా చిత్రీకరించుకున్నాడు. చిత్రాలు వేసేవారంతా మనుషుల్ని యథాతథంగా చిత్రీకరించలేరు. అది కొందరికి మాత్రమే సాధ్యమవుతుంది.

సురేష్ కార్యక్రమంలో ఇప్పుడు చాలా మార్పులొచ్చాయి. అతనిప్పుడు సిగరెట్లు త్రాగుతున్నాడు. క్రొత్త బుక్స్ చదువుతున్నాడు. తను ఎంతో సేకరించి ఆషాకు రాయాలని ఆరాటం.

'ఆషా' మిత్ర బృందానికి 'సురేష్' గొప్ప కాలక్షేపం అయ్యాడు. అతను వేసే చిత్రాలు కూడా పంపిస్తుండే వాడు.

పెళ్ళి గురించి, అమలిన శృంగారం గురించి, యువతీ

యువకుల స్నేహం గురించి, తెలుగు సినిమాల గురించి, సిల్క్ స్మిత గురించి, ఒకటేమిటి ఆ సందర్భంలో ఏం తోస్తే వాటిమీద అభిప్రాయాలు రాయమని ఆషా కోరేది.

సురేష్ ఇంక భూమ్మీద ఉండ బుద్ధి వేసేదికాదు. నడుమ ఆషా లేఖల్లోని "స్పార్క్స్" అతన్ని ఊహా లోకంలో పయనింపచేసేవి.

"కులం గురించి నాకు పట్టింపులు లేవు. నాకయితే కులాంతర వివాహం చేసుకోవాలనుంది" అంటూ ఓసారి రాసింది.

ఇలాంటి అభిప్రాయాలే అతన్ని మరింతగా ఆశల్లోకి నెట్టేశాయి. సురేష్ ప్రసాద్‌ను కలవటం కూడా మానే శాడు. చాలా తప్పనిసరి సందర్భాలలో మాత్రమే వారు కలుసుకున్నారు. శెలవులప్పుడు ఇంటికి వెళ్ళినా వెంటనే తిరిగొస్తున్నాడు.

ఇదిలా వుండగా ఆషా నుండి ఉత్తరం వచ్చింది. డియర్ సురేష్....

నీ చిత్రాలూ....లేఖ అందాయి. నేను చాలా ఆనందించాను. నేనే కాదు నా ఫ్రెండ్స్ కూడా ఆనందించారు. మొత్తం మా సర్కిల్‌లో ఒకటే గ్రాండ్ బాక్.

నీకు 'ఉష' తెలుసుననుకుంటాను. మనతో పాటు చదివింది. ఆఫ్ కోర్స్ మీది ఆర్ట్స్ గ్రూపు. నాతోపాటు వుండేది. మీకు గుర్తు వచ్చి వుంటుందనుకుంటాను. ఉష ప్రస్తుతం నా రూమ్మేట్.

దురదృష్టవశాత్తూ ఉషకు 'బాయ్ ఫ్రెండ్స్'

లేరు. అందుకే ఎప్పుడూ ఒంటరితనంతో బాధ పడుతుంది. రూమ్మేట్ గా నాకు కొంత బాధ్యత వుంటుంది కదా. అందుకే ఓ ప్రపోజల్. ఇక నుండి మీరు 'ఉష'కు కూడా లెటర్ రాయండి. రేపు మీ లెటర్ అందుకోగానే 'ఉష' ఒక్క సారి కంగుతినాలి. రాస్తారు కదూ....

మీ,

సి. బి."

వెంటనే సురేష్ లెటర్ రాశాడు.

"డియర్ ఆషా ...

నేను 'ఉష'కు లెటర్ రాస్తే ఆమె కంగు తినటం సంగతేమోకాని, మీ లెటర్ చూసి నేను కంగుతిన్నాను.

నేను మిమ్మల్ని మాత్రమే 'లైక్' చేస్తున్నాను. మరో మాటలో 'లవ్' చేస్తున్నాను. లైక్ కీ లవ్ కూ రెండక్షరాలే తేడా వున్నా వాటి నడుమ గొప్ప సంబంధం వుంది. అందుకే మీకో విషయం చెప్పదలుచుకున్నాను. ఉషను ఏకాంతంనుండి బయట పడవెయ్యటానికి నేను ఆశక్తుడ్ని ....అర్థం చేసుకుంటారు కదూ....

మీ,

సురేష్."

"సురేష్ గార్కి,

మీ లెటరందింది. మీరంత సంకుచితంగా ఉంటారని నేననుకోలేదు. ఉషకు లెటర్ రాయటంలో నే మీ రేం కోల్పోతారో నాకర్థంకాలేదు. ఈ లెటర్స్ స్నేహంలో భాగం. స్నేహానికి

మీరు విలువ ఇవ్వరా? నాకు ఆశ్చర్యంగా వుంది.

లైకింగ్ కూ లవ్ కూ తేడా వుంది. నిజమే. నేను మిమ్మల్ని, మీ లెటర్స్‌నూ, మీ చిత్రాల్ని లైక్ చేస్తున్నాను. ఉషకూడా వాటిని లైక్ చేస్తుంది. ప్లీజ్ నోట్ ....

మీ,

సి. బి."

"ఆషా ....

నీ లెటర్ నన్ను ఆశ్చర్యంలో ముంచటమే కాదు. చాలా బాధ పెట్టిందికూడా. మీరు "ప్రీరాజా"కు ఎందుకు లెటర్స్ రాయరు. అతనికి గర్ల్ ఫ్రెండ్ కావాలని నేనడగటంలేదు. అంత మందిలోనూ నేనే నచ్చానని, నానుండి వస్తున్న చిత్రాలూ, లేఖలూ మీ హృదయంలో తియ్యటి అనుభూతిని కలిగిస్తున్నాయి అని రాసిన మీరు 'ఉష'కు లేఖలు రాయమనటం విచారకరం. ఇది వరకు అంతర్లీనంగా రాశాను. నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీ ప్రేమలేఖల ప్రపంచంలో నే బ్రతుకుతున్నాను.

కులాంతర వివాహం గురించి, శృంగారం, గురించి ప్రతి అంశం గురించి మీ అభిప్రాయాలు నా గుండెల్లో రికార్డు చేసుకున్నాను. మీరు మన పెళ్ళికి ఆమోదించగలరని నా ఆశ. మీరు తిరస్కరిస్తే నేను భరించలేను. ఈ సమయంలో 'ఉష'కో మరో తల్లికో లెటర్స్ రాయమని బలవంతం చేయొద్దు. నన్నో కలం పనిముట్టుగా వాడుకోవద్దు. దయచేసి గ్రహించగలరు.

ప్రేమపూర్వకమైన మీ లేఖకోసం యెదురు చూస్తుంటాను.

కేవలం మీ,

—సురేష్."

"సురేష్ గార్కి,

మీ లెటర్ చూశాక మీరెంత పాత చింతకాయ పచ్చడిలాంటివారో అర్థమయింది. లేకపోతే లెటర్స్ రాసుకోవటం గురించి మీరిన్ని భ్రమలు పెంచుకోవటం యేమిటి? జీవితం ఓ రొటీన్ కార్యక్రమం అయితే అందులో థ్రిల్ వుండదు. అందుకోసం క్రొత్తదనం కావాలి. మీకు లెటర్స్ రాయటానికి ప్రత్యేక కారణం అంటూ ఏం లేదు. జస్టు బాయ్ ఫ్రెండ్ అంతే.

మా స్నేహితురాళ్ళందరికీ లెటర్స్ వస్తుంటాయి. అవన్నీ మేం సమీక్షిస్తుంటాం. అందుకే 'ఉష'కు లెటర్ రాయమని మిమ్మల్ని కోరింది. ఇంక మీ ప్రేమ గురించి—ఇంతవరకు నే నేం ఆలోచించలేదు. నా వెనక చాలామంది పడుతుంటారు. వారందరిదీ ప్రేమనుకోను. అందర్నీ పెళ్ళిచేసుకోలేను కూడా. ఈ విషయాల గురించి సీరియస్ గా ఆలోచించలేదు.

నాకూ ఓ బాయ్ ఫ్రెండ్ కావాలి. సెర్చి చేస్తుంటే, కొంచెం సభ్యత, సంస్కారంకల మీరు గుర్తొచ్చి, మీకు మాత్రమే లెటర్ రాశాను. అయితే నా అంచనా తప్పయింది. మీరు ప్రేమ, పెళ్ళి అంటూ మొదలు పెట్టారు. ఐయామ్ సారీ. ఆ విషయాలగురించి నే నేం ఆలోచించదలుచుకో

లేదు.

ఇప్పటికయినా ఓ మిత్రుడిగా ఉండటానికి ఇష్టపడితే మీకు స్వాగతం.

సి. బి."

సురేష్ తల గిర్రున తిరిగిపోయింది. ఆ రోజు మొదటి సారిగా బార్ కు వెళ్ళి త్రాగాడు. గొంతు మండిపోతుంటే లోలోన ఏడ్చాడు.

ఎంత దారుణం! తనో రైటింగ్ టూల్ గా మారిపోయాడు. తన్నింత ఫూల్ ని చేస్తుందా! తన కాలేజి బ్యూటీ తనకే లెటర్ రాసిందని ఎంత గర్వపడ్డాడు తను. స్త్రీలలో సైతం యిలాంటి పోకడలుంటాయా? తన హృదయంలో ఆశలు రేపి ...ఆకాశంలోకి తీసుకుపోయి ఒక్కసారే నేలకు కొట్టడం ఏం న్యాయం! తను వంచింపబడ్డాడు. అది మాత్రం నిజం.

తన లెటర్స్ చదివి వారెన్ని కామెంట్స్ చేశారో. అలాంటివి ప్రేమ గురించి సెక్స్ గురించి అంత యిదిగా ఎలా రాయగలిగింది. ఉపకు లెటర్ రాయాలా? రేపు మరో వెంకాయమ్మకు రాయనుంటుంది. యెంత తక్కువ అంచనా వేసింది. ఎంత దిగజారిపోయింది తన స్థితి. శంకర్ ను తిట్టి తను చేసిందేమిటి? ఆమె కళ్ళనూ, ప్రతి అవయవాల్ని వర్ణిస్తూ, చిత్రిస్తూ ఎంత శ్రమపడ్డాడు. ఛ....ఛ.... దేశంలో అనేక రకాలవారున్నారు. వారందరికీ భిన్నమయింది తన విషయం.

తను కూలిలేని, ప్రేమలేని ప్రేమలేఖలు రాశాడు. తలుచుకుంటే ఆవేశంతోనూ, ఆవేదనతోనూ కదిలిపోతున్నాడు. బార్ మూసే దాకా అలానే కూర్చున్నాడు.

అర్థరాత్రి చుక్కలన్నీ వెక్కిరిస్తుండగా రిక్షానుండి దిగి తూలుతూ, తంటాలుపడి రూమ్ తలుపులు తీస్తే, లైటు వెలుగులో ఆషా బొమ్మలు.

"నువ్వు కాదన్నా నువ్వే నా ప్రాణం" గొణుక్కున్నాడు.

# 6

"ప్రియమైన ఆషా ...

నీ లేఖ అందింది. అది నా గుండెల్లో గుచ్చుకున్నా లెటర్ రాస్తున్నా....

నువ్వెవరివో తెలుసుకోవటానికి నేను సిగరెట్లు త్రాగలేదు. నువ్వెవరివో తెలుసుకున్నాకే త్రాగాను-హానికరమయినా. నువ్వేమిటో తెలుసుకున్నాక ఇప్పుడు 'మందు' త్రాగుతున్నాను. అదే మధువు! ఆఖరకు నా జీవితాన్ని తెలుగుసినిమాలా చేశావ్. అయితే ఒకటే తేడా, వాటిల్లో వాడి బాబో, దాని తల్లో....అసులూ_ కులాలు అడ్డుపడతాయి. ఇక్కడ స్వయంగా నన్ను వెధవని చేశావు.

ప్రేమన్నా, పెళ్ళన్నా, జీవితమన్నా నీకంత ఈజీగా కనిపించే విషయాలు కావచ్చు. కానీ అది చాలా డేంజర్. రేపు థ్రిల్లింగ్ కోసం ఇలాంటి పనులు చేస్తే దెబ్బతింటావ్. జీవితంలో క్రొత్తదనం అంటే ఇంకొకరికి ఆశలు కల్పించి మోసం చేయటం కాదు. ఇదే మరొకరయితే ఈ విషయాన్ని ఎంతగా వినియోగించుకునేవారో!

నేను నిన్ను మనస్ఫూర్తిగా ప్రేమించాను. ఆరాధించాను. ఆరాధిస్తాను. అందుకే అలాంటి

పని చేయలేను. నువ్వు రాసిన లెటర్సన్నీ నీకుపంపి స్తున్నాను. వాటిని చదువుకొని ఒక్కసారి ఆత్మ విమర్శ చేసుకో. నాది ఒక్కటే కోరిక. ఇంక జీవితంలో ఎవరితోనూ ఆడుకోక. నువ్వు నాకు ఓ సోదరిలా లెటర్ రాస్తే అది వేరే విషయం. కానీ నీ లెటర్స్ నన్నెంత రెచ్చగొట్టాయో గ్రహించు.

రేపు నీ పెళ్ళి అవుతుంది. థ్రిల్లింగ్ కోసం అతన్తో ఆడుకోకు. ఇదే చివరి సలహా.

ఎప్పుడయినా నేను గుర్తువస్తే బహుశా 'పిచ్చి వాడు' అనుకుంటావేమో! ఇంత జరిగినా నాకు నీ మీద ఏ మూలో నమ్మకం వుంది—నువ్వు నా జీవితంలోకి అడుగు పెట్టగలవని. అది కలయినా ఆ కలల్లోనే బ్రతికేస్తాను.

నీవాడు కాలేని,
సురేష్."

"ఊఁ" నిట్టూర్చాడు ప్రసాద్.

చాలా కాలం తర్వాత సురేష్‌ను కలవడం ఇదే.

"ఆ లెటర్తోపాటు మొత్తం ఇరవై అయిదు లేఖలు అవన్నీ పోస్టు చెయ్యరా" నిర్లిప్తంగా అన్నాడు సురేష్.

"కళ్ళకింద ఆ చార లేమిటిరా."

"బాగా ఆలోచిస్తున్నానేమో."

"అదే ఎందుకు?"

"ప్రేమిస్తున్నాను కాబట్టి."

"నటన్. వేధ వ్యేషాలు వెయ్యకు. జస్టు ఇదో అను భవం. అంతే!"

సురేష విరక్తిగా నవ్వాడు.

"అవి పోస్టు చెయ్యరా. పొరపాటున ఎవరిచేతిలో నయినా పడతాయేమోరా. రిజిస్టర్డుపోస్టులో పంపించు" ప్రాధేయపడ్డాడు.

"అలాగే. నువ్వు మామూలు మనిషివి కావాలి. అది నా డిమాండ్."

సురేష్, ప్రసాద్ కళ్ళలోకి చూస్తూ అన్నాడు —

"ప్రయత్నిస్తాను."

# 7

"చూడమ్మా ఆషా, రవి స్టేట్స్‌నుండి వస్తున్నాడు. నెలరోజులే వుంటాడు. ఈలోపు పెళ్ళయిపోవాలి. తిరిగి మూడు సంవత్సరాలదాకా అతనికి శెలవు దొరకదు. అందుకే మనకు టైం లేదు. మ్యారేజ్ అవగానే తీసుకు వెళతానంటున్నాడు. ఈలోపు నీ "వీసా" వ్యవహారం కూడా చూడాలి."

"ఏమిటి డాడీ అంత హడావుడి."

"అంతేనమ్మా. మ్యారేజ్ వచ్చినా, వాంమిటింగ్ వచ్చినా ఆగదు అంటారు. నీకు చెందిన పనులన్నీ నువ్వే చూసుకోవాలి. ముఖ్యంగా వెడ్డింగ్ కార్డ్సు యెలా వుండాలో, నీ మిత్రులెవరెవరికి పంపుతుంటావో నీ ఇష్టం. అవన్నీ నీకే వదిలేస్తున్నా. అన్నయ్యతో సంప్రదించి అన్ని పనులూ చూడు. ఓ.కె."

"ఓ.కె. డాడీ" అంది ఆషా.

ఆయన హడావుడిగా వెళ్ళిపోయాడు.

డాక్టర్ రవి.... అమెరికా.

ఆషాకు ఒక్కసారిగా నయాగరా జలపాతం గుర్తు వచ్చింది. ఆమె అంతరంగం మధుర భావనలతో నిండిపో యింది. వెంటనే తన గదికి వెళ్ళి ఫోన్ చేసింది. లేటెస్టు

డిజైన్‌లో వెడ్డింగ్ కార్డు సెలక్టు చేసింది అన్న మధు సహాయంతో. రెండు రోజుల్లో వచ్చేశాయి. తన స్నేహితులందరికీ స్వయంగా పోస్టు చేసింది.

అందులో "సురేష్"కు సైతం వుంది.

రెండు రోజుల తర్వాత తన ముందు గుట్టలా పడున్న చీరల్లో తనకు నచ్చిన వాటికోసం చూస్తుంటే...

"అమ్మా ఫోన్ వచ్చింది" అంటూ చెప్పింది పనిమనిషి.

"ఎవరు. డాడీనా."

"కాదమ్మా. ఎవరో మీరు కావాలంటున్నారు."

"జస్ట్ మినిట్" అంటూ లేచి వెళ్ళింది.

"హల్లో" అంది.

"ఎవరు. ఆషానా మాట్లాడుతుంది."

"అవును. ఎవరు మీరు."

"నీ శ్రేయోభిలాషిని."

ఆషా ఆశ్చర్యపోయింది.

"థ్రిల్లింగ్ గా వుందా?"

"ఎవరు మీరు? ఏం కావాలి?"

"గుడ్. పెళ్ళిచేసుకొని అమెరికా వెళ్ళి నయాగారా అందాలు చూద్దామనుకుంటున్నావా? అదంత ఈజీ కాదు ఆషా."

"డోంటాక్ రబ్బిష్."

"ఓహో. కోపం వచ్చిందా. ఆషా నువ్వు రాసిన ఇరవై అయిదు లేఖలు నా దగ్గరున్నాయి."

"సురేష్" అరిచింది.

"షటప్. ఆ పేరు పిలవటానికి నీకు అర్హత లేదు."

"ఏమిటి నీ ఉద్దేశ్యం?"

"థ్రిల్లింగ్ నీకే కాదు. మాకూ కావాలి. తిరిగి సాయంకాలం ఫోన్ చేస్తాను. ఈలోపు నే నెవరో, ఎందుకు ఫోన్ చేశానో... ఈ లేఖల్లో ఏం చేయబో తున్నానో ఊహించుకో. ఈలోపు ఎన్ని టీలు, కాఫీలు, ఐస్ క్రీమ్‌లు తిన్నావో లెక్క చెప్పాలి సుమా. నోట్ కాఫీలో కఫీన్ అనే విషపదార్థం వుంది" అవతల ఫోన్ డిస్కనెక్టు అయింది.

ఆషా మొఖంమీద రెండు చెమట చుక్కలు!

"వెంజన్స్" ఆమె నోటినుండి మెల్లగా వచ్చాయా మాటలు.

"థ్రిల్ ప్రక్క నే వెంజన్స్ మరోటి మరోటిఉంటాయి కాబోలు" అనుకుంది ఆషా.

వెంటనే ఆషా తన గదిలోకి వెళ్ళి పనిమనిషిని పిలిచింది.

"నాకు తల నొప్పిగా వుంది. చీరల సెలక్షన్ ఈ రోజు కుదరదని చెప్పు. నాకు స్ట్రాంగ్ కాఫీ పట్టుకురా."

పనిమనిషి వెళ్ళిపోయింది.

ఎవరు ఫోన్ చేసింది? సురేషేనా? సురేష్ అలాంటి పనులు చేస్తాడా? తన అంచనా తప్పిందా? ఏం చేస్తాడు? రవికిస్తాడా? రవి ఆ మాత్రం అర్థం చేసుకోలేడా? అతను కూడా మామూలు మొగవాడిలా ప్రవర్తిస్తాడా? తన లేఖలు చూసి తనను గురించి చీప్ గా అంచనా వెయ్యడు కదా! ఏం చేయాలి? ఉష చెప్పినట్లే జరగనుందా? డబ్బులు కావాలంటాడా? శీలం కోరతాడా? ఏం అడుగుతాడు?

అన్నీ ప్రశ్నలు! ప్రశ్నలు! ప్రశ్నలు!

ఈ వాతావరణం ఆషాకు థ్రిల్లింగ్ గా అనిపించటం

లేదు. ఒక్కసారిగా అంతులేని నీరసం, తప్పుచేశాననే భావం ఆమెను ఆవహించాయి. ఆమెకు నిజంగానే తల నొప్పి వచ్చింది. పనిమనిషి తెచ్చిన కాఫీతోపాటు ఓ. టాబ్లెట్ వేసుకొని పడుకుంది.

అయినా నిద్రపట్టలేదు.

సాయంకాలం అయింది.

ఫోన్ దగ్గరే కూర్చుంది.

సరిగ్గా ఆరు గంటలకు మ్రోగింది.

యాంత్రికంగా అందుకుంది.

"హలో."

"గుడ్ ఆషా. నువ్వు ఎదురుచూస్తావని నాకు తెలుసు."

"ఎవరు నువ్వు?"

"ఎవరయితే నేం జాగ్రత్తగా విను. తెలివి తేటలు నీ ఒక్కరికే కాదు. అందరికీ వున్నాయి. నువ్వు లెటర్స్ రాయటమే రాంగ్ స్టెప్. అక్కడినుండే నీ అతి తెలివి తేటలు ప్రారంభమయ్యాయి. ప్రతి లెటర్ లోనూ సి.బి. అని రాశావు అంతమాత్రాన నువ్వు తప్పించుకోలేవు. నీ మనసులో కుట్ర, భయం లేకుంటే 'ఆషా' అని రాసుండేదానివి. కాని జాగ్రత్తపడ్డాననుకున్నావ్. కానీ అది నీ స్వంత దస్తూరనే విషయం మరిచిపోయావు.

ఈ లెటర్స్ చదివితే నీ కానున్న భర్త యేమనుకుంటాడు? ఓ వేళ అతను నిన్ను అర్థం చేసుకున్నా నే నేం చేస్తానో తెల్సా? ఈ లేఖలు ఫోటోస్టాట్ కాపీలు తీయించి ప్రపంచానికి పంచుతాం. ప్రపంచంలో భారత దేశమే కాదు. అమెరికా కూడా వుంది. సి.బి. చరిత్ర సీరియల్ గా ప్రచురించటానికి చాలా పత్రికలున్నాయి. నీకు టుంబానికి నీ లేఖల మూలంగా ఓ. చరిత్ర యేర్పడు

తుంది. ఏమంటావ్?"

"నీకేం కావాలి?" అరిచింది.

"అది రేపు ఉదయం చెబుతా. థాట్ ప్రొవోకింగ్ కోసమే సుమా!"

ఆషా చేతిలో ఫోన్ జారిపోయింది.

విసురుగా తన గదిలోకి వెళ్ళిపోయి మంచంమీద వాలిపోయి దిండులో తలదించుకుని వెక్కి వెక్కి ఏడవ సాగింది.

పదినిమిషాల తర్వాత తన తల ఎవరో ఆప్యాయంగా నిమురుతుంటే తలెత్తింది.

తన అన్న మధు నిలబడి వున్నాడు.

# 8

ఫోన్ గణగణ మ్రోగుతుంది.

మధు అందుకున్నాడు.

"హాలో."

"ఆషా ఉందా."

"మీ రెవరు మాట్లాడుతుంది."

"ఆమె శ్రేయోభిలాషిని. మిత్రుడ్ని. ఆమెనోసారి పిలుస్తారా?"

"ఆమెకు ఆరోగ్యం బాగుండలేదు. యేమిటో చెప్పండి."

అవతలనుండి చిన్నగా నవ్వు.

"మీరు ఆషా అన్నయ్యకదూ...."

"అవును" కోపం నిగ్రహించుకుంటూ అన్నాడు.

"నేను మీ శ్రేయోభిలాషినికూడా. మీ కుటుంబానికి మొత్తంగా."

"థాంక్స్."

"సరే. విషయానికొస్తాను. మీ సోదరి విషయం చెప్పిందో లేదో నాకు తెలియదు. ఆమె రాసిన ఇరవై అయిదు లేఖలు నా దగ్గరున్నాయి. వాటిలో ఆమె చక్కని దస్తూరి, భావ, పెళ్ళి గురించి, ప్రేమ గురించి, సెక్స్ గురించి ఆమె భావాలున్నాయి. చదవమంటారా?"

"అవసరంలేదు. నీకేం కావాలో చెప్పు?"

"చెబితే ఇస్తావా?"

"ప్రయత్నిస్తాను. యెంత కావాలి. ఆ లెటర్స్ మొత్తం నాకు అందించాలి. మరలా మరలా హెడేక్ చేయొద్దు. నువ్వెంత కావాలంటావో ఒకేసారి చెప్పు."

"ఎందుకని?"

"నా సోదరి జీవితంలో అదో పీడకల. అది ఆధారం చేసుకొని ఆమెను జీవితాంతం హింసించటం మేం భరించలేం__"

"అందుకు డబ్బుపోసి ఆ పాపాన్ని తొలగించుకుంటారు—అంతేగా."

"పాపం ఏమిటి? నా చెల్లి తప్పుచేసింది. అందుకేగా నీకు అవకాశం వచ్చింది, చెప్పు. నీకెంత కావాలి? ఎక్కడ, ఎలా ఇవ్వాలి?"

కొంచెంసేపు నిశ్శబ్దం!

"ఓ.కె. నువ్వెంత డబ్బు పొయ్యగలవో నేనూహించుకోలేకపోతున్నాను. నాకు కొంచెం టైమివ్వు. పన్నెండు గంటలకల్లా ఫోన్ చేసి యెలా అందించాలో తెలియచేస్తాను. బైబై. మరో విషయం. ఈ విషయం యే మాత్రం పోలీసులకు తెలియచేయాలని ప్రయత్నించినా పరిస్థితులు మారిపోతాయి. ఆ మాత్రం జాగ్రత్తలో నేనుంటాననే విషయం మీరు మరిచిపోవద్దు."

"ఏమన్నాడు" అంది ఆషా నీరసంగా.

"అతను సురేష్ కాదంటావా. అతని అడ్రసు నీ దగ్గర వుందిగా, ఇవ్వు కలుసుకుంటాను."

"సురేష్ అలా దిగజారడనుకుంటాను. ఎందుకయినా మంచిది పన్నెండు గంటలకు ఫోన్ వచ్చాక నిర్ణయించుకుందాం."

"నువ్వు తప్పుచేశావు ఆషా. ఈ రోజు అసలొని లాభంలేదు. అయినా అలాంటి ఆనందం ఏమిటో నాకర్థం కాదు. మీరంతగా కాలక్షేపం చేయాలంటే యెన్ని తెలుగు సినిమాలు లేవు. ఎన్ని నవల్లు లేవు. ఇలాంటి ప్రాక్టికల్ జోక్స్ ఎప్పుడూ ప్రమాదకరమే!"

ఆషా తల వంచుకుంది.

"డోంట్ వర్రీ. జనరల్ గా చెబుతున్నాను. అయినా ఓ ఫ్రెండ్ గా లెటర్ రాయటాన్నికూడా క్యాష్ చేసుకోవాలనుకునే వెధవల్ని ఇంతటితో వదిలిపెట్టను. వి విల్ టీచ్ లెసన్. నా చెల్లికోసం అవసరమయితే వాడిని హత్యచేయటానికైనా వెనకాడను."

"హత్యా?" కంపించిపోయింది ఆషా.

తను సరదాకు చేసిన పని ఎన్నెన్ని పరిణామాలకు దారితీస్తోంది. తలుచుకుంటే బాధ....దుఃఖం....జుగుప్స ఒక్కసారిగా కలుగుతున్నాయి.

"నువ్వేం కంగారుపడకు. ఈ వ్యవహారం సెటిల్ చేసే బాధ్యత నాది. నాన్నకు తెలిస్తే ఛండాలం అవుతుంది. అది సరే నువ్వలా అయిపోయావేమిటి? ఆ రోజు ఫోన్ వచ్చిందగ్గర్నుండి అలా అయిపోయావని పనివాళ్ళు అనుకుంటున్నారు. హుషారుగా వుండు. యేం జరగనట్లుగా వుండాలి. తెలిసిందా!"

తలూపింది ఆషా.

మధు ఆలోచిస్తుండిపోయాడు.

ఆ కాల్ ఎక్కడినుండి వస్తుందో ట్రాప్ చేయటం వలనకూడా అంతగా ఉపయోగం ఉండబోదు. యే పబ్లిక్ బూత్ నుండో చేస్తుండవచ్చు. అతను డబ్బు కోసం ఆశించటంలేదా? మరెందుకింత తాత్సారం చేస్తున్నాడు? సురేష్‌ను కలుసుకొని మర్యాదగానో, బెదిరించో వాటి విషయం అడగాలి. వ్యవహారం ముదిరితే....

మధు తన గదిలోకి వెళ్ళాడు.

తన డ్రాయరు సొరుగు లాగిచూశాడు.

కేసులో వుంది పిడిబాకు.

చాలాకాలం క్రితం మిత్రులతో టూర్ వెళ్ళినప్పుడు 'బెంగుళూరు'లో కొన్నాడు. రెండువైపులా పదునున్న కత్తి. ఇంతవరకు కనీసం ఏపిల్ కాయకూడా కోయలేదు. బహుశా, ఈ బాకుతో వాడి గుండెల్లో పడవటంతోనే ప్రారంభమవుతుందేమో!

అయినా తెలియక చేసిన తప్పుకు జీవితంతో ఆడుకోవటం దారుణం అనుకున్నాడు. ఈ నాటకం వెనుక డబ్బుకంటే మరేదో ఉందని అర్థమవుతోంది. డబ్బయితే మొదటిసారి ఫోన్ చేసినప్పుడే చెప్పేవాడు. ఇన్నిసార్లు టెంషన్ క్రియేట్ చేయటంలో అర్థంలేదు. మంచం మీద వాలిపోయి పుస్తకం తీసుకున్నాడేగాని మనస్సు లగ్నం కావటంలేదు.

అటూ, ఇటూ తిరుగుతున్నాడు. రేఖా లేఖలు నిజంగానే పత్రికలకెక్కితే ఎంత పరువు నష్టం! తన బావగారు మాత్రం ఈ రకమైన వాటిని అసహ్యించుకోడా? సి.బి. అని రాయటం ఏమిటి? అంత విశాల హృదయంతో

రాసేది తే తన పేరే రాయాల్సింది.

అంటే అనుమానమే! రేపే లేఖలు బయటపడ్డా తన పేరు తెలియకుండా. ఎందుకో నవ్వొచ్చింది మధుకు.

ఈ కాలం పిల్లలు తెలివితేటలు ఇలానే ఉంటున్నాయి. ఒక దరిద్రపు విషయంతో మొదలుపెట్టి, మరిన్ని దరిద్రపు తెలివితేటలు ప్రదర్శించటం.

ఇంక పదిరోజుల్లో పెళ్ళి. ఈ లోపు ఏదైనా ఘోరం జరిగిపోదుకదా! రెండు రోజుల్లో తేల్చేయాలి. పోలీసు రిపోర్టు మూలంగా ప్రయోజనం లేదు. ఈ వార్త ఊరంతా తెలుస్తుంది. సాధ్యమయినంతవరకు మంచిగానే ఈ వ్యవహారం సెటిల్ చెయ్యాలి.

అంతకంటే ముదిరితే మాత్రం। వాడి దురదృష్టం. ఈ చేతుల్తోనే కసితీరా పొడిచి, ఆ తర్వాత శవాన్ని మాయం చెయ్యాలి.

టైము చూసుకున్నాడు.

పదకొండు గంటలు.

మరో గంట.

తల నొప్పిగా వుందనిపించింది. పనిమనిషితో కాఫీ తెప్పించుకొని త్రాగాడు.

సరిగ్గా పన్నెండు గంటలకు ఫోన్ మ్రోగింది.

"వెల్. మీరు ఆదుర్దాగా చూస్తుంటారని నాకు తెలుసు" వినిపించింది.

"ఏం నిర్ణయించావ్."

"ఈ రోజు సాయంకాలం నువ్వు హోటల్ ఇండియానా దగ్గరకు ఆషాతో రా. అన్ని విషయాలూ అక్కడ మాట్లాడుకుందాం."

"ఆషానా....ఆమెందుకు?"

"ఈ విషయంలో ప్రధాన పాత్ర ఆమెదే. వస్తారో.. రారో నిర్ణయించుకోవాల్సింది మీరు."

"వస్తాం."

"గుడ్. మరో విషయం. ఏమాత్రం నన్ను తక్కువ అంచనా వేసినా దెబ్బతింటారు. రౌడీలతో యేమైనా చెయ్యాలనుకున్నా, ఎలాంటి పిచ్చి ఆలోచన వచ్చినా మీకే నష్టం. ఇది నా హెచ్చరిక! మీరిద్దరూ ఏ.సి. గదిలో ఉండండి. నేనొచ్చి కలుస్తాను. అప్పుడే మీరేం చెయ్యాలో చెబుతాను. ఓ.కె."

"అలాగే" అన్నాడు మధు గంభీరంగా.

# 9

సాయంకాలం అయిదు గంటలు.

హోటల్ ఇండియానా కస్టమర్స్‌తో కిటకిటలాడ్తోంది. ఎ.సి. గది మాత్రం ఖాళీగా వుంది. అక్కడ ఎలాంటి భావంలేకుండా మధు, ఆషా కూర్చుని ఉన్నారు.

సప్లయిర్ వచ్చాడు.

"రెండు కూల్ డ్రింక్స్."

అతను వెళ్ళిపోయాడు.

భరించలేనంత టెంక్షన్.

రాబోయేది సుకేష్ కాదు కదా!

కూల్ డ్రింక్స్ తెచ్చి వెళ్ళిపోయాడు సర్వర్.

మెల్లగా సిప్ చేస్తున్నారు.

డోర్ దగ్గర శబ్దమయింది.

తలుపు నెట్టుకుంటూ ఓ వ్యక్తి లోనికి ప్రవేశించాడు.

ఆ గదిలో దీపాలు గుడ్డిగా వెలుగుతున్నాయి. చల్లటి గాలితో పాటు సంగీత తరంగాలు ఆ గదిని ఆక్రమించు కుంటున్నాయి.

అతను వచ్చి 'మధు' ప్రక్కన కూర్చున్నాడు.

అతన్నెక్కడో చూశాననిపించింది ఆషాకు.

"గుడ్. అనుకున్న ప్రకారం వచ్చేశారు" అన్నాడు.

మధు ముఖంలో ఒక్కసారిగా రంగులు మారి పోయాయి. తాము ఎదురుచూస్తున్న వ్యక్తి వచ్చాడు.

"ఏం కావాలి?"

"చెబుతాను. నాతోపాటు లెటర్స్ తీసుకురాలేదు. గంటలోపు నేను వెళ్ళకపోయినా, నాకేమైనా జరిగినా అవి ఎక్కడికి చేరాలో ఏర్పాటుచేసి మరీ వచ్చాను—"

"నువ్వంత కంగారుపడాల్సిన అవసరంలేదు. నీకేం కావాలో చెప్పి మాకు లెటర్స్ ఇచ్చెయ్యి."

"మీ రెండుకు అంత ఆతృత పడుతున్నారు."

"నా చెల్లి జీవితం గురించి."

"మీ చెల్లి జీవితం గురించి మొదటినుండి ఆరాట పడితే ఇలాంటి పనులు చేయవద్దని మీరు చెప్పాల్సింది."

మధు మాట్లాడబోయేంతలో సప్లయిరొచ్చాడు.

"ఇంకో లింకా."

అతను వెళ్ళిపోయాడు.

"మీరు చట్టాల్ని గురించి చెప్పటానికేనా మమ్మల్ని పిలిచింది."

అతను ఓ క్షణం స్తబ్దంగా ఉండిపోయాడు. అతని కళ్ళక్రింద నల్లటి చారలున్నాయి.

"తొందరపడకండి. ఈ హోటల్ నుండి మనం బయలు దేరుతున్నాం."

"ఎక్కడికి?"

"ఎక్కడికి తీసుకువెళితే అక్కడకు రండి."

"నీ పద్ధతేం బాగుండలేదు."

"అందుకు నేనేం చెయ్యలేను."

"ఓ.కె. బయలుదేరుదాం."

"లింకా త్రాగనివ్వండి."

బిల్ పే చేశాక బయలుదేరాడు. ఆషా మొఖం దైన్యానికి ప్రతిరూపంగా వుంది. ఆటోలో కూర్చుంటూ సర్దుకున్నాడు మధు. అతని బాడ్లో బాకు వుంది. అందుకే అంత ధైర్యంగా వెళ్ళగలుగుతున్నాడు.

ఆటో ఆగింది.

మధు డబ్బులు చెల్లించాడు. వారలా నడుచుకుంటూ వెళ్ళారు. ఓ గదిముందాగారు. అతను తలుపు నెట్టాడు.

తెరుచుకుంది.

లోపలకు అడుగు వేశారు.

ఆషా చిగురుటాకులా కంపించిపోయింది.

మంచంమీద ఎవరో పడుకున్నారు. అతను రోగిలా వున్నాడు. మధుకేం అర్ధంకాలేదు. ఆ గది గోడలనిండా అద్భుతమైన వర్ణచిత్రాలున్నాయి. వాటన్నింటిలో 'ఆషా' పోలికలు కనపడుతున్నాయి.

"ఎముకల ప్రోగులా కనపడుతున్న ఆ వ్యక్తి యెవరో తెల్సా" అతని కంఠం కంగున మ్రోగింది.

నిశ్శబ్దం....!

"సురేష్."

ఆషా కళ్ళలో నీరు సుడులు తిరిగింది.

"ఆరోగ్యవంతుడైన ఆ యువకుడు అలా కావటానికి కారణం ఎవరు? మిస్టర్ మధు....మీ బాడ్లో దాచిన కత్తి ఇస్తారా?"

మధు విస్తుపోయాడు.

అప్రయత్నంగా అతని చేతులు బాడ్డు దగ్గరకెళ్లాయి.

"నాకు తెలుసు. మీరు చేసే నేరాల్ని డబ్బుతో కప్పేయాలనుకుంటారు. అందుకు అవకాశం లేకుంటే కాలీనే గల్లంతు చేస్తారు. మామూలుగా సాగిపోతున్న ఓ యువకుడిలో ఆశలు రేపటం నేరంకాదా? చేసింది పోనీండి. తన పెళ్ళి శుభలేఖకూడా పంపించి అతన్ని చిత్రవధ చేయాలా? మిస్టర్ మధు మీరు ఐశ్వర్యవంతులు కావచ్చు. జీవితం అంటే మీకు ఈజీగా కనిపించవచ్చు. అంతమాత్రాన ఇతరుల జీవితంతో ఆడుకునే హక్కు లేదు.

నీ చెల్లి ఓ వ్యక్తిని స్లో పాయిజన్ చేసి చంపింది. అతన్నికూడా ఓ తల్లి కన్నదని గుర్తుంచుకోండి. కేవలం తన ఆనందంకోసం కిరాయి లేఖలు రాసేవాడుగా అతన్ని ఎంచుకుంది. తనను ప్రేమిస్తుందన్న భ్రమలో అతను న్నాడు. తీరా ఆమె రూపం తెలిసేసరికి భరించలేక పోయాడు.

ఏమిటిదంతా! ఏ సంస్కృతి ఇది! మొగవాడు ఆడవారి జీవితాల్లో ఆడుకోవటాన్ని చూస్తున్నాం. వింటున్నాం. ఆడవారు కూడా అలాంటి వాటికి బలి కావాలా? మీరెంత సేపూ డబ్బిచ్చి ఈ వ్యవహారం సెటిల్ చేసుకుందామని భావించారు కానీ....ఇలా చేయటం వెనుక ఓ హృదయం గాయపడిందని ఆలోచించారా?

మిస్టర్ మధూ నువ్వు కసితో అతన్ని పాడిచెయ్యాలని భావించావ్. కాని ఆ అవకాశం నీకు లేదు. నీ చెల్లి అతని గుండెని తూట్లు పొడిచింది అతను అమాయకుడు కాబట్టి. ఆమెను నిజంగా ప్రేమించాడు కాబట్టి ఆ లేఖల్ని వినియోగించుకోలేదు. అదే మరొకరయితే, నీ

చెల్లి జీవితం ఏమవుతుంది?

"మీ డబ్బుకోసం నేనీ ప్రయత్నం చెయ్యలేదు. నీ చెల్లి రాసిన లేఖల్ని యేవాడో త్రిప్పి పంపమని నాకిచ్చాడు. అతను బాగుపడగలడని ఆశించాను. రోజు రోజుకూ అతను కృశించిపోయాడు. అంత బలమైన దెబ్బ కొట్టింది. ఆఖరకు తనే స్వయంగా శుభలేఖ పంపటం ద్వారా పరిస్థితి మరింత విషమింప చేసింది. ఆమె ఉద్దేశ్యాన్ని నేను కాదనను. కానీ యే ప్రయోజనం ఉందని ఇలాంటి పనులు చేయటం. ఏ గమ్యంకోసం! ఏ మార్పు కోసం.

అతను నిద్రబిళ్ళలకు అలవాటు పడ్డాడు. రెండు రోజులుగా 'కోమా'లో వున్నాడు. ఇలాంటి స్థితిలో మీరు పెళ్ళిచేసుకొని అమెరికా వెళ్ళిపోతున్నారు.

మీ మనసు కరుగుతుందని, సురేష్‌ను పెళ్ళిచేసుకుంటారని నేనీ పని చేయలేదు. జీవితమంటే సినిమాకాదు. ఆ సంగతి నాకు బాగా తెలుసు. భవిష్యత్‌లోనయినా ఎవరితోనూ ఆడుకోవద్దని చెప్పటానికే ఇంత నాటకం_"

ప్రసాద్ ముందుకు నడిచాడు.

పెట్టెనుండి లేఖల దొంతరలు తీశాడు.

"ఇదిగో, నువ్వు రాసిన లేఖలు. విచ్చుకత్తులై అతన్ని గాయపరిచిన వీటిని క్యాష్ చేసుకోవటం మా లక్ష్యం కాదు. సురేష్‌నవి బ్రతికించలేవు. నువ్వు చేసిన నేరానికి కోర్టులేం శిక్ష విధిస్తాయో నాకు తెలీదు. నీకు అంతరాత్మ వుంటే, కనీసం ఒక్కసారయినా నేను తప్పుచేశాననుకుంటే చాలు."

ప్రసాద్ అగ్గిపుల్ల వెలిగించాడు. ఆ వెలుగులో అవి

మండిపోతున్నాయి. మంటలు నాలుకయి చాచుకుంటూ వాటిని దగ్ధం చేస్తున్నాయి.

ఆషా కళ్ళవెంట బొటబొట నీళ్ళు....

వెక్కుతూ ఏడుస్తున్న ధ్వని...

అవాక్కయి నిలబడ్డ మధు....

ఇవేమీ తెలీని లోకంలో సురేష్ ...

* * *

డియర్ రీడర్

ఇంతటితో కథ అయిపోయింది.

సురేష్ 'కోమా'లో నుండి బయటపడ్డాడా? లేదా? ఆషా ఎవర్ని పెళ్ళిచేసుకుంది? సురేష్‌ను చేసుకుందా? ఇలా రకరకాల అనుమానాలు మీకు వస్తాయి.

ఈ కథలో మర్డర్స్ లేవు. నిజమే. డైరక్టుగా పాడవాలనుకున్నా మధు కాఅవకాశం లభించలేదు. ఆషా తనకు తెలియకుండానే పాడిచేసింది కదా!

అయినా ప్రతి కథకూ ముగింపు అవసరం. అందుకే....

ముగింపు.

సురేష్‌ను ఇన్టెన్సివ్ కేర్‌లో ఉంచారు. అతను నెమ్మదిగా కోలుకుంటున్నాడు.

ఆషా పెళ్ళి డాక్టర్ రవితో వైభవంగా జరిగిపోయింది. అనుకున్న సమయానికి 'వీసా' లభించలేదు. ఆషా ప్రయాణం మరో ఇరవై అయిదు రోజులు వాయిదా పడింది.

"ఓ! ట్వంటీఫైవ్ డేస్. నాకు ప్రామిస్ చెయ్యాలి" న్నాడు రవి విమానాశ్రయంలో.

ఏమిటన్నట్లు చూసింది ఆషా.

"రోజులో లెటర్ చొప్పున నువ్వు రాయాలి. చివరి లేఖతో పాటు నువ్వు నన్ను చేరుకుంటావు."

ఆషా మాట్లాడలేకపోయింది.

"వాట్ డార్లింగ్."

"అఁ అలాగే."

"బై."

సిగ్గుగా పెదవులు తుడుచుకుంటుంటే చేయి ఊపి వెళ్ళిపోయాడు తను.

# 10

డియర్ సురేష్....

చాలాకాలం తర్వాత నీకు లెటర్ రాస్తున్నాను. నేను ఓ సాయంకాలం రాసిన మొదటి లేఖ ఇంతటి కల్లోలానికి దారితీస్తుందని నేననుకోలేదు. ప్రసాద్ గారన్నట్లు నేను నేరం చేశాను. అది ఇప్పుడే గుర్తించాను.

మీరంటే నాకు లైకింగే కాదు. ఐ లవ్ యూ సురేష్. మంచి చిత్రకారుడిగా, మంచి లేఖకుడిగా ఇప్పటికీ మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. మీకు నాపై ఎంత ప్రేముందో మీ గదిలోకి అడుగు పెట్టినప్పుడే అర్థం చేసుకున్నాను. అయితే నా సహజ ధోరణి మూలంగా మీలో ఆశలు రేకెత్తించానని నాకు అర్థమయింది. అందుకు చాలా విచారపడుతున్నాను. నా మూలంగా మీలాంటి వ్యక్తులు ఇంత నిర్వీర్యం కావటం కూడా నన్ను బాధకు గురిచేస్తుంది. అందుకే మీకీ లేఖ.

నాపట్ల మీ ప్రేమకు గమ్యం ఏమిటి? నన్ను

పెళ్ళి చేసుకోవటమేనా! ఓ మిత్రురాలిగా నన్ను ప్రేమించలేరా? మీరు నాపై ఆ భావంతోనే ఉండి....కోమాలోకి జారిపోతూ మీకేదైనా జరిగితే ఆ నేరం నేను బ్రతికున్నంత కాలం వెంటాడుతుంది. నా నేరానికి ఏ కోర్టులూ శిక్ష విధించకపోవచ్చు. కానీ నా అంతరాత్మ నన్ను సుఖంగా బ్రతకనిస్తుందా? ఆ నేరాన్ని క్షణ క్షణం గుర్తుచేస్తూ చిత్రవధ చేయదా?

దీనికి పరిష్కారం ఏమిటి? నేనూ ఆత్మహత్య చేసుకోవటమే. మీరు ప్రేమించిన ఆషా మర ణించటం మీరూహించారని నాకు తెలుసు. అందుకే మీరు మామూలు మనిషి కావాలి. ఈ వయసులో మనం అనేక ప్రభావాలకు గురవు తుంటాం. అంత మాత్రాన వాటినుండి బయట పడలేమా?

సినిమాల్లో ఇలాంటి సన్నివేశాల్లో హీరో త్రాగి రక్తం కక్కుకుంటూ చచ్చిపోతాడు. కానీ ఇది జీవితమే. మరో సంగతి చెబుతాను. నిన్న 'ఉమ'కు సైతం లెటర్ రాయమని కోరాను. గుర్తుండే ఉంటుంది. నిజంగా ఈ విషయాలన్నీ ముందుగానే ఊహించి, నన్ను హెచ్చరించినా నేను లెక్కచేయ్యలేదు.

నన్ను ఆశ్చర్యంలో ముంచెత్తే మరో విషయం ఏమిటంటే ఉమ ఎంతో ఎదిగిపోయింది. తన చదువు పూర్తికాగానే మహిళల సమస్యపై ఆమె పని చేస్తుందట. ఆమె అభిప్రాయాలు ఎంత ఎదిగాయని. నేను ఈ నెల 25వ తారీఖున

వెళ్ళాను. ఈలోపు నువ్వు మారి నాకు ప్రేమ పూర్వక వీడ్కోలు ఇవ్వాలి. లేకుంటే అమెరికా వెళ్ళినా నేనేం చేస్తానో....ఇదే నా చివరి లేఖ.

మీ

ఆషా."

ఉత్తరం చదువుతున్న సురేష్ భావాల్ని గమనిస్తుండి పోయాడు ప్రసాద్.

• • •

ఇరవై అయిదో తారీఖు....

విమానం బయలుదేరటానికి సిద్ధంగా ఉంది. ఆషా ఆత్రంగా ఎదురుచూస్తోంది. ఆ క్షణంలోనే దూసుకొచ్చిన ఆటోలోనుండి మాకి పరిగెత్తుకొస్తున్నాడు సురేష్. అతని చేతిలో ఓ ప్యాకెట్ వుంది.

పరిగెత్తుకొస్తున్న సురేష్‌ను చూడగానే ఆషా కళ్ళు మెరిశాయి.

"కంగ్రాచ్యులేషన్స్ ఆషా" రొప్పుతూ అన్నాడు.

"థాంక్స్."

ఎనౌన్స్‌మెంట్ వినిపిస్తోంది.

"మీ ప్రయాణం సుఖంగా జరగాలి. వెళ్ళగానే లెటర్ రాయండి" ప్యాకెట్ చేతిలో ఉంచాడు.

"అలాగే....ఉపను కలుసుకో."

ఆషా కదిలిపోయింది.

నిలబడి చూస్తున్న సురేష్ భుజంమీద ప్రసాద్ చెయ్యివేశాడు ఆప్యాయంగా.

విమానం గాల్లోకి లేచింది.

ఆషా సురేష్ ఇచ్చిన ప్యాకెట్ విప్పింది. అందులో నుండి ఓ లెటర్ జారిపడింది.

"ఆషా....

ప్రేమకు గమ్యం ప్రేమేనని తెలిసింది. నిన్ను నేను ప్రేమిస్తున్నాను. ప్రేమిస్తుంటాను. ఇది వరకు ఆ గమ్యం వేరే ఉండేది. ఇప్పుడు 'నయాగారా' జలపాతాన్ని, తాజ్ మహల్ అందాన్ని, వెన్నెల చల్లదనాన్ని యెలా ప్రేమిస్తున్నానో నిన్నూ అలానే ప్రేమిస్తున్నాను. ఈ ప్రేమ స్వచ్ఛంగా, ఏ కల్మషం లేకుండా వుంది. నువ్వెప్పుడూ నా సి.బి.వే.

దయచేసి నువ్వు లెటర్స్ రాయడం మానొద్దు. ఈ రోజునుండే జీవితంలోకి వెళుతున్నాను. మీ వారికి నా శుభాకాంక్షలు అందచేస్తావుకదూ.... నువ్వు మళ్ళీ ఇండియా వచ్చేటప్పుడు ఓ "మాష్టర్"ను అందించగలవని ఆశిస్తూ—

ఎప్పుడూ మీ,

సురేష్."

ఆ లేఖతోపాటు అద్భుతమైన ఫ్రేమ్‌లో బిగించి ఇచ్చిన తన తైలవర్ణ చిత్రం. ఆ చిత్రం చూస్తుంటే ఇందులో ఉంది తా నేనా అనిపించింది.

"సురేష్ నీ గమ్యాన్ని ఉష మార్చుతుంది"అనుకుంది.

—: అయిపోయింది: —

# స్వప్నాల రహస్యం

M. R. N. ప్రసాదరావు

"ఏమండి! మీ కోసం యెవరో వచ్చారు"—అన్నది ప్రవీణ.

డిటెక్టివ్ రాజా చదువుతున్న పుస్తకాన్ని ప్రక్కన పెట్టి—ప్రశ్నార్థకంగా చూశాడు. ఆమె చెప్పింది అతను వినలేదు.

"మీ కోసం యెవరో ఒక అమ్మాయి వచ్చింది. అందంగా వుంది" నవ్వింది ప్రవీణ.

"అది సరేగాని, ముందు నువ్వీ వెస్టెరన్ డ్రస్ మానేసెయ్!"—అంటూ దగ్గరగా వచ్చాడు రాజా.

ప్రవీణ పూర్తిగా యూరోపియన్ డ్రెస్‌లో వుంది. కౌబాయ్ పాంటులో నిలువుచారల ఫుల్ స్లాక్ టక్ చేసింది. ఎత్తైన ఆమె రొమ్ములు షర్టులోంచి తన్నుకొస్తున్నట్టుగా వున్నాయి.

రాజా దగ్గరిగా వచ్చి—ఆమె నడుంచుట్టూ చేతులు వేసి—తన హృదయం మీదికి లాక్కుని, "ప్రవీ! రోజు

రోజుకీ నీ అందం పెరిగిపోతూ నన్ను పిచ్చివాణ్ని చేస్తోంది!" అంటూనే ఆమె లేత పెదాల్ని తన పెదవుల్లో బిగించాడు.

ప్రవీణ విడిపించుకుని, "రాజా! బయట మీ కోసం ఆమె కాచుకుంది"—అన్నది. ఆమెకూ అతని కాగిలి లోంచి విడిపోవాలని లేదు. అయినా తప్పదు. ఎప్పుడూ ఇద్దరూ ప్రాణానికి ప్రాణంగా ఉంటారు. వాళ్ళ ప్రేమకి రాత్రి పగులు అడ్డురావు.

"సారీ"—అన్నాడు రాజా. చిలిపిగా చూశాడు ఆమెని.

ప్రవీణ నవ్వి "ఆమెను లోపలికి పంపిస్తాను" అంటూ బయటికి వెళ్ళింది.

రాజా కుర్చీలో కూర్చుని, త్రీకాజిల్సు సిగరెట్టు వెలిగించుకుని పొగ రింగులు రింగులుగా వదిలాడు.

రెండు నిముషాల్లో-ప్రవీణ ఒకామెను వెంట పెట్టుకుని వచ్చింది. ఆమె వస్తూనే రాజాకు నమస్కరించింది.

రాజా ప్రతినమస్కారం చేసి ఆమెను పరిశీలనగా చూశాడు. ఆమెకు దాదాపు ఇరవై అయిదు, ఇరవై ఆరు మధ్య వుంటుంది వయస్సు. శరీరం—ఎఱుపు రంగులో చాలా అందంగా ఉంది. ఖరీదైన షిఫాన్ గ్రే కలర్ చీర ధరించింది. అదే రంగు జాకెట్టు. పూర్తి ఆధునికమైన అలంకరణలో ఉంది.

రాజాను చూసి కొంచెం సిగ్గుపడిందామె.

"నిలుచున్నారేం! కూర్చోండి వసంతా!"—అన్నాడు రాజా.

ఆమె నివ్వెరపోయింది. ప్రవీణకూడా ఆశ్చర్యంగా చూసింది రాజాను.

"వెరీ సింపుల్! ఎందుకలా ఆశ్చర్యపోతున్నారు. మీ చేతిలోని హాండ్‌కర్చిఫ్ పైన ఉన్న పేరు చూశాను. ఇక కూర్చుని మీరొచ్చిన పనేమిటో చెప్పండి" అన్నాడు రాజా.

రాజాకు ఎదురుగా కూర్చుంది వసంత. ప్రవీణ ఆమె చెప్పబోయే విషయాలను నోట్ చేసుకోవడానికి పుస్తకం తెరిచి పట్టుకుని రాజా ప్రక్కన కూర్చుంది.

ఆమె గొంతు సవరించుకుని, "నాకు వివాహమై సంవత్సరం కావస్తోంది. మావారి పేరు నారాయణరాజు" అన్నది.

రాజా తల పంకించి, "అవును, ఆయనపోయి పది హేను రోజులయిందిగా. ఆయనలాంటి సంఘ సేవకుడిని పోగొట్టుకోవడం దేశానికి చాలా లోటు!"— అన్నాడు.

ఆమె తిరిగి చెప్పడం ప్రారంభించింది. "మా వారికి అరవయిఏళ్ళు. దారిద్ర్యంతో నాకు పెళ్ళి చెయ్యలేక మా నాన్న నారాయణరాజుగారికి మూడో భార్యగా నన్నిచ్చి పెళ్ళిచేశారు. పెళ్ళయిన నెలరోజుల్లోనే మా నాన్న పోయారు. అమ్మ చిన్నప్పుడే పోయింది. నా అని చెప్పుకోదగ్గ వాళ్ళు ఎవరూలేరు నాకు.

నారాయణరాజుగారు నన్ను యెందుకు పెళ్ళిచేసు కున్నారో తెలియదు. చాలా ప్రేమగా చూసేవారు. అనుభవించడానికి కోట్ల కొద్ది డబ్బున్నా నా వయస్సుకు కావలసిన సుఖం దొరకలేదు. నేను ఎక్కువగా చదువుకో లేదు. బెంగుళూరు నుంచి మద్రాసుకు ప్రయాణం చేస్తున్న వారి కారు ఘోర ప్రమాదానికి గురిఅయింది. చెట్టుకు గుద్దుకుని పెట్రోలు మండి కారు అంటుకుంది. మాకు

డ్రైవర్ లేడు. ఆయనే స్వయంగా కారు నడుపుతారు.

ప్రమాదం జరిగిన కొన్ని గంటల్లో— నేనూ, ఆయన స్నేహితులూ అక్కడికి చేరుకున్నాం. కాని ఆయన కడసారి చూపు నాకు దక్కలేదు. నేను చేరుకోవడానికి మూడు గంటలక్రితమే ఆయన ప్రాణం పోయింది. శవం ఎక్కువసేపు చూడలేకపోయాను. శరీరం మొత్తం కాలి పోయింది. ముఖం ఆనవాళ్ళు కూడా సరిగ్గా తెలియనంతగా భయంకరంగా కాలిపోయాను.

ఆయన చనిపోయిన తరువాత తెలిసింది— ఆస్తి అంతా నా పేర వ్రాసిపోయారు. కండిషన్స్ ఏమీ పెట్టలేదు. నాకు ఎలాగూ సుఖంలేకున్నా ఆయన నన్ను ఒంటరి దాన్ని చేసి పోయినందుకు చాలా బాధపడ్డాను" వసంత రెండు నిముషాలు మౌనంగా ఊరుకుని మళ్ళీ చెప్పడం ప్రారంభించింది.

"మొన్నొక భయంకరమైన సంఘటన జరిగింది. మా ఇంట్లో ముగ్గురే నౌకర్లు. వాళ్ళంతా క్రింద పడుకుంటారు. నాకు మేడపైన పడుకోవడం ఇష్టంలేక క్రింది రూములో పడుకున్నాను. నా బెడ్ రూములో తోడు ఎవరూ లేరు. ఒంటరిగానే పడుకున్నాను.

మధ్య రాత్రి నాకు మెలుకువొచ్చి లేచికూర్చు న్నాను. "టక్ టక్...." అన్న శబ్దం వినిపిస్తోంది. ఆశ్చర్యంగా మరోమారు జాగ్రత్తగా విన్నాను! అవును నేను మోసపోవడంలేదు — ఆ చప్పుడు నాకు బాగా పరిచయమైనదే. అది మావారి బూట్ల చప్పుడు!"— అని ఆగింది వసంత.

ఆశ్చర్యంగా వింటూంది ప్రవీణ. రాజా చిన్నగా నవ్వి "చెప్పండి" అన్నాడు.

వసంత గొంతు సవరించుకుంది.

"నాకు గుండె నిబ్బరం ఎక్కువ. అలాంటి వాతావరణంలో పెరిగాను నేను. అయినా ఆ క్షణం గుండె గుబగుబలాడింది. మళ్ళీ మెట్లు ఎక్కుతున్నట్టుగా వినిపించింది చప్పుడు. నేను మొండి ధైర్యంతో నైట్ గౌన్ తొడుక్కుని రూమునుంచి బయటికి వచ్చాను. క్రింది నుంచి చూస్తే మావారి గది కనిపిస్తుంది. ఎవరూ లేరు. కాని గది తలుపు తెరిచి వుంది. ఆశ్చర్యంగా పైకి వెళ్ళాను.

పైన వరండాలో జీరోవోల్టుబల్బు గుడ్డిగా వెలుగుతోంది. ఆ సమయంలో మా పనివాళ్ళను లేపాలన్న ఆలోచనకూడా రాలేదు నాకు. గుండె దిటవుపరచుకుని లోపలికి చూశాను. సమాధానంలేదు. తలుపు ప్రక్కనే స్విచ్ వుంటుంది. ఒక అడుగు లోపలికేసి లైటువేశాను. నా పిచ్చిగాని ఎవరూలేరు లోపల. ఒకవేళ తాళం వేయడం మరచిపోయానేమో? లోపలున్న ఒక కుర్చీ పడిపోయి వుంది. లోపలికెళ్ళి దాన్ని సరిగ్గా పెట్టాను.

నా ప్రక్కనే యేదో శబ్దం అయింది. వెనక్కి తిరిగాను.

అంతే గుండె పగిలి పోయినంత పని అయింది. నాలుగడుగుల దూరంలో ఆయన గోడకానుకుని నిలుచున్నారు. అరుద్దామన్నా నోరు పెగలడంలేదు.

ముఖంకాలి భయంకరంగా వుంది. ఒక కన్ను లేదు. కాలిపోయిన కన్నులోంచి యేదో సానకారుతోంది. పెదాలు అంటుకుపోయాయి. గజ గజ వణకుతూ నిల్చున్నాను. ఒక చేతిలో కత్తి వుంది. మెల్లగా నా వైపు రెండు అడుగులు వేశారు. భయంతో కేక పెట్టి విరుచుకు

పడిపోయాను.

తరువాత ముఖంపైన చల్లటి నీళ్ళు పడగానే స్పృహ వచ్చి కళ్ళు తెరిచాను. అలా నేను పడిపోయి ఎంతసేప యిందో తెలీదు. చుట్టూ చూశాను. అది మావారి రూము కాదు. నా రూమే! నా చుట్టూ మా పనిమనుషులు నిలుచుని, ఆతృతగా నా వైపు చూస్తున్నారు. మా పని మనిషి మంగమ్మను అడిగాను. "మంగమ్మా ఏం జరిగింది?"

"మీరు పెద్దగా కేకపెట్టారు అమ్మగారూ. మా అందరికీ మెలుకువవచ్చి కంగారుగా ఇక్కడికి పరుగెత్తు కొచ్చాం. మీరు కళ్ళు మూసుకుని ఇంకా అరుస్తూనే ఉన్నారు. ముఖంపైన నీళ్ళు చల్లాను. ఏదైనా కల కన్నారా అమ్మా?"—అని అడిగింది.

నాకు చాలా ఆశ్చర్యం వేసి, "నేను ఇక్కడే ఉన్నానా మీరు వచ్చేసరికి?" అని అడిగాను.

"ఎందుకమ్మా అలా అడుగుతున్నారు. ఇక్కడే పడుకుని వున్నారు"—అన్నది.

వాళ్ళను ఇంకేమీ అడగకుండా మంగమ్మను నాకు తోడుగా ఉంచుకుని పడుకున్నాను. 'అయితే - అదంతా కలా?' ప్రశ్నించుకున్నాను. కాని కలని నమ్మలేకున్నాను" అని చెప్పడం ఆపి డిటెక్టివ్ రాజావైపు, ప్రవీణవైపు చూసింది.

"అయితే, మీరు డాక్టరును కన్సల్టు చేయవచ్చు కదా!" అన్నాడు రాజా.

"సారీ, ఇంకా పూర్తిగా వినండి. నేను లేవగానే రాత్రి నేననుభవించినదంతా కల అని భావించుకున్నా, ఎందుకో నా మనస్సు పూర్తిగా ఒప్పుకోలేదు. నేను బెడ్ పైనుంచి లేచి మా వారి గది దగ్గరకు వెళ్ళాను.

అక్కడ మా పనిమనిషి నిలుచున్నది.

"గది తెరచి ఉందేం—అమ్మగారూ!"-అని అడిగింది.

గది దగ్గరకు చేరుకోగానే నాకు, నిజంగా ఆశ్చర్యం వేసింది. వారు పోగానే ఆ గదికి తాళంవేసి, తాళం చెవులు నా ఇనప్పెట్టెలో పెట్టాను. వెంటనే నా గదికి పరుగెత్తుకువెళ్ళి, నా ఇనప్పెట్టె తెరిచి చూశాను. తాళం చెవులు నేను పెట్టినచోటే ఉన్నాయ్. మళ్ళా మా వారి గది దగ్గరకు పరుగెత్తాను. పనిమనిషి గదిముందు వరండా వూడుస్తోంది. గదిలో కిటికీలోంచి పడిన సూర్య కిరణాలవల్ల గది అంతా మెరుస్తోంది.

గదిలోకి అడుగుపెట్టాను. నేను రాత్రి చూచినంత భయంకరంగా లేదు. రాత్రి మా వారు కనిపించిన తలుపువైపు చూశాను. ఎవరూ లేరు. అయినా నేను పడ్డచోటు బాగా గుర్తు ఉంది. అటుచూశాను. నా గుండె ఆగినంత పనిఅయింది. రాత్రి జరిగిన సంఘటన, మళ్ళా నా కళ్ళముందు గిర్రున తిరిగింది. నేను పడ్డప్పుడు-నా తల, ప్రక్కనున్న కుర్చీకి తగిలింది. అప్పుడు కుర్చీ పడిపోవడం గుర్తున్నది. ఇప్పుడు చూస్తే కుర్చీ పడి వున్నది. వెంటనే తల తడుముకున్నాను. బొప్పి కనిపించింది. గుండె దడదడలాడింది.

అంతలోనే ప్రక్కనపడ్డ హాండ్‌కర్చీఫ్ను నా దృష్టి ఆకర్షించింది. అది మా వారిది. దానిపైన రక్తం మరకలున్నాయి. వెంటనే తలుపుమూసి తాళంవేసాను. ఆ రోజంతా నా మనసు వికలం అయిపోయింది. ఇప్పుడు చెప్పండి నేను భ్రమపడలేదు—" అని ఆగింది.

ఆమె చెప్పిందంతా విని, డిటెక్టివ్ రాజా తల పంకించాడు. రాధకు వసంతపైన మంచిభావం యేర

డింది. మనిషిలో మంచీ మర్యాద కనిపిస్తున్నాయ్. తన అనుభవాన్ని చెప్పుతున్నంత సేపూ తన భర్తను గౌరవంగా ఆయన, వారు అంటూ సంబోధించింది. సామాన్యంగా వసంత వయస్సులో ఉన్న ఈనాటి స్త్రీలు భర్తను పేరుపెట్టి పిలుస్తారు.

వసంత చెప్పిందానికి రాజా ఏం మాట్లాడలేదు. ప్రవీణ, వసంత చెప్పిందంతా నోట్ చేసింది.

"మీకీ మూడు రోజుల్లో మళ్ళా అలాంటి అనుభవం మళ్ళా జరగలేదా?—" డిటెక్టివ్ రాజా అడిగాడు.

"జరిగింది. ఆ తరవాత నాకు ఇంట్లో రాత్రులు పడుకోవడానికి భయమేసి హోటల్ జహానారాలో రూమ్ తీసుకున్నాను. రెండు రోజులు ఏమీ జరగలేదు. నిన్న రాత్రి రెండు గంటలకు నాకు మెలకువ వచ్చింది. చదువుతూ నిద్రపోయాను. లైటు వేసే వుంది. దూరంగా యెవరో మెట్లు యెక్కుతున్న శబ్దం వినపడింది. అది హోటల్. ఎంతోమంది వస్తుంటారు అనుకున్నాను. కానీ తరవాత నా ఊహ అబద్ధం అని తేలిపోయింది.

ఆ చప్పుడు యెవరిదో కాదు మావారిదే. గుండెలు వేగంగా కొట్టుకున్నాయ్. ఆ చప్పుడు ఇంకా దగ్గరవుతోంది. సామాన్యంగా ఆయన ఒక కాలు ఎత్తివేస్తూ నడుస్తారు. అందుకే నాకాశబ్దం వినిపించగానే గుర్తుపట్టగలిగాను.

ఆ చప్పుడు నా గదిముందు ఆగిపోయింది. నా ప్రాణాలు పైనే పోయాయి. "టక్....టక్....టక్...." తలుపుకొడుతున్నారు. నేను భయంతో బిగుసుకుపోయాను. "వసంతా"—పిలిచారు. ఆ పిలుపు మావారిదే. తల తిరిగిపోయింది. కెవ్వున కేక వేసి పడిపోయాను.

మళ్ళీ పదినిముషాల తరువాత స్పృహలోకొచ్చాను. ఎవరో తలుపు బాదుతున్నారు. చాలామంది గొంతుకలు వినిపిస్తున్నాయ్. గుండెలు సవరించుకుని నీరసంగా తలుపు తీసాను. నా గదిముందు చాలామంది గుమిగూడారు. నా కేక వినిపించి చుట్టున్న వాళ్ళు లేచారు.

వాళ్ళలో ఒకతను "ఎవరైనా దొంగ వచ్చాడా మేడమ్?—" అని అడిగాడు. లేదని చెప్పాను. అందరూ నావైపు వింతగా చూసి నవ్వుతూ వెళ్ళిపోయారు. మళ్ళీ నా గదిలోకొచ్చి తలుపు మూసి పక్కపైన వాలాను. కానీ, నిద్రపట్టలేదు. తెల్లవార్లూ నిద్రపోకుండా ఎవరి సహాయం కోరితే బాగుంటుందా అని ఆలోచించాను. మీ గురించి చాలామార్లు పేపర్లో చదివాను. మీకు చెబితేనే ఈ సమస్య విడిపోతుందని మీ దగ్గర కొచ్చాను"—అంటూ ముగించింది వసంత.

డిటెక్టివ్ రాజా ఇంకో సిగరెట్టు వెలిగించుకుని, "చూడండి వసంతా! మనం ఏవైనా భయంకరమైన సంఘటనలు చూసినప్పుడు మనం ఆ రాత్రంతా ఫీలవడం జరుగుతుంది. చాలామంది ఏదైనా భయంకరమైన సినిమాలు చూసినా ఆ రాత్రి కల గని భయపడతారు. ఈ విధంగా సామాన్యంగా జరుగుతుంది. ఇలాంటి సంఘటనలు మన ఇండియాలోకన్నా అమెరికాలో, ఇంగ్లండులో చాలామందికి ఈ అనుభవాలు జరిగాయి.

మీరు చెప్పింది అబద్ధమని భయంలో ఫీలయ్యారని అనుకోవడంలేదు. ఇది ఆలోచించదగ్గ విషయమే. అయినా మరోమారు జాగ్రత్తగా ఈ విషయాన్ని పరీక్షించడం అవసరం. ఈమారు మీ ఇంటికి దూరంగా వుండే మరే హోటల్లోనైనా ఉండండి. మళ్ళీ ఈ రోజుకూడా

ఏదయినా జరిగితే అప్పుడు పరిశోధన ముందుకు సాగించవచ్చు"—అన్నాడు.

వసంత ఏదో చెప్పబోయి ఊరుకుని రెండునిముషాల తరవాత అంది. "మళ్ళీ అంత భయంకరమైన సంఘటన జరిగితే, నేను ఓర్చుకోలేనేమో, అని భయంగా ఉన్నది. అయినా మీరు చెప్పినట్టుగా చేస్తాను. ఇక వెళ్తాను?" అంటూ లేచి నిలుచుని నమస్కారం చేసింది.

"వసంతగారూ! ఇలాంటి సమయాల్లో ధైర్యం అవసరం. మీరు ధైర్యంగా వుండండి"-అన్నాడు రాజా.

వసంత మరోమారు వాళ్ళిద్దరికి నమస్కరించి బయటికి నడిచింది.

## 2

మెత్తటి డన్‌లప్ పిల్లో పరుపుపైన నిశ్చింతగా పడుకుంది వసంత.

నిర్మలమైన ఆమె ముఖంపైన ఫాన్ గాలికి అందమైన ముంగురులు దోబూచులాడుకుంటున్నాయి. ఆదమరచి నిదురపోతోంది. ఎందుకో మెల్లగా కళ్ళు తెరిచింది. ఎవరో పిలుస్తున్నారు "వసంతా! వసంతా!!" ఎవరో మరోమారు పిలిచారు. జాగ్రత్తగా వింది. ఎవరిదో కొత్త గొంతు. మధురంగా ఉన్నది. పిలుపు వినిపించినవైపు చూసింది. ఆశ్చర్యపోయింది.

తన ఎదురుగా ఒక యువకుడు నిలుచుని వున్నాడు. షుమారు ఇరవయి రెండేళ్ళుంటాయి. బంగారం రంగులో బలమైన అతని శరీరం మెరుపులు కురిపిస్తోంది. ఆడవాళ్ళను అతిసులువుగా ఆకర్షించే అందమైన ముఖం అతనిది. ఉంగరాల జుత్తు. కొన్ని వెంట్రుకల్ని నుదురుపైకి లాక్కున్నాడు. అందమైన అతని ముఖానికి అ

వెంట్రుకలు ఇంకా అందాన్ని తెచ్చాయి. ఎత్తుగా పెరిగిన అతని ఛాతీ అతను వేసుకున్న టెర్లిన్ షర్టులో స్పష్టంగా కనిపిస్తోంది. కొన్ని క్షణాలు అతని అందాన్ని చూసి మంత్రముగ్ధురాలయింది వసంత.

"వసంతా!"—అంటూ ఆమె పడుకున్న మంచం దగ్గరికి వచ్చాడు.

అతని పిలుపు వేయి వీణలు మీటినట్టు అతిమధురంగా ఉంది.

కానీ ఆమె సమాధానం కోసం ఎదురుచూడకుండానే అతడు మంచంపైన కూర్చుని మృదువుగా ఆమె చెయ్యి తీసుకుని నిమిరాడు. వసంతకు గిలిగింతలు పెట్టినట్టయింది. ఆమె ముఖంపైన గబగబా ముద్దుల వర్షం కురిపించాడు. వసంత ఉక్కిరి బిక్కిరి అయి విచక్షణా జ్ఞానాన్ని కోల్పోయింది.

తను యౌవనంలోకి అడుగుపెట్టి పదహారేళ్ళయినా తనకు శరీర సౌఖ్యం అంతవరకూ లభించలేదు. తనకు పెళ్ళయినా భర్త నుంచి ఆ సుఖం పొందలేకపోయింది. పురుషుడికి, స్త్రీకి ఉన్న సంబంధం అతను వసంతకు చవిచూపిస్తున్నాడు.

వసంతకు తాను చేస్తున్న పని తప్పని తెలుసు. అయినా, అతని జుత్తులోకి తన వ్రేళ్ళను పోనిచ్చి తల నిమురుతోంది. అతను ఎవరో ఆ క్షణం తెలుసుకోవడానికి ప్రయత్నించలేదు. యేమిటో అయిపోతుంది. అతని ముఖాన్ని అందమైన కళ్ళను చూస్తూ తనను తానే మరిచిపోతోంది. ఏదో అడగాలనుకుంది కానీ అతని పెదాలు తన పెదాల్లో అంటుకుపోయాయి.

అతన్ని వారించాలని అనుకుని పెనుగులాడబోయింది కానీ సమయం మించిపోయింది. తనలో అతను కలిసిపోయాడు. తనకు ఇంతకుముందా అనుభవంలేదు. జీవితంలో అదే మొదటిమారు....

వసంతకు మత్తు వదిలింది. తను చేసింది ఎంత తప్పు పనో గుర్తుకు రాగానే ఆమెకు తెలియకుండానే కళ్ళల్లో నీళ్ళు గిర్రున తిరిగాయి.

"వసంతా, ఎందుకు ఏడుపు?"—ఆ యువకుడు అడిగాడు కంగారుగా. అతను అలా అనగానే ఇంకా ఏడుపు ఎక్కువై వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ఆదుర్దాగా వసంత ముఖం తన చేతుల్లోకి తీసుకుని ఆమె కన్నీరును తుడుస్తూ, "వసంతా! ఎందుకు ఏడుస్తున్నావ్? చెప్పవూ?—" దీనంగా అడిగాడతను.

"నేను చెడిపోయాను. నా శీలం కల్మషం అయింది. ఇంక నేను బ్రతికి ఎందుకు?"—అని మళ్ళా ఏడుస్తోంది వసంత.

"అలా బాధపడకు. నేను చూడలేను. నువ్వు కల్మషం కాకుండా వివాహం చేసుకుంటాను, వసంతా!"—అన్నాడు.

"అదెలా సాధ్యం! నేను, నీకన్న దాదాపు నాలుగేళ్ళన్నా పెద్దదాన్ని. ఎలా చేసుకుంటావ్?"—అతని కళ్ళల్లోకి చూస్తూ అడిగింది వసంత.

"ఆ సందేహం నీకక్కర్లేదు వసంతా! నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. మన మధ్య నీ వయస్సు అడ్డురాదు. నన్ను నమ్ము?"—వసంత చెయ్యిపట్టుకుని దీనంగా అన్నాడు అతను.

"నిజంగానా?"—వసంత కళ్ళు ఆనందంగా మెరి

పోయి. తనకు అతనెవరో అనవసరం. అతను తనకు కావాలి.

“లే, వసంతా! మా ఇంటికెళ్దాం. భగవంతుడి సన్నిధిలో నిన్ను వివాహమాడుతాను”—అంటూ సమాధానం కోసం ఎదురు చూడకుండా, ఆమె చెయ్యి పట్టుకుని పైకి లేవదీసి. విడిపోయిన ఆమె చీర అందించాడు.

వసంతకు ఇంకా ఆలోచనలు లేవు. ఇంకేం మాట్లాడకుండా చీర కట్టుకుని తల దువ్వుకుంది. అతను వసంత చెయ్యి పట్టుకుని హోటల్ బయటికి తీసుకువచ్చాడు.

బయట ఎవరూ లేరు. గేటుదగ్గర ఉన్న గూర్ఖా గాఢనిద్రలో మునిగి ఉన్నాడు. పిండారబోసినట్లు చల్లగా వెన్నెల కురుస్తోంది. అతను, వసంత నడుము చుట్టూ చెయ్యివేసి దగ్గరగా లాక్కుని, ఇంకొంచెం ముందుకు నడిచాడు. చెట్టుకింద తళతళ మెరుస్తున్న కొత్త ఫోర్డుకారులో వసంతను ప్రక్కన కూర్చోబెట్టుకుని కారును ముందుకు పరుగెత్తించాడు.

కారు ఒక పెద్ద భవనం ముందు ఆగింది. ఆ భవనం పైన అందంగా చెక్కబడిన కృష్ణుని విగ్రహం వెన్నెల కాంతిలో మెరుస్తోంది. వసంత చెయ్యిపట్టుకుని ఆ యువకుడు లోపలికి నడిచాడు.

వసంత ఆ భవన నిర్మాణాన్ని చూసి ఆశ్చర్యపోయింది ఏదో మహారాజులు నివసించే భవనంలా వుంది. ఫ్లోరసెంటు లైట్ల కాంతిలో గోడలు తళతళ మెరుస్తోన్నాయ్. అతను చాలా గదులు దాటించి, ఒక గదిలోకి తీసుకుపోయాడు. “ఇదే నా రూము” - అన్నాడు.

వసంత పరిశీలనగా చూసింది. ఆ రూములో అందమైన పెయింటింగ్ లు అలంకరించారు. చాలా ఖరీదయిన సోఫా

సెట్టు అమర్చారు. ఒక ప్రక్క డన్ లప్ పిల్లో అమర్చిన బెడ్, బుక్ షెల్ఫు. అన్నీ క్రమపద్ధతిలో అమర్చబడ్డాయి.

అతను ఫ్రిజిడేర్ తెరిచి ఫలూడా అమర్చబడ్డ రెండు గ్లాసులుతీసి, ఒకటి వసంతకు ఇచ్చి, రెండవది తను అందుకున్నాడు. ఐదు నిమిషాల్లో గ్లాసులు ఖాళీ చేశారు.

అతను బూట్లు విప్పివేసి వసంతను తీసుకుని, అక్కడి నుండి ఇంకో రూములో అడుగుపెట్టాడు. అది పూజా మందిరం. ప్రమిదల్లోని వత్తులు దేదీప్యమానంగా వెలుగుతున్నాయి. కృష్ణుడు—రాధ విగ్రహాలు వున్నాయక్కడ.

"వసంతా! ఇప్పుడే భగవంతుని సన్నిధిలో—పవిత్రమైన మనస్సుతో—నిన్ను వివాహమాడుతున్నాను"—అంటూ తయారుగా అమర్చి వున్న రెండు గులాబీ పూల మాలలు తీసుకువచ్చి, ఒకటి వసంత మెడలో అలంకరించాడు.

వసంత చెవుల్లో మనసులో మంగళకరమైన సన్నాయి వాయిద్యం వినబడుతోంది. తన చేతుల్లో వున్న మాలను అతని మెడలో వేసింది.

అతను చిరునవ్వు నవ్వాడు. అతని చేతివున్న వజ్రపు ఉంగరం తీసి వసంత చేతి వేలిక తొడిగాడు.

"మన ప్రేమ వెయ్యి కాలాలపాటు ఆనందంగా వుండాలని కోరు—వసంతా!"—అని కళ్ళు మూసుకుని భగవంతుడికి చేతులు జోడించాడు.

వసంత భక్తితో కళ్ళు మూసుకుని భగవంతుణ్ణి మనసార ప్రార్థించింది.

"వసంతా!?"—

పిలుపు విని, కళ్ళు తెరిచి అతని వైపు చూసింది. అదిరి పడింది. అంతే!! గుండె పగిలినంత పనయింది.

గుమ్మం దగ్గర తన భర్త నారాయణరాజు నిల్చుని క్రూరంగా తనవైపు చూస్తోన్నాడు. వళ్ళంతా కాలి పోయి, రక్తం ఒక రకమైన సొన కలిసి అసహ్యంగా కారుతోంది. ముఖం కాలి, ముక్కు, కుడికన్ను కరిగి ఏకమై రక్తాన్ని కురిపిస్తోంది.

అతని భయంకరమైన రూపాన్ని ఎక్కువసేపు చూడ లేకపోయింది వసంత. మనిషి నిలువెల్లా గజ గజ వణుకు తోంది. చమటలు నీళ్ళు గుమ్మరించినట్టు కారు తున్నాయ్.

వసంత భర్త నారాయణరాజు, క్రూరంగా ఒంటి కన్ను తిప్పుతూ ఏదో అంటున్నాడు. అతని ఒంటిపైన బట్టలు లేవు. కాలిపోగా మిగిలిన పీచులు వ్రేలాడు తున్నాయి. అతని నోట్లోనుంచి మాట రావడంలేదు. పెదాలు కాలి అతుక్కుపోవడంవల్ల, "గుర్, గుర్"— అన్న శబ్దం తప్ప ఇంకే శబ్దం రావడంలేదు.

నారాయణరాజు, వసంతను కావిలించుకోవాలన్న ట్టుగా చేతులు ముందుకు చాపి, కాళ్ళు అతి కష్టంగా ఈడుస్తూ రెండడుగులు ముందుకేశాడు. వసంత భయం కరంగా చావుకేక పెట్టి మూర్ఛపోయింది.

## 3

బద్ధకంగా ఆవులించి కళ్ళు తెరిచి లేచికూర్చుంది వసంత. అంతలోనే గుర్తుకువచ్చి భయంగా చుట్టూ చూసింది. నివ్వెరపోయింది.

నమ్మలేనట్టుగా మరోమారు చూసింది. తను తన గది

లోనే వుంది. రాత్రి తనను అమరసుఖాల్లో తేల్చిన ప్రియుడు లేడు. తన భర్త నారాయణరాజూ లేడు.

అయితే రాత్రి తను చూసింది, అనుభవించింది అంతా కలా? అయినా నమ్మకం కలగక చేతివైపు చూసింది. వివాహ సందర్భంలో పెట్టిన ఉంగరం లేదు.

వసంత నవ్వుకుంది. తన పిచ్చిగానీ, కలలో జరిగింది నిజమవుతుందా?

బెడ్ నుంచి క్రిందికి దిగింది. నేలపైన కాలు మోపి నిలుచోగానే తన తొడల పైభాగాన కలుక్కుమన్నట్టయింది. వసంత నివ్వెరపోయింది.

గబగబా బాత్‌రూమ్‌లో కెళ్ళి బట్టలన్నీ విప్పేసి తనను తాను పరీక్షగా—ఎదురుగా వున్న నిలువెత్తు అద్దంలో చూసుకుని అదిరిపడింది. రాత్రి తన అనుభవం అబద్ధం కాదు.

తనిప్పుడు ఏం చేయాలి? గబగబా స్నానంచేసి కాలకృత్యాలు ముగించుకొని డిటెక్టివ్ రాజా ఇంటివైపు ఆలోచనలను మించిన వేగంతో కారును పరుగెత్తించింది.

రాత్రి తనకు జరిగిన అనుభవాన్నంతా రాజాతో చెప్పి, "మీ అభిప్రాయం ఏమిటి, రాజాగారూ?"— అడిగింది వసంత.

రాజా ప్రక్కన కూర్చుని ఆశ్చర్యంగా విన్న ప్రవీణ రాజావైపు చూసింది ఏం సమాధానం చెపుతాడోనని.

"ఒకవేళ నిజంగా కలగన్నారేమో?"—దీర్ఘంగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు రాజా.

"దట్స్, ఇంపాసిబుల్ రాజా! నా మాటలు యెందుకు నమ్మరు? ఆ పరిసరాలు స్పష్టంగా చూశాను.

అనుభవించాను''—విసుగ్గా ఆవేదనగా అంది వసంత.

రాజా ఆమె కళ్ళల్లోకే చూస్తున్నాడు. ఆ చూపుకు చలించిన వసంత "సారీ రాజా! నా మాట నమ్మండి. నేనంత పిచ్చిగా ఆ నిర్ణయానికి రాలేదు. ఎలా చెప్పాలో అర్థంగావడంలేదు. అయినా తప్పదు! సిగ్గు విడిచి చెప్తున్నాను. నాకు అంతకుముందు ఆ అనుభవం లేదు. రాత్రి కనుపించిన అతను నా కా అనుభవాన్ని చవిచూపాడు. ప్రొద్దున్నే లేచిన తరువాత మీలాగే నేనూ అనుకున్నాను కల అని. కానీ....కానీ, నేననుకున్నది అబద్ధం అని తేలిపోయింది. బాత్‌రూంలో కెళ్ళినప్పుడు చూశాను. నా శరీరంలో చెప్పలేనంత మార్పు వచ్చింది''—అంతవరకు చెప్పి, వసంతకు దుఃఖం ముంచుకురాగా వెక్కి వెక్కి ఏడుస్తోంది.

ప్రవీణకు ఏడుస్తున్న వసంతను చూడగానే చాలా జాలి వేసింది. రాజా దగ్గర నుంచి లేచివచ్చి వసంత పక్కన కూర్చుంది.

"వసంతా! ఆయన నమ్మక అలా అడగలేదు. మేం మీ మాటలు నమ్మాం. ఎప్పుడూ నమ్ముతాం. అయితే వివరాలు కావలసినందువల్ల మిమ్మల్ని అడగక తప్పలేదు. ఒక వేళ నిజంగా ఆ విధంగా జరిగివుంటే అతడ్ని తప్పకుండా పట్టుకుంటాం. అన్నీ తెలిసిన మీరే ఇలా ఫీలవుతే ఎలా? ముఖం తుడుచుకోండి,''—వసంత తల నిమురుతూ అంది ప్రవీణ.

వసంత మాట్లాడకుండా కళ్ళు తుడుచుకుని చేతి రుమాలు ముక్కుదగ్గర వుంచి చీదింది.

అప్పటిదాకా యేదో ఆలోచిస్తున్న రాజా వసంత వైపు తిరగాడు.

వసంత వెంటనే అంది. "క్షమించండి రాజా, రాత్రి జరిగింది కలకాదు. ఎందుకంటే, నాలో రాత్రి అనుభవపు ఛాయలు యింకా పూర్తిగా పోలేదు. ముఖ్యంగా నేను చూసిన భవనం బాగా గుర్తు వుంది. నాకు మద్రాసు అంతా బాగా తెలీదు. శాంథోమ్ బీచ్ వరకూ వెళ్లాను. ఇంకా ముందుకుపోతే అడయారు వస్తుందని తెలుసు. కానీ నేను యింతవరకూ అడయారు పోవడం సంభవించ లేదు. అతని కారులో కూర్చుని వెన్నెల వెలుగుల్లో చుట్టు పట్ల పరిసరాలను నాకు తెలీకుండానే స్పష్టంగా చూశాను. ఒకవేళ మీరు సరేనంటే అటు వెళదాం. నేను గుర్తుపట్టగలను" అన్నది వసంత.

"అవును. అలా చేద్దాం వెళ్దాం పదండి" అంటూ రాజా లేచి కోటు తొడుక్కుని ఈవినింగ్ కావ్ చేతిలో తీసుకుని బయట కారు దగ్గరికి నడిచాడు. ప్రవీణ,వసంత రాజాతో బాటే వచ్చి కారులో కూర్చు న్నారు.

రాజా ప్రక్కగా వసంత కూర్చుని ముందుకు చూస్తోంది. ప్రవీణ వెనక కూర్చుని యేదో పుస్తకం చదువుతోంది.

రాజా డ్రైవ్ చేస్తున్న కారు పదిహేను నిముషాల్లో అడయారు చేరుకుంది. "ఇటు! ఇటు ప్రక్కనుంచే మైలు వరకు పోవాలి" తన మాట నిజమైనందుకు అరిచినంత పని చేసింది వసంత.

రెండు రోడ్లు కలసిన చోట వసంత చూపించినవైపు కారును పరుగెత్తించాడు. ప్రవీణ కూడా చదవడం ఆపి, పరీక్షగా చూస్తోంది రోడ్డును. పరిశోధన ఎక్కడనుంచి ప్రారంభించాలో ఆలోచిస్తున్నాడు రాజా.

వాళ్ళ కారు ప్రయాణం చేస్తున్న దగ్గరలో చుట్టు ప్రక్కల ఇళ్ళు లేవు. దాదాపు మైలు దూరం వెళ్ళిన తరువాత దూరంగా ఎత్తయిన భవనం కనిపించింది.

"రాజా! అదే! అదే!!" మళ్ళీ అరిచినంత గట్టిగా చెప్పింది వసంత.

మరో అయిదు నిముషాల్లో కారు ఆ భవనం దగ్గరికి చేరుకుంది.

రాజా పరీక్షగా చూశాడు. పురాతనమయిన ఎత్తయిన భవనం అది. వసంత చెప్పినట్టుగానే భవనం పైన మార్బుల్ రాతితో చెక్కిన అందమయిన కృష్ణుడి విగ్రహం వుంది. వసంత ప్రవీణలతో బాటు గేటు తెరిచి లోపలికి నడిచాడు.

"ఎవరు బాబూ మీరు?"—ఎవరో తెలుగులో అడిగారు. ప్రక్కకు చూశాడు రాజా. అతను తోట మాలి. అరవయి ఏళ్ళుంటాయి.

"ఏంలేదు తాతా! ఈ భవనం సౌందర్యం గురించి విని చూసిపోవడానికి వచ్చాం. ఇక్కడ ఎవరుంటున్నారు తాతా?" అడిగాడు డిటెక్టివ్ రాజా.

దొరల్లా వున్న వాళ్ళను చూస్తూ, "ఎవరూ లేరు బాబూ! ఆ మూల పాక వేసుకుని, నా కంటి రెప్పలాగ ఈ భవనాన్ని కాపాడుతున్నాను"—అన్నాడు తోట మాలి.

"అలాగా! అయితే ఈ భవనం యజమాని ఎక్కడ వుంటున్నారు?" అడిగాడు రాజా.

"మా చిన్నయ్యగారే బాబూ ఈ భవనానికి వారసులు. ఆయనిప్పుడు సీను దేశం అమెరికాలో వుంటున్నారు. వచ్చేదాకా ఈ భవనాన్ని కాపాడవలసినవాడిని

నేనే బాబూ," అన్నాడు తాత.

తాత చెప్పినదానికి రాజా తలపంకిస్తూ, "చాలా అందమైన కట్టడం. లోపల ఎలా వుంటుందో చూడాలని వుంది. చూడొచ్చా తాతా?" అడిగాడు రాజా.

"దానికేం బాబూ! రండి చూద్దురుగాని,"—అంటూ ముందున్న పెద్ద తలుపు తాళంతీసి, తలుపు పూర్తిగా తెరిచాడు.

ఒక్కొక్క హాలూ దాటుతూంటే వాళ్ళకు ఆశ్చర్యం వేస్తోంది. ఆ భవనం పురాతనమైనదే. అయినా ఉక్కు భవనంలా వుంది. అక్కడక్కడా అందమైన విగ్రహాలూ, తైలవర్ణ చిత్రాలు అమర్చారు. చాలా అందమయిన భవనం అది.

ముందుకు నడుస్తున్న వసంత, ప్రక్కన వున్న గదిని అనుమానంగా చూస్తూ ఆగింది. "ఈ గదిని చూడొచ్చా తాతా?"—అడిగింది వసంత.

ముందుకు పోబోతున్న ముగ్గురూ ఆగారు. తాత మౌనంగా వచ్చి ఆ గది తలుపు తెరిచాడు.

లోపలికి అడుగుపెట్టిన వసంత ఆశ్చర్యపోతూ, "రాజాగారూ! రాత్రి అతను నన్ను గదిలోకి తీసుకు వచ్చాడు. నేను మొదట ప్రవేశించిన గది యిదే. అంత బాగా యెందుకు గుర్తుపట్టానంటే—ఈ గదిముందు తలుపు పైన చెక్కిన బొమ్మల్లో ఒకటి నడుందాకా విరిగి పోయింది. రాత్రి నేనది చూశాను. అందుకే నాకు బాగా గుర్తు వుంది. ఇదే సోఫాసెట్టు. అదుగో ఫ్రిజిడేర్. దాంట్లోంచే అతను నాకు ప్రిపేర్డ్ ఫలూదా ఇచ్చాడు" అన్నది.

రాజా ఆమె చెప్పింది విని పరిశీలనగా చూశాడు

గదిని. సోఫాలపైన అర అంగుళం మందాన దుమ్ముకొట్టుకుని వుంది. కొన్ని నెలలుగా వాటిని శుభ్రం చేయనట్టుగా వున్నాయి. ఫ్రిజిడేర్ పైన గూడా దుమ్మువుంది. తీవ్రంగా ఆలోచించాడు రాజా.

ఇది ఎలా సంభవం? వసంత ఈ గదిని ఇంతకు ముందు ఎప్పుడు చూడలేదు. కానీ ఆ గదిని గుర్తుపట్టగలిగింది. ఇది ఎంతవరకు నిజం!?

"రాత్రి నేను వచ్చినప్పుడు ఈ గదంతా చాలా నీట్ గా వుంది. కానీ ఇప్పుడు చూస్తోంటే ఇలా వుంది. నాకేం అర్థం కావడంలేదు"—అన్నది వసంత. తాత అర్థంకాక చూస్తున్నాడు.

ప్రవీణ ఆ గదిని పరీక్షిస్తోంది. ఆమె కేమీ అంతుపట్ట లేదు.

డిటెక్టివ్ రాజా తాతవైపు తిరిగి, "తాతా ఇలాంటి రూము యింకేదయినా వుందా?"—అడిగాడు.

"లేదు బాబూ! ఇది మా పెద్దయ్యగారి గది. దీన్ని ప్రత్యేకంగా కట్టారు. రెండు నెల్లుగా ఈ గది తలుపు తీయడం మానేశాను."

"ఎందుకు?" అడిగాడు రాజా.

"ఏం లేదు బాబూ! ఈ గదిని చూస్తే పెద్దబాబు గుర్తొస్తారు. అందుకే మానివేశాను. ఆయన చని పోయారు" అన్నాడు తాత.

"రాజాగారూ! ఈ గదికి సుమారు ఆరు గజాల కవతల పూజామందిరం ఉంది. అదికూడా చూద్దామా?"—అంది వసంత.

తాత మరీ ఆశ్చర్యపోయాడు. "మీ కెలా తెలుసు నమ్మా? చినబాబు సీమదేశం వెళ్ళిన ఈ అయిదు సంవత్స

రాలలో ఇంకొక్కళ్ళు ఈ భవనంలోకి రాలేదు!"— అన్నాడు.

వసంత సమాధానం చెప్పకుండా పూజామందిరంవైపు నడిచింది. మిగతా ముగ్గురూ ఆమెను అనుసరించారు. ఇదంతా చూస్తోంటే ప్రవీణకు ఆశ్చర్యం వేస్తోంది. ఇలాంటి కేసులు తాము ఇంతకు ముందు చూడలేదు, విన లేదు.

"ఇదే కదా పూజా మందిరం? తలుపు తెరు తాతా"—ఆత్రుతగా అంది వసంత. తాత తలుపులు తెరి చాడు.

అంతా లోపలికి అడుగుపెట్టారు. "రాత్రి యిలాగే వుంది. మార్పేం లేదు. అదుగో రాజాగారూ—పూల మాలలు!" అరిచింది వసంత.

రాజా దేవుడి పీఠం దగ్గర వున్న గులాబీమాలలు చేతి లోకి తీసుకున్నాడు. ఇవి ఇంకా పూర్తిగా వాడిపోలేదు. "అరె! ఆ మాలలెక్కడివి? నాలుగు రోజుల క్రితం ఈ మందిరం తుడిచాను. అప్పుడు లేవే!" అన్నాడు తాత ఆశ్చర్యంగా.

డిటెక్టివ్ రాజా తాతవైపు తిరిగి, "ఈ ఇంటి తాళా లన్నీ నీ దగ్గరే వుంటాయా తాతా?"—అడిగాడు.

"అవును బాబూ! నాకు భార్యాబిడ్డలు లేరు. నే నొక్కడినే,"—అన్నాడు.

"రాత్రి ఈ ప్రాంతాల్లోకి యెవరైనా వచ్చారా తాతా?"— అడిగాడు.

"లేదు బాబూ! రాత్రి జాగ్రత్తగా తాళాలు చూసు కునిపోయి పడుకున్నాను. ఈ ప్రాంతాల్లోకి ఎవరూ రాలేదు. వచ్చినా, నేను తాళం తీయందే లోపలికి

అడుగు పెట్టలేరు"—నిశ్చయంగా అన్నాడు తాత.

"బావా! మీ బూటుదగ్గర ఏదో మెరుస్తోంది చూడండి" ప్రవీణ అంది. రాజా వంగి దాన్ని చేతిలోకి తీసుకున్నాడు. అది ఉంగరం. వసంతవైపు చూశాడు. వసంత దేవుడి విగ్రహాం దగ్గర నిలుచుని వున్నది.

"వసంతా! రాత్రి అతను మీ వ్రేలికి తొడిగిన ఉంగరంలోని రాయి ఏ రంగుది?" రాజా తన కుడిచేతి వ్రేలికి పెట్టుకున్న వజ్రపుటుంగరంవైపు చూస్తూ అడిగాడు.

వసంత అక్కడినుంచే సమాధానం ఇచ్చింది. "లేత నీలంరంగు" అంటూ దగ్గరిగా వచ్చింది.

రాజా ఉంగరం ఆమెకు చూపించాడు.

వసంత ఆశ్చర్యంగా ఆ ఉంగరాన్ని అందుకుంది.

"అవును ఇదే! చూశారా నేను చెప్పలేదూ? రాత్రి ఎలాగో జారిపడిపోయింది. ఇప్పుడు చెప్పండి రాజా? నేను కన్నది కలా? నేను భ్రమించానా?—" అడిగింది వసంత.

రాజా తాతవైపు తిరిగి "తాతా! మేం పోలీసులం. ఈ ఉంగరాన్ని మాతో తీసుకెళుతున్నాం?"—అన్నాడు.

"తీసుకెళ్ళండి బాబూ! ఆ ఉంగరం మాకు సంబంధించింది కాదు"—అన్నాడు తాత.

తాతకు పోలీసులన్న విషయం తెలవగానే ఇంకేమీ మాట్లాడలేకపోయాడు.

రాజా, వసంతవైపు తిరిగి—

"వసంతా, ఇది యేదో పెద్ద మిష్టరీలా తోస్తోంది. ఈ విషయాన్ని గురించి మనం యింటిదగ్గర చర్చిదాం.

నీకు కనిపించినతని పోలికలు తాతకు వర్ణించు. అత నెవరో తాత గుర్తు పట్టుతాడేమో చూద్దాం—" అన్నాడు రాజా.

వసంత తాతకు రాత్రి తనకు కనిపించినతనిని వర్ణించి, "ఆయన నీకు తెలుసా తాతా?" అని అడిగింది.

ఎందుకో తాత కళ్ళల్లో నీళ్ళు తిరిగినై. వెతుండుతో కళ్ళు వత్తుకుంటూ, "ఆయన మా పెద్దబాబుగారమ్మా. బంగారంలాంటి తండ్రి. ఇరవయిరెండు ఏళ్ళన్నా నిండక ముందే మమ్మల్నందరినీ అన్యాయం చేసిపోయారు. అదేదో మాయదారి జబ్బుచేసి మర్నాడే చచ్చిపోయారు. పేరు రమేష్‌బాబు—" అన్నాడు.

ముగ్గురూ నిర్వ్యాగపోయారు. వసంత ప్రక్కన అవుట్లు ప్రేలినట్టు అదిరిపడింది. అతను చనిపోయాడా? అయితే తను రాత్రి అనుభవించిన సుఖం అంతా ఒక దయ్యం వల్లా?—వసంత ముఖం పాలిపోయింది. ఇది యెలా సంభవం???

"మీ పెద్దబాబుగారు చనిపోయి ఎన్నాళ్ళవుతోంది తాతా?" డిటెక్టివ్ రాజా అడిగాడు.

"పదేళ్ళు దాటింది బాబూ—"

వసంతకు ఏమీ అనడానికి పాలుపోలేదు. అయిదు నిముషాల తరువాత అంతా బయటికి వచ్చారు.

"మాకు చాలా సహాయపడ్డావు తాతా! మేం వెళ్ళొస్తాం—" అన్నాడు రాజా.

"అసలేం జరిగింది బాబూ?—" కుతూహలంగా అడిగాడు తాత.

"మీ పెద్దబాబుగారు రాత్రి ఆ అమ్మాయిని తీసుకు వచ్చి పూజామందిరంలో పెళ్ళాడాడు—!!" అని

నివ్వెరపోయి నిలుచున్న తాత చేతుల్లో అయిదు పది రూపాయల కాగితాలు వుంచి, "మళ్ళీ కలుసుకుంటాం తాతా," అంటూ కారులో కూర్చున్నాడు.

ప్రవీణ కారును డ్రైవ్ చేస్తోంది. వసంత నిర్వికారంగా రాజా ప్రక్కన కూర్చుంది.

రాజా వసంత భుజంపైన చెయ్యి వేసి "కంగారుపడకండి వసంతా! రేపటితో ఈ మిస్టరీ అంతు తేలుస్తాను" అన్నాడు.

వసంత మాట్లాడలేదు. నిజంగా తనకు మానభంగం జరిగిందా? ఒకవేళ కలా?? కలయితే పూలమాలలు, ఉంగరం, ముఖ్యంగా తను భవనాన్ని యెలా గుర్తుపట్టగలిగింది??? బాధతో చేతో కణతలు నొక్కుకుంటూ వెనక్కివాలి, కళ్ళు మూసుకుంది.

డిటెక్టివ్ రాజా కోటు జేబులోంచి భవనంలో దొరికిన ఉంగరాన్ని చేతుల్లోకి తీసుకుని చూశాడు. మేలిమి బంగారంతో చెయ్యబడ్డది. రాజా ఆలోచనలు కారు చక్రాల్లా గిఱ్ఱున తిరుగుతున్నాయి.

వసంతకు జరిగిన అనుభవం నిజం అని తేలిపోతోంది. అయితే దయ్యాలు ఉన్నాయా? లేకపోతే పదేళ్ళ క్రితం చనిపోయిన జమీందారు కుమారుడు రమేష్, వసంతను వివాహమాడడం ఎలా జరిగింది?? అందులో తాత చెప్పిన దాన్నిబట్టి చూస్తే రమేష్ బ్రతికి వుంటే యిప్పుడు ముప్పయిరెండేళ్ళు వుండాలి కానీ, వసంత చెప్పినదాన్ని బట్టి చూస్తే, రమేష్ చనిపోయినప్పుడు యే వయసులో వున్నాడో, రాత్రి అదే వయసులో కనిపించాడు.

రాజా ఎటూ నిర్ణయం చేయలేక సిగరెట్టుతీసి వెలిగించుకున్నాడు.

# 4

"వసంతా! ఈ రోజు కూడా మీరు మామూలుగానే మీ రూములో పడుకోండి. ఈ రోజు నేను మీ వెన్నంటే వుంటాను. మరేం భయంలేదు. మీ స్వప్నాల రహస్యం రేపటితో తేలిపోతుంది!?—" అన్నాడు రాజా.

వసంత మాట్లాడలేదు. ఆమె రాజా చెప్పినట్టుగా చేయదలచుకుంది.

"ఇప్పుడు మీ యింట్లో యెవరు వుంటున్నారు?—" మళ్ళీ అడిగాడు రాజా.

"నేను మా నాన్నగారి యింటికి కెళ్తున్నానని చెప్పి, నౌకర్లందరికీ సెలవులు యిచ్చి వెళ్ళిపొమ్మన్నాను. ఇప్పుడు ఎవరూ లేరు—" అన్నది.

"వసంతా! నువ్వేం భయపడకు. ఈ రోజు నీకు తోడుగా ఎవరైనా లేడీ సర్వెంటును పడుకోబెట్టుకో—" అన్నాడు రాజా.

"అలాగే రాజాగారూ! మీరు నా వెంట వుండి రక్షిస్తానంటే ఎలాంటి విషమ పరిస్థితి వచ్చినా నేను భయపడను—" అన్నది వసంత.

వసంత ఆ రోజు తనకు తోడుగా ఒక లేడీ సర్వెంటును వుంచుకుంది. ఆమె పేరు లిల్లీ. ఇరవయియేళ్ళ వయస్సు. అందంగా వుంటుంది. అదీ, ఇదీ మాట్లాడి చివరకు నిద్రాదేవి ఒడిలో ఒరిగిపోయింది వసంత.

రాత్రి పదకొండు గంటలయింది. కానీ లిల్లీకి నిద్ర రావడంలేదు. ఆమెకు ఉత్సాహంగా వుంది. వసంతకు ఒక్కరోజు తోడుగా వుంటే యాభై రూపాయలు ఇస్తానన్నది. ఇంతవరకు తనకు యెవరూ అంత డబ్బు

యివ్వలేదు. అలా అనుకుంటూ ఉత్సాహంగా ఇంగ్లీషు నవల ఒకటి తీసి చదువుతూ కూర్చుంది లిల్లీ.

"డబ్ డబ్"-అంటూ శబ్దం వినిపించింది. ప్రక్కకు చూసింది. ఎవరూ లేరు. వాచివైపు చూసింది. రెండు అవుతోంది. "అబ్బా!" పుస్తకం చదవడంలో టైం తెలియాలేదు-అనుకుంది.

ఆ రూములో టేబుల్ లైటు మాత్రమే వుంది. లైటు కాంతి గుండ్రంగా టేబులుపైన పడుతోంది. మిగతా భాగమంతా పూర్తి చీకటి కాకపోయినా మసగ్గా వుంది.

"దబ్ .. దబ్ .. దబ్ ...."-ఎవరో మనిషి వస్తున్న చప్పుడు.

లిల్లీ లేచివెళ్ళి తలుపు ప్రక్కగా వున్న కిటికీదగ్గర నిలుచుని చప్పుడు యెవరిదా అని చూస్తోంది. ప్రక్క నున్న మరో తలుపు తెరుచుకుని అతి ప్రయత్నంపైన మెల్లగా నడుస్తూ లిల్లీ వెనుకగా వచ్చి, చేతిలో వున్న పదునైన కత్తిని లిల్లీ వెన్నులో పొడిచి, త్వర త్వరగా బయటికి నడిచాడు వసంత భర్త నారాయణరాజు.

కిటికీలోంచి బయటికి చూస్తున్న లిల్లీకి తన వెన్నులో యేదో పొడుచుకున్నట్టు అనిపించి నివ్వెరపోయింది. అంతలోనే ఆమె నరాలు స్వాధీనం తప్పాయి. తన వెన్నులో దిగింది కత్తి అని తెలుసుకోడానికి ఆమెకు యెక్కువసేపు పట్టలేదు. బాధతో మెలికలు తిరిగిపోతూ వెనుదిరిగి ముందుకు చూసింది.

అప్పుడే గదిలోంచి బయటికి వెళ్ళిపోతున్న నారాయణరాజు మసగ్గా కనిపించాడు.

అతనెవరో తనకు తెలీదు. అరుద్దామంటే బలం చాలడంలేదు. "ఊఁ, ఊఁ—" అని మూలుగుతూ నాలు గడుగులు ముందుకేసి నిశ్చితంగా పడుకున్న వసంతపైన వాలిపోయింది.

తనపై ఏదో బరువు పడ్డట్టు అనిపించగనే అదిరిపడి లేచింది వసంత. తనపై పడిందెవరో అర్థంకాలేదు. చేతి కందుబాటులో ఉన్న స్విచ్ నొక్కింది. ఫ్లారసెంట్ బల్బ్ కాంతివంతంగా వెలిగింది.

వసంత తనపైన పడిన లిల్లీని చూసి గావుకేక పెట్టింది. లిల్లీ వెన్నులోంచి వెచ్చటి రక్తం వసంత నడుంపైన కారింది. కొన్ని క్షణాలపాటు దిమ్మెరపోయి. వెంటనే భయపడింది. లిల్లీని యెవరో పొడిచారు. ఆగకుండా రక్తం ఇంకా కారుతూనే వుంది వసంతకు జాలివేసింది. తనకు తోడుగా పడుకున్నందుకు పాపం ఆమె బలి అయింది. త్వర త్వరగా తన చీర చింపి రక్తస్రావం కాకుండా కట్టి పెట్టికోట్‌తోనే ఖంగారుగా బయటికి పరుగెత్తుకొచ్చింది. ఇంకా ఆమెలో భయం పోలేదు. వెనక్కు తిరిగి తన రూమువైపు చూస్తూ ముందుకు అడుగు వేసింది.

అంతే! భుజంపైన ఎవరిదో చెయ్యివచ్చి పడింది. కవ్వున అరవబోయింది. ఇంకో చెయ్యి నోరు మూసింది. భయంతో గజగజ వణుకుతూ నింపాదిగా చూసింది. చూసి ఆశ్చర్యపోయింది. అతను ఎవరో కాదు. డిటెక్టివ్ రాజా గుడ్డి వెలుతురు అతని ముఖంపైన పడుతోంది.

రాజా ఆమెను వదలి, "ఏం జరిగింది" అడిగాడు. వసంత భయంగా జరిగింది వివరించి లిల్లీని చూపించింది.

రాజా లోపలకు వచ్చి లిల్లీ నాడిని చూశాడు.

ప్రాణం వుంది. ఫోనెత్తి డాక్టరుకు ఫోన్ చేసి, హోటల్ పేరు, వివరాలు తెలిపాడు. వసంతను వెంట తీసుకుని బయటికి పరుగెత్తాడు.

వసంతకు అర్థం కాలేదు. అయినా రాజాను అనుసరించింది. హోటల్‌కు కొంత దూరంలో వున్న కారు దగ్గరకు పరుగెత్తాడు రాజా వసంతతో బాటు.

ఆ ప్రాంతంలోనే తిరుగాడుతున్న ప్రవీణకు, వసంత రూము ప్రక్కన ఎవరో మనిషి పడివుండటం చూసి, రివాల్వరు చేతిలో జాగ్రత్తగా పట్టుకుని అటు నడిచింది.

## 5

"మా ఇంటి దగ్గరికి తీసుకు వచ్చారు ఎందుకు?" భయంగా అడిగింది వసంత రాజాను.

"హంతకుడిని పట్టుకోవడానికి, మరేం భయంలేదు.... నువ్వు ఆ టెలిఫోన్ బూత్‌లో నుంచోని, నేను పది నిమిషాల్లో రాకపోతే పోలీసులకు ఫోన్ చెయ్—!" అంటూ వసంతకు టెలిఫోన్‌బూత్ చూపించి, రివాల్వరు చేతిలో వుంచుకుని ఆమె సమాధానంకోసం యెదురు చూడకుండానే ఇంటివైపు పరుగెత్తాడు.

రాజా వెళ్ళిన తరువాత ఒంటరిగా అక్కడ వుండ బుద్ధేయక టెలిఫోన్ బూత్ లోపలికెళ్ళి—తలు పేసుకుని అద్దాలగుండా తన బిల్డింగ్ వైపు చూస్తోంది.

మాటి మాటికీ వాచీవైపు చూసుకుంటోంది వసంత. ఎనిమిది, తొమ్మిది, పది, పది హేను, పది హేను నిమిషాలు అయింది. అయినా వెళ్ళిన రాజా అంతవరకూ తిరిగి రాలేదు. అప్పటికప్పుడే రాజా పెట్టిన గడువుకు అయిదు నిమిషాలు ఎక్కువే అయింది.

అంతలోనే "ఢన్" మన్న రివాల్వరు పేల్చిన

చప్పుడు వినబడింది. చుట్టుప్రక్కల ఇళ్ళేమీ లేవు. చప్పుడు ఎవరికీ వినిపించదు. రివాల్వర్ చప్పుడు ఎవరిది? రాజా యెవరినైనా పేల్చారా?? ఒకవేళ రాజానే ఎవరైనా పేల్చారేమో?

అలా అనుకునేసరికి వసంత ఆందోళన చెందింది. తన కోసం రాజా ఆపదకు గురికావడమా? వీల్లేదు.

వసంత వెంటనే వెనక్కి తిరిగి ఫోనెత్తి పోలీసు స్టేషన్‌కు ఫోన్ చేసింది. సమాధానం రాలేదు. అవతలి వైపునుంచి కనీసం బెల్ అయినా మోగలేదు.

వసంత అనుమానంగా ఫోన్ వైపు చూసింది. ఆమెను వెక్కిరిస్తున్నట్టుగా తెగిపోయిన వైరు ఫోనుకు వేళ్ళాడు తోంది.

ఆమె ఆలస్యం చేయదలచుకోలేదు. ఆ సమయంలో, అర్థంకాని మొండిధైర్యం ఆమెలో ప్రవేశించింది. ఏమైనా సరే-తను భయపడకూడదు. రాజాకోసం తన ప్రాణాల నైనా అర్పించడానికి సిద్ధపడాలి.

వెంటనే కోటలాగా కనిపిస్తున్న తన ఇంటివైపు పరుగెత్తింది. తను భద్రంగా తాళంవేసి ఉంచిన ఇంటి తలుపులు బార్లా తెరిచి వున్నాయి. లోపల ప్రవేశిం చింది.

ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది. హాల్లో లైటు వెలుగు తోంది. మేడపైన ఎవరో మూలుగుతున్న శబ్దం వినిపిం చింది. మెట్లవైపు పరుగెత్తింది.

మెట్ల దగ్గర రివాల్వరు పడివుంది. అది యెవరిదో తెలియదు. రాజాదేమో? ఆ రివాల్వరు తీసుకోవాలన్న ఆలోచన ఆమెకు రాలేదు. రాజా విషయమే కంగారుగా వుంది. గబగబా మెట్లెక్కి పైకి చేరుకుంది.

మూలుగు తన భర్త గదిలోంచి వినిపిస్తోంది. కొన్ని క్షణాలపాటు ఆమెకు తెలియకుండానే గజగజ వణికింది. గుండె నిబ్బరపరచుకుని, గదివైపు నడిచింది.

తలుపులు తీసే ఉన్నాయ్! లోపల లైటు వెలుగుతోంది. వసంత గది దగ్గరకు చేరుకోగానే మూలుగు ఆగిపోయింది.

"రాజా"— మెల్లగా పిలిచింది. అయినా సమాధానం రాలేదు. ఆమె ముఖం గంభీరంగా తయారయ్యింది. ఆ పరిస్థితుల్లో ఆమె భయపడదలచుకోలేదు. గది లోపలకు ధైర్యంగా అడుగుపెట్టింది. ఎవరూ కనిపించలేదు.

యెవరో పోట్లాడుకున్నట్టు కుర్చీలు, బల్లలు చిందరవందరగా పడివున్నాయ్ అక్కడ. వసంత అర్థంకాక అలాగే చూస్తోంది.

ఉన్నట్టుండి—ఆమె భుజంపైన ఒక చెయ్యి పడింది. మామూలుగాకాదు బలంగా.

అదిరిపడి వెనుదిరిగింది. భయంగా వెనక్కిపోయి గోడకానుకుని బిత్తరపోయి చూస్తోంది. ఆమెకు మాట పెగలడంలేదు. వసంత భర్త—నారాయణరాజు ఆమె ఎదురుగా నిలుచున్నాడు. ముందులాగా బట్టలులేకుండా కాదు ఫుల్ సూటులో ఉన్నాడు.

ఆశ్చర్యంగా చూస్తోంది వసంత.

నారాయణరాజు వెళ్ళి దగ్గరగా వున్న సోఫాలో కూర్చున్నాడు.

అప్పటిదాకా చేతిలో తిప్పుతున్న కత్తిని వసంతవైపుకు విసిరాడు. వసంత తన ప్రాణాలు పోయే వుంటుంది అనుకుంది. కత్తి ఆమె తల ప్రక్కన గోడకు అలంకరించిన ఆయిల్ పెయింట్‌లో గుచ్చుకుంది.

నారాయణరాజు భయంకరంగా నవ్వాడు. "వసంతా నేనెవరో తెలుసా?"—అడిగాడు.

వసంత ఆశ్చర్యపోయింది. ఈసారి అతని పెదాలు అతుక్కుని లేవు. శుభ్రంగా మాటలు వస్తున్నాయి. గుడ్లప్పగించి వణుకుతూ అలాగే చూస్తోంది.

మళ్ళీ అతనే అన్నాడు. "అవును. తెలీదు—యెలా తెలుస్తుంది? చూడు—" అంటూ ముఖంపైన నుదుటి దగ్గర వేళ్ళు పెట్టి ముందుకు లాగాడు. మరుక్షణంలోనే ముఖంపైనున్న ప్లాస్టిక్ కవర్ ఊడివచ్చేసింది. వసంత ఆశ్చర్యపోయింది. తన కళ్ళను తనే నమ్మలేకపోయింది. అతను ఎవరో కాదు. డిటెక్టివ్ రాజా!

"మీరా? ఇంతకాలం నన్ను క్షోభ పెట్టి, నాకు మన శ్శాంతిలేకుండా చేసింది మీరేనా? ఎందుకిలా చేస్తున్నారు?" వసంత అడిగింది.

రాజా భయంకరంగా నవ్వాడు.

"ఆగాగు! అప్పుడే తొందరపడకు—!" అంటూ మళ్లా నుదుటిపైన వేళ్ళు పోనిచ్చి, ముఖంపైనున్న మరొక కవర్ లాగాడు. అతను ఇప్పుడు రాజా కాదు. ఈసారి మరీ ఆశ్చర్యపోయింది.

అతనికి దాదాపు యాభయ్యేళ్ళు ఉంటాయి. ఎర్రగా ఉన్నాడు. అతన్ని తనెప్పుడూ చూడలేదు.

వసంత అతనివైపు చూసి "ఎవరు నువ్వు?" అడిగింది. ఇప్పుడు ఆమెలో భయంలేదు. భయపడటానికి—అతను చనిపోయిన తన భర్త నారాయణరాజు కాదు.

అతను నవ్వి, "చెప్తాను. అవును చెప్పాలి మరి!? నీ ప్రాణాలుపోయే ఆఖరు సమయంలో నా గురించి నువ్వు తెలుసుకోవాలిగా? నా పేరు రంగారావు. నీ

భర్త నారాయణరాజు నాకు బావ అవుతాడు. ఒకవేళ ఏ కారణంవల్లనైనా నువ్వు చనిపోతే నీ తదనంతరం ఈ ఆస్తికి వారసుణ్ణి నేనే.

నీ పెళ్ళయిన సంవత్సరంలో నేనెప్పుడూ ఇక్కడికి రాలేదు. బొంబాయిలో నే ఉన్నాను. అందుకని నువ్వు చూసే అవకాశం కలుగలేదు" అని రెండు నిమిషాలు ఆగాడు.

తిరిగి మళ్ళీ అన్నాడు. "వసంతా నిజంగా నీపైన నాకు ఎలాంటి ద్వేషమూ లేదు. నాకు కావలసింది డబ్బు. అందుకే నీ భర్త నీ పేరిట ఆస్తి రాశాడని నేను ముందే తెలుసుకున్నాను. అందుకే బెంగుళూరు వెళ్తున్న నారాయణరాజును నా దారినుంచి తప్పించాను. అతని వేషంలో వచ్చి నిన్ను భయపెట్టాను. నువ్వు భయంతో గుండెపగిలి చావాలని నా ఉద్దేశ్యం.

కానీ నా ఊహ తబదమయింది. అలా జరగలేదు. నీది మొండి ప్రాణం. నువ్వు భయపడ్డావు. కానీ చావలేదు. డిటెక్టివ్ రాజాను నువ్వు సహాయం కోరావు. నువ్వు భయపడి చస్తే అవమానం యెవరిపైకీ రాదు. కానీ, లాభం లేకపోయింది. అందుకని ఇప్పుడు నిన్ను చంపేసి, ఆస్తితో గుట్టుచప్పుడు కాకుండా ఏ దూరదేశాలకో వెళ్ళి పోతాను—" అని చెప్పడం ఆపి అతను నవ్వాడు.

ఆశ్చర్యంగా అంతిసేపూ విన్న వసంత, "నువ్వు నన్ను చంపలేవు. డిటెక్టివ్ రాజా నన్ను వెన్నంటే వున్నాడు. ఆయన నిన్ను పట్టుకుని తీరుతాడు—" అన్నది.

అతను మరోమారు భయంకరంగా నవ్వి, "నేను కొట్టిన దెబ్బకు డిటెక్టివ్ రాజా రెండు గంటలదాకా

కోలుకోడు" అన్నాడు.

వసంత నివ్వెరపోయింది. అంతలోనే సర్దుకుని—

"మరి నాకు తోడుగా వున్న లేడీ సర్వరును ఎందుకు పొడిచావు?" అడిగింది.

"నాకు లేడీ సర్వరని తెలీదు. గుడ్డి వెలుగులో నువ్వే అనుకుని పొడిచాను. నాకు కాస్త చత్వారముంది" అని లేచి నిలుచున్నాడు.

"వసంతా! ఇప్పటికే సమయం చాలా వేష్టు చేశాను. ఈ ఆఖరుక్షణాల్లో నీ యిష్టదైవాన్ని తలుచుకో! నిన్ను భగవంతుడు కూడా కాపాడలేడు" అంటూ జేబులోంచి యింకో కత్తి తీసి వసంతవైపు నడిచాడు.

వసంత కళ్ళు మూసుకుని నిజంగానే తన ఇష్టదైవాన్ని ప్రార్థిస్తోంది. వసంత గుండెలో మరో క్షణంలో బాకు దిగుతుందనగా, "ఆగు" అన్న సింహగర్జనలాంటి ఆజ్ఞ ధ్వనించింది.

రంగారావు బిత్తరపోయాడు. ఎత్తిన కత్తి దించాడు. వెనక్కి చూడలేదు. ఆగంతకుడిని ఎలా ఎదుర్కోవాలో ఆలోచిస్తున్నాడు.

డిటెక్టివ్ రాజా రివాల్వరుతో నిలుచున్నాడు రంగారావు వెనుక. రాజా తలకు కట్టుకట్టి వుంది. రాజా వెటకారంగా నవ్వుతూ, "రంగారావ్! నన్ను కొట్టి, వసంతను చంపి, దూరదేశాలకు పారిపోదామనుకున్నావ్. ఒకవేళ-నువ్వు వసంతని చంపి ఏ మారుదేశాలకో పారిపోయినా నిన్ను పట్టుకుని ఉరికంబం ఎక్కించేవాడినే,"

రాజా అలా చెప్పుతూండగానే రంగారావు మెరుపులా వెనక్కి తిరిగి, చేతిలో వున్న కత్తిని రాజామైకి విసిరాడు,

రంగారావు వెనక్కి తిరుగుతూండగానే, జరగబోయే ప్రమాదాన్ని ముందే ఊహించిన రాజా, చటుక్కున క్రిందకి వంగాడు. బాకు రివ్వున రాజా తలపైగా దూసుకు పోయి వెనుకనున్న బీరువాకు గుచ్చుకుంది.

ఆలస్యం చేయకుండా రంగారావు రాజాపైకి దుమక బోయాడు. రాజా చేతిలోని రివాల్వరు రెండుసార్లు భయంకరంగా మొరిగి నిప్పులు కక్కింది.

మరుక్షణంలోనే రంగారావు బాధతో అరుస్తూ, నేలమీద పడి గిజగిజ తన్నుకున్నాడు. ఒక బుల్లెట్ కాలులోనూ, రెండో బుల్లెట్ భుజంలోనూ దిగబడింది. అంతలోనే ప్రవీణ ఇన్‌స్పెక్టర్‌నూ, పోలీసులనూ వెంట బెట్టుకొచ్చింది.

ఇన్‌స్పెక్టర్, రంగారావుకు అరదండాలు తగిలించాడు.

"ఇన్‌స్పెక్టర్! నారాయణరాజుగారి చావుకు ఇతనే కారకుడు. రేపు కోర్టులో సాక్ష్యాధారాలు బయట పెడతాను తీసుకెళ్ళండి," అన్నాడు రాజా.

ఇన్‌స్పెక్టర్, రంగారావును లేవదీస్తూండగా, "నాన్నా! నాన్నా!!" అంటూ ఇరవయిరెండేళ్ళ యువకుడు అక్కడ నిలబడ్డ వాళ్ళను తోసుకుంటూ ముందుకు వచ్చాడు.

"ఆఁ అన్నట్టు మరిచాను. ఇతనిని కూడా అరెస్టు చేయండి. నారాయణరాజుగారి హత్యలో ఇతనికి కూడా సంబంధముంది" అన్నాడు రాజా.

ఇన్‌స్పెక్టర్ ఆ యువకుడి చేతులకు బేడీలు తగిలించాడు.

వసంత ఆ యువకుడిని చూస్తూనే ఆశ్చర్యపోయి

ముందుకువచ్చి "స్కౌండ్రల్" అంటూ ఆ చెంపా ఈ చెంపా కోపం తీరిందాకా వాయించి ముఖంపైన ఊసింది. రాజా ఆమెను వారించలేదు. ఆమెను వారించబోయిన ఇన్‌స్పెక్టర్‌ను సైగ చేసి ఆపాడు. ఆ యువకుడు వసంత ముఖం చూడలేక ముందుకు కదిలాడు. పోలీసు బృందం అంతా వెళ్ళిన తరువాత వసంతకు దుఃఖం ముంచుకొచ్చి వెక్కి వెక్కి ఏడ్వసాగింది.

డిటెక్టివ్ రాజా ఆమెను ఓదార్చాడు. "వసంతా! మరేం ఖంగారుపడకు. నీ పవిత్రమైన ప్రేమకు అతను అరుహుడు కాడు. అతనూ తండ్రిలాగానే హంతకుడు. నిన్ను రేప్ చేసినందుకూ, నారాయణరాజును చంపించినందుకూ, తండ్రితో పాటే అతనికీ ఉరి శిక్ష పడుతుంది" అన్నాడు.

"లేదు, నేను అతన్ని గురించి ఆలోచించడంలేదు. అతనొక దుర్మార్గుడు. నే నొక పెద్ద ఆపదనుండి గట్టెక్కి నందుకు, నాకు సంతోషం ఏడుపూ, సమపాళ్ళలో వస్తున్నాయి" అంటూ కళ్ళు తుడుచుకుంది వసంత.

అప్పుడే తెల తెలవారుతోంది. సూర్యుని లేత కిరణాలో పోటీపడుతూ, ఎఱ్ఱటి ఆకాశంపైన ఎగురుతున్న పక్షుల్ని ఉత్సాహంగా చూసింది వసంత.

(పదహారేళ్ళనాటి 'అవన' నవలిక)

—:అ యి పో యిం ది:—

# మొదటి రాత్రి

## మిస్. కె. మధుబాల

అతడు కారాపి కిందకు దిగాడు. అద్దాలు పైకెత్తి, తలుపులు మూశాడు. హుషారుగా అతడు మెరీనా హోటల్లోకి నడిచాడు.

కొంచెం దూరంలో నుంచుని ఆమె అతడివంక చూసింది. కళ్ళు చిట్లించి ఆమె హోటల్లోకి నడిచింది.

విశాలమైన హాల్లో యాభై టేబుల్సుపైన వున్నాయి. ప్రతి టేబుల్ దగ్గరా నాలుగు కుర్చీలున్నాయి.

ఎస్.పి. పాట శ్రావ్యంగా వినపడ్తోంది. వయ్యారంగా అడుగులేస్తూ ఆమె నలువైపులా చూసింది.

అతడు ఒంటరిగా ఒక టేబుల్ దగ్గర కూర్చుని ఏదో ఆంగ్ల పత్రిక చూస్తున్నాడు. అతడి పక్కనుంచి మెల్లిగా నడిచిందామె.

పత్రిక చూడ్డం మాని ఆమెకేసి అతడు ఓరగా చూశాడు. సమీపంలో వున్న టేబుల్ దగ్గర ఆమె కూర్చుంది.

అతడామెవైపు సూటిగా చూశాడు. చాలా అందంగా వుందామె. బంగారంలాంటి శరీరం. పెద్దకళ్ళు. మెళ్ళో ఒంటిపేట గొలుసుంది. చెవులకు కమ్మలున్నాయి. నీలం రంగు మైసూరు సిల్కు చీర ఆమె ధరించింది.

ఎడం చేతికి చిన్న వాచ్ వుంది. టేబుల్ మీద ఎర్రటి హేండ్ బాగ్ వుంది. అతడి చూపు టేబుల్ కిందకు వెళ్ళింది. నీలంరంగు స్లిప్పర్సులో వున్నాయి ఆమె పాదాలు.

బేరర్ కాఫీ తెచ్చి అతడి ముందు పెట్టాడు. కాఫీ కలుపుకుంటూ అతడామెవైపు మళ్ళా చూశాడు.

ఎందుకో ఆమె నవ్వింది. కనురెప్పలు చిట్లించింది. అతడు కాఫీ తాగడం ప్రారంభించాడు. బేరర్ తో ఆమె యేదో చెపోంది. ఆ సమయంలో ఆమెవైపు గాళ్ళా చూస్తూ వుండిపోయాడు.

బేరర్ కదిలాడు. అతడు తనవైపు చూస్తున్నాడని ఆమె గుర్తించింది. అతడినిచూసి నవ్వుకుంది.

అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. ఆమె ఎవరో తను తెల్సుకోవాలి!

కాఫీ తాగడం పూర్తయింది. బేరర్ బిల్లు తెచ్చాడు. అతడు చెల్లించలేదు. మరో కాఫీ ఆర్డరిచ్చాడు.

సమీపంలో కూర్చుని ఆమె ఐస్ క్రీమ్ తింటోంది. కాస్సేపయ్యాక బిల్లు చెల్లించి ఆమె వయ్యారంగా బయటకు నడిచింది.

అతడు బేరర్ ని పిల్చాడు. కాఫీతో బేరర్ వచ్చాడు. అతడు బిల్లు చెల్లించాడు.

"ఆ కాఫీ నువ్వు తాగు!" అని బేరర్ తో చెప్పి వేగంగా బయటకు వెళ్ళాడు.

కారుపక్క నిలబడి నలువైపులా చూశాను. కొంచెం దూరంలో వున్న బస్టాండువైపు ఆమె వెళ్తోంది.

అతను కారును బస్టేండువైపు పోనిచ్చాడు. ఆమె ఒంటరిగా నిలబడి వుంది.

అతడి మెదడులో రాకెట్లలా ఆలోచనలు దూసుకు పోతున్నాయి. కారును పోనిచ్చి ఆమె పక్కనే ఆపాడతను.

"హలో!" అన్నాడతను ఆమెవైపు చూస్తూ.

నవ్వుతూ ఆమె కారు కిటికీలోంచి అతడివైపు చూసింది.

"గెటిన్, కావలసినచోట మిమ్మల్ని దింపుతాను" అన్నాడతను.

అతడి పక్కనే కూర్చుని ఆమె తలుపు మూసింది. అతడు కారును పోనిచ్చాడు. ఆమె అతడివైపు కోపంగా చూసింది.

"నా పక్క మీరు కారు ఆపగానే నవ్వుతూ దగ్గర కొచ్చాను. ఎందుకో తెలుసా?"

"మీరే చెప్పండి!"

"ఇదంతా చూసి బస్టేండులో వుండేవాళ్ళు అనుమానించకుండా వుండేందుకు! నా నవ్వుని చూసి మీరు నాకు తెలిసినవారని వాళ్ళు అనుకుంటారు" అందామె.

"బస్టేండులో నుంచునేవాళ్ళు ఏమనుకుంటేమనకేం?" అన్నాడతను.

అతడివైపు ఆమె ఓరగా చూసింది.

"మీకేం, మీరు మొగాళ్ళు. ఆడపిల్లలు జాగ్రత్తగా వుండాలి" అందామె.

అతను కారును పోనిస్తున్నాడు. అతడి కళ్ళు ఆనం

దంతో మెరుస్తున్నాయి. అతడు ఓరగా ఆమెవైపు చూశాడు.

"నీ పేరు?"

"వసంత."

"నా పేరు రంజిత్."

కొంతసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా వుండిపోయారు.

"నువ్వు ఎక్కడికెళ్ళాలి?"

"ఇండో యూరోపియన్ కంపెనీ ఆఫీసుకి."

"అక్కడ పనిచేస్తున్నావా?"

"లేదు. ఇంటర్‌వ్యూకి పిల్చారు."

"ఎన్నింటికి వెళ్ళాలి?"

"రెండింటికి."

అతడు టైమ్ చూశాడు.

"ఇంకా చాలా టైముంది. నీతో ఎంతో మాట్లాడాలి" అన్నాడతను.

"చెప్పండి" అందామె.

"కారు నడుపుతూ చెప్పడం కష్టమైన పని."

"అయితే కారు ఆపండి మాట్లాడుదాం."

ఒక పార్కులోకి అతడు కారును పోనిచ్చాడు. నిద్ర గన్నేరు చెట్టుకింద కారును ఆపి ఆమెవైపు తిరిగాడు.

"కారులో కూర్చుంటే గాలి రాదు. చెట్టుకింద కూర్చుందాం" అందామె.

"ఫైన్" అని అతడు దిగాడు.

ఇద్దరూ చెట్టుకింద పక్కపక్కనే కూర్చున్నారు. పార్కులో ఎవ్వరూ లేరు. అతడామె కళ్ళలోకి ప్రేమతో చూశాడు.

"వసంతా, నువ్వు చాలా అందంగా వున్నావు. నిన్ను

చూసినప్పటినుంచీ నేను నీ గురించే ఆలోచిస్తున్నాను."

ఆమె కిలకిల నవ్వింది. కొమ్మ మీదున్న పక్షి ప్రశాంతంగా కూసింది.

అతడు పైకిచూశాడు. పైనున్న రామచిలుక కూస్తూ ఎగిరిపోయింది. తన పక్కనున్న యువతి ఎగిరిపోకుండా తను జాగ్రత్తపడాలి!

"ఇంటర్ వ్యూ కోసం యింత తొందరగా యెందుకొచ్చావు?" అడిగాడతను.

"మి మ్మల్ని కల్సుకోడానికేమో!" అందామె కొంటెగా.

"యూ ఆర్ రైట్!"

"నేను తొందరగా యిల్లు వదలిపెట్టడానికి మరో కారణం కూడా వుంది. మామయ్య వస్తానన్నాడు. నన్ను పెళ్ళాడాలని అతడి ఆశ. కాని అతనంటే నా కిష్టంలేదు. అమ్మా, నాన్నా నా మాట వినరు. మామయ్య బియ్యం వ్యాపారంలో లక్షలు గడిస్తున్నాడు. అతడినే నేను పెళ్ళాడాలంటారు."

"నీ తలిదండ్రులు నిన్ను ఫోర్స్ చెయ్యకూడదు" అన్నాడతను.

"నాన్న చదువుకోలేదు. కలప వ్యాపారంలో లక్షలు గడించాడు. జీవితంలో ముఖ్యమైనది డబ్బని వాళ్ళ అభిప్రాయం. నా యింట్లో వుండడానికే నాకు భయమేస్తోంది!"

"ఇదంతా విని చాలా బాధ పడుతున్నాను. నీకేం కావలసినా చేయడానికి సిద్ధంగా వున్నాను" అన్నాడతను.

ఆమె మౌనంగా అతడివైపు చూసింది. ఆమె కళ్ళమ్మట నీళ్ళు జలజల కారాయి.

"వసంతా! ఏడవకు, ప్లీజ్!"

"నన్ను అర్థం చేసుకునే మీలాంటి మనిషి కనిపించినందుకు ఆనందంతో ఏడుస్తున్నాను" అందామె.

జేబురుమాలుతో ఆమె కన్నీళ్ళను తుడిచాడతను.

"వసంతా, ఐ లవ్ యూ! ఈ క్షణంనుంచి నిన్ను వదలను" అన్నాడతను.

"మీ గురించి తెలిస్తే నాన్న నా తోలు ఒల్చేస్తాడు" అందామె భయంగా.

"మన ప్రేమ విషయం నీ తలిదండ్రులకు చెప్పకు."

ఆమె అతడివంక తీక్షణంగా చూసింది.

"నన్ను వెంటనే పెళ్ళాడి మీ యింటికి తీసుకుపోండి. ఆటుపైన నా తలిదండ్రులు ఏం చేసినా నేను కేర్ చెయ్యను" అందామె.

అతడామె చెయ్యి పట్టుకుని, పైకెత్తి వేళ్ళను ముద్దు పెట్టుకున్నాడు.

"వసంతా, నా అక్కయ్య పెళ్ళి ఎప్పుడో అయిపోయింది. అమ్మా, నాన్నా చాలా మంచివాళ్ళు. నిన్ను తీసుకెళ్ళి వాళ్ళకు చూపిస్తాను. వాళ్ళు చాలా సంతోషిస్తారు" అన్నాడతను.

"మీలా మా అమ్మా, నాన్నలకు మిమ్మల్ని నేను పరిచయం చేయలేను. ఏదైనా తెలిస్తే మన పెళ్ళిని ఆపడానికి నాన్నా, మామయ్యా సాయశక్తులా ప్రయత్నిస్తారు" అందామె.

"వాళ్ళకు తెలియకుండా మనం పెళ్ళి చేసుకుందాం. తర్వాత తెలిశాక వాళ్ళు ఏమీ చెయ్యలేక నోరు మూసుకుంటారు" అన్నాడతను.

ఆమె వుషారుగా లేచి నిలబడింది. "మీ గురించి

చెప్పండి" అందామె.

"నేను గాడ్రెజ్ కంపెనీలో ఇంజనీరుగా పని చేస్తున్నాను. నెలకు 3500 జీతం వస్తుంది. ఇక్కడ ఒక యిల్లు కొని నాన్న నాకిచ్చాడు. అమ్మా, నాన్నా పల్లెటూర్లో వుంటారు. నాతో వుండరు. ప్రస్తుతం యిక్కడున్నారు" అన్నాడతను.

అతడు సిగరెట్ వెలిగించాడు. ఆమె అతడివైపు కొంటెగా చూసింది.

"ఈ సిగరెట్ గాక, యితర వైసెస్ ఏమైనా వున్నాయా?"

అతడామె వంక చూస్తూ వుండిపోయాడు.

"నిజం చెప్పండి! నా దగ్గర యేదీ దాచకండి" అందామె.

"అప్పుడప్పుడు విస్కీ సేవిస్తూ వుంటాను."

"ఆడపిల్లల్ని వెంటాడుతూ వుంటారా?"

"ఆ అలవాటు లేదు నాకు. నిన్ను వెంటాడిన మాట నిజమే. మరెవరి వెనకా నేను వెళ్ళలేదు."

ఆమె టైము చూసింది.

"ఇంటర్వ్యూకి వెళ్ళాలి" అందామె.

అతడామె వంక నవ్వుతూ చూశాడు.

"వసంతా, యింటర్వ్యూకి వెళ్ళొద్దు దాన్ని గురించి మర్చిపో! నన్ను పెళ్ళాడాక నువ్వు యే వుద్యోగం చేయనక్కరలేదు."

"ఒకవేళ మన పెళ్ళి కాకపోతే!"

"ఎవ్వరూ మన పెళ్ళిని ఆపలేరు. నేను రాయిలాంటి మనిషిని. ఎవ్వరికీ లొంగను. నీ కోసం ఎందాకైనా ఎది

రించి ఓడిస్తాను."

"ఫిలిం హీరోలా!" అందామె నవ్వుతూ.

"నువ్వు పక్కనుంటే నేను ఫిలిం హీరోనే!" అన్నాడతను సగర్వంగా.

వెనకనుంచి అతడి వీపుమీద తన రొమ్ములను ఆనించి మోకాళ్ళమీద కూర్చుని వెనుతిరిగిన అతడి ముఖాన్ని చూసిందామె. మెల్లిగా వాళ్ళ పెదిమలు అతుక్కున్నాయి.

ఆమె ముందుకొచ్చి అతడి ఎదురుగా కూర్చుంది. అతడివైపు చూస్తూ వుండిపోయింది.

"ఏమిటలా చూస్తున్నావు?"

"నాకు కలల్లో ఒక యువకుడు కనిపిస్తూ వుండేవాడు. అతడికీ, మీకూ బాగా పోలిక లున్నాయి" అందామె.

"నా భార్యగా కాబోయే యువతి నా కెన్నడూ కలలో కనపడలేదు. నా కళ్ళముందే ఆమె ప్రత్యక్షమైంది!"

"మీరు గొప్పవారు లెండి" అందామె అతడివైపు వెక్కిరింపుగా చూస్తూ.

"హోటల్ కెళ్ళి టిఫిన్ తిందాం, పద" అన్నాడతను.

ఇద్దరూ కార్లో కూర్చుని తలుపులు మూశారు. అతడు కారును పోనిచ్చాడు.

"నాకు ఆకలిగా లేదు" అందామె.

"ఇప్పుడు రెండు అవుతోంది. ఎప్పుడు భోజనం చేశావు?" అడిగాడతను.

"పదింటికి. మా యింట్లో పొద్దుట టిఫిన్ తినరు. కాఫీ

మాత్రం మూడు, నాలుగుసార్లు తాగుతారు. మధ్యాహ్నం మూడింటికి టిఫిన్ తింటారు."

"నీ టిఫిన్ టైమ్ దగ్గరవుతోంది."

ఫుడ్ లాండ్స్ కాంపౌండులోకి కారు పోనిచ్చి అతడు ఆపాడు. ఏర్ కండిషండ్ రెస్టారెంట్ లోకి యిద్దరూ వెళ్ళి కుర్చీల్లో కూర్చున్నారు.

అతడామె కళ్ళలోకి చూశాడు.

"నిన్ను కలుసుకున్న యీ రోజుని నే నీ జీవితంలో మరువలేను" అన్నాడతను.

"ప్రతిరోజూ యిలాగే గడవాలని నా ప్రార్థన" అందామె.

"మనం సెలబ్రేట్ చేసుకుందాం!"

"ఇక్కడా, యీ టిఫిన్ తినా?" ప్రశ్నించిందామె.

"ఇక్కడ టిఫిన్ బాగుంటుంది" అన్నాడతను.

హోటల్ బాయ్ రాగానే అతడు పెద్ద ఆర్డరు యిచ్చాడు. ఆమె చెయ్యిని మెల్లిగా నిమిరాడు.

ఆ సమయంలో ఏర్ కండిషండ్ హాల్లో ఎక్కువమంది లేరు.

"వసంతా!"

"చెప్పండి," అందామె.

"టిఫిన్ తిన్నాక ఇక్కడినుండి బాపాలాల్ షాపుకు వెళ్దాం. అక్కడ నీ కొక వుంగరం కొనియిస్తాను" అన్నాడతను.

"ఇవాళ మీకు ఆఫీసు పనిలేదా?"

"నిన్ను చూశాక అన్నిటినీ మర్చిపోయాను" అన్నాడతను వుద్రేకంలో.

"ఆ రింగ్ చూసి అమ్మా, నాన్నా యేమంటారో!" అందామె.

"నేనిచ్చే రింగ్ వాళ్ళకు చూపించకు. హేండ్ బాగ్‌లో పడేసుకో. నాతో వున్నపుడు దాన్ని పెట్టుకో" అన్నాడతను.

"గుడ్ ఐడియా" అందామె.

ఇద్దరూ మాట్లాడుకుంటూ టిఫిన్ తిన్నారు. వేడి కాఫీ తాగారు. అతడు బిల్లు చెల్లించాడు. వాళ్ళు బయటకు నడిచి కారులో కూర్చున్నారు. అతడు కారును పోనిచ్చాడు. నగలు అమ్మే బాపాలాల్ కంపెనీ ముందు అతడు కారును ఆపాడు. ఇద్దరూ పైకి వెళ్లారు.

షో కేసులో వున్న ఎన్నో ఉంగరాలవంక ఆమె చూసింది. ఒక ఉంగరం ఆమెకు బాగా నచ్చింది. ఆ ఉంగరాన్ని కొన్నాడతను. ఆరువందల రూపాయిలుపైన ఖర్చయింది. బాక్సులో వున్న ఉంగరాన్ని తీసుకొని ఇద్దరూ కిందకు దిగారు. కారులో కూర్చున్నారు.

"ఈ దినం చాలా గొప్పది. రియల్లీ ఎ గ్రేట్ డే" అన్నాడతను.

అతడు కారును పోనిచ్చాడు. బీచ్ లోపల రోడ్డుమీద కారును ఆపాడు.

సమీపంలో సముద్రపు హోరు ధ్వనిస్తోంది. బీచ్‌లో ఎక్కువగా జనంలేరు. ఇంకా ఎండగా వుంది. అతడు బాక్సులోంచి రింగ్ తీసి ఆమె వేలుకు పెట్టాడు.

వేలుని వేలికున్న ఉంగరాన్ని ఆమె పరీక్షగా చూసింది.

"ఈ వుంగరం నాకెంతో నచ్చింది. మీకు నేనేమీ యివ్వలేకపోయినందుకు చాలా విచారిస్తున్నాను"

అందామె.

"వసంతా, నీ హృదయాన్ని నాకిచ్చావుగా! అంత కంటె ఏమియ్యాలి?" అన్నాడతను.

"ఇంటి కెళ్ళాలంటే నాకు భయంగా వుంది. కొరుక్కు తినేటట్లు చూస్తాడు మామయ్య నాకేసి" అని ఆమె అతడి దగ్గరగా జరిగింది.

రంజిత్ ఆమెను కౌగలించుకున్నాడు. ఎర్రటి ఆమె పెదిమలను బలంగా ముద్దెట్టుకున్నాడు.

"వసంతా, ఇవాళే నిన్ను నా యింటికి తీసుకు వెళ్తాను. అమ్మా నాన్నా నిన్ను చూస్తారు. మన పెళ్ళికి ముహూర్తం పెట్టించమంటాను" అన్నాడతను.

"నా పరిస్థితి మీకు తెలుసు. పదిమందిలో మన పెళ్ళి అవకూడదు. నా తల్లిదండ్రులకు తెలిస్తే ప్రమాదం. మన పెళ్ళి రహస్యంగా జరగాలి" అందామె.

"నీకు కావలసినట్లే పెళ్ళి చేయించమంటాను. వాళ్ళు వద్దనరు."

"ఆల్ రైట్, అయితే వెళ్దాం" అందామె.

## 2

పడగ్గది విశాలంగా వుంది. ఫ్లోరసెంట్ లైటు వెలుగుతోంది. కిటికీ పక్కన చక్కటి డబుల్ కాట్, పైన ఫోమ్ బెడ్ వున్నాయి. ఒకవైపున మూడు సోఫాలు, రోజ్ వుడ్ టేబుల్ వున్నాయి. గదిలో ఎత్తయిన గాడ్ రెజ్ బీరువా వుంది. బెల్జియం మిర్రర్ బీరువాకి అమర్చబడింది.

"ఇది మన పడగ్గది!" అన్నాడతను.

"డబుల్ కాట్ ముందే కొనేశారు" అందామె వ్యంగ్యంగా.

అతడు నవ్వాడు. సోఫాలో కూర్చున్న ఆమె పక్కనే నిలబడి, ఆమెకేసి చూశాడు.

"రాణీగారూ వచ్చేముందే అన్నీ వుండాలని నా ఆశ" అన్నాడతను.

"మీ అమ్మా, నాన్నా ఏరీ?"

"వాళ్ళు పక్కనున్న ఆంజనేయస్వామి గుడికి వెళ్లారు. కాస్సేపట్లో వస్తారు" అన్నాడతను.

ఆమె అవులిస్తూ అతడివైపు చూసింది.

"బాగా అలిసిపోయినట్లున్నావు!" అన్నాడతను.

ఏవో చప్పుళ్ళు విని అతడు కిటికీలోంచి బయటకు చూశాడు. అతడి తలిదండ్రులు గేటు దాటి వస్తున్నారు.

అతడు ఆమెవంక చూశాడు.

"వసంతా, అమ్మా నాన్నా వచ్చారు. నేను కిందకు వెళ్ళి వాళ్ళతో మాట్లాడి నిన్ను తీసుకువెళ్తాను. నాన్న మెట్లెక్కి పైకి రాలేడు" అన్నాడతను.

"అలాగే" అందామె.

రంజిత్ కింద హాల్లోకి పరుగెత్తాడు. తల్లీ, తండ్రీ అతడివైపు నవ్వుతూ చూశారు.

"బాబూ, కాఫీ తాగావా?" అడిగింది తల్లి.

"తాగేశాను" అని అతడు తండ్రిముందుకు నడిచాడు.

"నాన్నగారూ, వసంత నాకు చాలా నచ్చింది. ఆమెను పెళ్ళాడదల్చాను."

"నీకు నచ్చిన పిల్లతో నీ పెళ్ళి చేస్తాం" అన్నాడు తండ్రి.

"మరో విషయం. ఆమె తలిదండ్రులు యీ పెళ్ళికి ఒప్పుకోరు. తన మామయ్యకిచ్చి ఆమె పెళ్ళిచేయాలని వాళ్ళు నిశ్చయించుకున్నారు. కాని ఆమె నన్ను పెళ్ళి

చేసుకోదల్చింది. ఈ పెళ్ళి రహస్యంగా జరగాలి. ఎక్కువగా పబ్లిసిటీ వుండకూడదు" అన్నాడతను.

"అలాగే చేయిద్దాం" అన్నాడు తండ్రి.

"వసంత ఎక్కడుందిరా?" అడిగింది తల్లి.

"పైనుంది. ఇక్కడకు తీసుకువస్తాను" అన్నాడతను.

అతడు మెట్లవైపు కదిలాడు. రంజిత్ తల్లి సోఫాలో కూర్చున్న భర్త ముందుకు వెళ్ళింది.

"రహస్యంగా పెళ్ళి చేయడం ఏమిటండీ? మనబిడ్డ పెళ్ళి వైభవంగా జరగాలి" అందామె.

"నువ్వు ఆవేశపడకే! ఆ పిల్లను చూడు. తర్వాత తతిమ్మా విషయాలు ఆలోచిద్దాం" అన్నాడతను.

"తొందరపడి వాడు చెప్పినదానికి మీరు తలాడించకండి" అని ఆమె హెచ్చరించింది.

"అలాగేనే, నీ సుత్తి ఆపవే" అన్నాడతను.

ఆమె చెయ్యి పట్టుకొని, అతడు మెల్లగా మెట్లు దిగి వస్తున్నాడు. అతడి తల్లిదండ్రుల చూపు ఆమె మీదే వుంది.

సినిమాతారలా వుందామె. దివినుంచి దిగివచ్చిన దేవతలా కనిపిస్తోందామె.

ఆమె రంజిత్‌తో వాళ్ళముందుకొచ్చింది. వాళ్ళ పాదాలకు నమస్కరించింది.

"అమ్మా, లే, అలా కూర్చో!" అన్నాడు తండ్రి.

రంజిత్ ఆమెను ఎదురుగావున్న సోఫాలో కూర్చోమని పక్కనే కూర్చున్నాడు.

"మీ రిద్దరూ ప్రేమించుకుంటున్నారని విన్నాను" అన్నాడు రంజిత్ తండ్రి.

ఆమె సిగ్గుపడింది. బుగ్గలమీద అందంగా సొట్టలు

పడ్డాయి.

"రా అమ్మా. లోపలకు వెళ్దాం" అంది తల్లి.

రంజత్ తల్లితో ఆమె లోపలకు వెళ్ళింది.

"బాబూ, యిలా రా!" అన్నాడు తండ్రి.

రంజిత్ తండ్రిముందుకు కదిలాడు.

"ఈ అమ్మాయి నీకు యెంతకాలం నుంచి తెలుసు" ప్రశ్నించాడు తండ్రి.

అతడు జవాబివ్వలేదు.

"రోజులా, నెలా, సంవత్సరాలా?"

"నాన్నగారూ, ఆమెను యివాళే చూశాను. మాట్లాడాను. ప్రేమించాను" అన్నాడతను.

రంజిత్ తండ్రి శంకరరావు పేరు పొందిన రచయిత. అనేక పత్రికల్లో అతడి వ్యాసాలు వస్తూ వుంటాయి. పల్లెటూరులో తన పనులు చూసుకుంటూ అతడు వ్యాసాలు రాస్తూ వుంటాడు.

"బాబూ, పెళ్ళి విషయంలో తొందరపడ్డం మంచిది కాదు. ప్రేమించుకుని పెళ్ళాడ్డం అన్నివిధాలా మంచిదే. కాని ఒకళ్ళ నొకళ్ళు అర్థం చేసుకోడానికి కొంతకాలం పడుతుంది. మరి కొంతకాలం ఆమెతో తిరుగు. ఆమెతో మాట్లాడు. ఆమెను అర్థం చేసుకో. అటుపైన పెళ్ళాడొచ్చు" అన్నాడు శంకరరావు.

"నాన్నా, ఆమె తనింట్లో ఎక్కువ రోజులు వుంటే ప్రమాదం. తన మామయ్యకి బలైపోవలసి వస్తుంది. అది జరగకుండా మనం చూడాలి. అందుకే వెంటనే ఆమెను పెళ్ళాడాలి" అన్నాడతను.

"ఆమె తలిదండ్రు లెవరో, ఎక్కడుంటున్నారో కనుక్కున్నావా?"

"నేనడగలేదు. వాళ్ళ పేర్లు, అడ్రసు ఆమె చెప్ప లేదు."

శంకరరావు గంభీరంగా నవ్వాడు.

"బాబూ, ఆ రోజుల్లో నేనూ, నీ తల్లీ ప్రేమించు కునే పెళ్ళాడాం. ఆమె సుబ్బరాజుగారి రెండో కూతు రనీ, వాళ్ళ యిల్లు రెడ్డీ స్ట్రీట్‌లో వుందనీ నాకు తెలుసు. అలాగే నా గురించి నీ తల్లికి తెలుసు. ప్రేమనే సముద్రంలోకి కళ్ళు మూసుకుని దూకడం మంచిది కాదు. ఆలోచించుకో!"

వసంత, అతడి తల్లి తిరిగి వచ్చారు.

"అమ్మాయి నాకు నచ్చింది. కాని ఆమె తలిదండ్రు లను గురించి ఎంత అడిగినా ఆమె చెప్పడంలేదు. ఈ పెళ్ళికి వాళ్ళు ఒప్పుకోరు అంటుంది, చిలకలాగ" అంది అతడి తల్లి.

రంజిత్ పక్కనున్న వసంతవైపు చూశాడు. మొహం చూస్తే ఆమె అలసిపోయినట్లు తెలుస్తోంది.

"వసంతా! నువ్వు యింటికి వెళ్ళాలా?"

"వెళ్ళకపోతే ఫోన్ చేసి చెప్పాలి" అందామె.

"ఏం చెప్తావు?"

"నా ఫ్రెండ్ కమల ఇంట్లో వున్నాననీ, రేపు వస్తా ననీ చెప్పాలి."

"అయితే ఫోన్ చేయి" అన్నాడతను ఫోన్ వైపు చూపిస్తూ.

ఆమె ఫోన్ దగ్గరకు వెళ్ళింది. రసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పింది.

దూరం నుంచి అతడు ఆమెనే చూస్తున్నాడు. ఆమె

రిసీవర్ పెట్టేసి తిరిగివచ్చింది.

"చెప్పాను, సరే అన్నాడు నాన్న" అందామె.

# 3

అందరూ భోజనాలు చేశారు.

"పైకి వెళ్ళి పడుకుంటాం" అన్నాడు రంజిత్.

"పెళ్ళయితే గాని వసంతి నీ గదిలో పడుకోకూడదురా" అంది తల్లి.

"అదంతా నాన్సెన్స్ అమ్మా! ప్రేమించుకున్న క్షణంలోనే మా పెళ్ళి అయిపోయింది" అన్నాడు రంజిత్.

తండ్రి అతడిని పక్కకు పిల్చి యేదో చెప్పాడు.

"మరేమీ ఫరవాలేదు, నాన్నగారూ" అన్నాడతను.

"నేను చెప్పింది గుర్తుంచుకో! పెళ్ళయినదాకా ఆమెకు దగ్గరకు!" అన్నాడు తండ్రి.

వసంతా, అతనూ పైకి నడిచారు. పరుపుమీద ఆమె అమాంతంగా వాలిపోయింది. రెండుసార్లు ఆవులించి అతడివంక చూసింది.

"నాకు నిద్ర వస్తోంది. గుడ్ నైట్" అందామె.

"పడుకో వసంతా, నిర్భయంగా పడుకో!" అన్నాడతను.

ఆమె కళ్ళు మూసుకుని పడుకుంది. అతడామెనే చూస్తున్నాడు. ఆమె పాదాలకేసి చూశాడతను. చిన్న పాదాలు. ఎక్కడా మచ్చలేదు. చేత్తో ఆమె పాదాన్ని పట్టుకున్నాడు.

తృళ్ళిపడ్తూ ఆమె లేచింది. అతడివంక చూసింది.

"నాపాదాలను ముట్టుకోకూడదు మీరు!" అందామె.

"బంగారం బిస్కట్లలా అందంగా ఉన్నాయి నీ పాదాలు" అన్నాడతను.

"ముట్టుకోకుండా చూడండి!" అని ఆమె మళ్ళా నిద్రలోకి జారిపోయింది.

"ఈ రాత్రి నీతో ఎంతో మాట్లాడాలనుకున్నాను" అన్నాడతను.

ఆమె కళ్ళు తెరవలేదు. జవాబివ్వలేదు. అతడు లైట్ ఆఫ్ చేశాడు. గదిలో జీరోవాట్ బల్బుమాత్రం వెలుగుతోంది.

పక్కనే పడుకుని ఆమెమీద చెయ్యివేశాడు. ఆమె గాఢనిద్రలో వుందని గ్రహించి చెయ్యిని తీసేశాడు.

నిమిషాలు గడిచిపోతున్నాయి. దూరంగా వున్న కోడమ్మట కర్రతో చప్పుడుచేస్తూ గూర్ఖా కదుల్తున్నాడు. అతడికి నిద్రపట్టడంలేదు!

అతడు లేచేసరికి తొమ్మిది దాటింది. వసంత పరుపు మీదలేదు. కిందకెళ్ళి ఆమె తన తల్లితో మాట్లాడుతోందా? లేచికూర్చుని అతడు ఆలోచిస్తున్నాడు. తలగడ కిందున్న కాగితాన్ని లాగి విప్పి అతడు చదవసాగాడు.

"నాన్న పొద్దులే రమ్మన్నాడు. వెళ్తున్నాను. మీరు గుర్రెట్టి నిద్రపోతున్నారు. మిమ్మల్ని లేపాలనిపించలేదు. ఒంటి గంటకి ఎగ్మోర్ ఉంపాలా హోటల్ ముందు వుంటాను. వస్తారుగా?" అని రాసి కింద సంతకం పెట్టింది వసంత.

అతడు ఆ చీటీని పదేపదే చదువుకుంటూ వుండిపోయాడు. ఆమె దస్తూరీ చక్కగా వుంది. అక్షరాలు చెక్కినట్లు కనిపిస్తున్నాయి. ఈ చీటీ తనకీ జీవితంలో

వచ్చిన మొదటి ప్రేమలేఖ!

తల్లి గదిలోకొచ్చింది. అతడివంక, పరుపుకేసి ఆమె మౌనంగా చూసింది.

"ఇంకా పడుకుంటావా?" అడిగిందామె.

పరుపుమీద ఆమె కూర్చుంది.

"లేచేవమ్మా! వసంత ఏమైంది?"

"నీతో చెప్పకుండా వెళ్ళిపోయిందంటే నేను నమ్మను" అందామె.

"కనీసం నీతో చెప్పిందా?"

"పళ్ళు తోముకొని కిందకొచ్చింది. నేను యిచ్చిన కాఫీ తాగింది. వాళ్ళ నాన్న పొద్దుటే రమ్మన్నాడుట. వెళ్ళక తప్పిందికాదు" అందామె.

అతడు తల్లి చెయ్యి పట్టుకున్నాడు.

"అమ్మా, మా పెళ్ళి విషయం యేమిటి ఆలోచించారు?"

"రహస్యంగా వెంటనే పెళ్ళి అవ్వాలంటే మా సమక్షంలో మీరు పూలదండలు వేసుకోండి. ఆమె అటు పైన యిక్కడే వుంటుంది."

"అలాగే చేద్దాం, అమ్మా."

"ఇవాళ సాయంత్రం ఐదు తర్వాత మీరెప్పుడైనా పూలదండలు మార్చుకోవచ్చు" అందామె.

"నాన్నగారు పంచాంగం చూశారా?"

"చూసే చెప్పారు. లేచి మొహం కడుక్కొని రా. టిఫిన్ తిని కాఫీ తాగొచ్చు" అని ఆమె బయటకు వెళ్ళిపోయింది.

అతడు యటాచ్‌డ్ బాత్‌రూమ్‌లోకి దూరాడు.

ఆరు దాటింది. కింద హాల్లోని ఫ్లోరసెంట్ లైట్లు వెల్గుతున్నాయి. శంకరరావు, అతడి భార్య సోఫా పక్కనే నిలబడి వున్నారు.

వాళ్ళ కెదురుగా నిలుచున్నారు రంజిత్, వసంత. శంకరరావు వైపు చూశాడు.

"ఇద్దరూ దండలు తీసుకోండి!" అన్నాడు.

టీపాయ్‌మీదున్న దండలను యిద్దరూ తీసుకున్నారు.

రంజిత్ పూలమాలను ఆమె మెళ్ళో వేశాడు. ఆమె మరో పూలమాలను అతడి మెళ్ళో వేసింది.

"ఇప్పుడా దండలను అరడజనుసార్లు మార్చుకోండి, దేవుడిని ప్రార్థిస్తూ" అన్నాడు శంకరరావు.

దండలు యిటూ, అటూ మారాయి. శంకరరావు ఆన్ చేసిన టేప్‌రికార్డర్ నుంచి బాజాలు మోగుతున్న ధ్వని వినపడ్తోంది.

తల్లి యిచ్చిన పసుపుతాడుకు వేళ్ళాడుతున్న మంగళసూత్రాలవైపు రంజిత్ చూశాడు. ఆమె మెళ్ళో తాడును కట్టి గట్టిగా ముడివేశాడు. బాజాల ధ్వని విని పిస్తూనే వుంది.

శంకరరావు టేప్‌రికార్డర్‌ని స్టాప్ చేసి వాళ్ళవైపు చూశాడు.

"మీరు భార్యాభర్తలు, గాడ్ బ్లెస్ యు!" అన్నాడతను.

రంజిత్ తల్లి వసంత చేతికి డజను బంగారం గాజులు తొడిగింది. ఆమె మెళ్ళో ఆరు పేట్ల చంద్రహారం వేసింది. ఆమె చెవులకు ఖరీదైన డైమండ్ కమ్మలు పెట్టింది.

"ఇవన్నీ నా కోడలి కివ్వాలని దాచాను" అంది రంజిత్ తల్లి.

నగలతో అలంకరించబడిన భార్యవైపు ఆప్యాయంగా చూశాడు రంజిత్. ఇద్దరూ పెద్దలకు నమస్కరించారు.

"గుడికెళ్ళి వద్దాం పదండి" అంది వసంత.

ఆమె ధరించిన పట్టుచీర అఖండంగా వుంది. మూడు వేలు పెట్టి రంజిత్ కొన్నాడది.

అందరూ కారులో గుడికి వెళ్ళి తిరిగివచ్చారు. నలుగురూ కలిసి భోజనం చేశారు. వంటామె వడ్డించింది.

రంజిత్, వసంత మేడమీదున్న పడగ్గదికి చేరుకునే సరికి పది దాటింది. అతడి తల్లి గదిని చక్కగా అలంకరించింది. పరుపు పక్కనే టేబుల్ మీద అసార్టెడ్ స్వీట్స్, పళ్ళు వున్నాయి. గ్లాసులో చిక్కటి పాలు!

డజన్ అగరవత్తులు వెలుగుతున్నాయి. వాటి సువాసన గది నలువైపులా వ్యాపించింది.

ఆమె లోపల కెళ్ళగానే అతడు తలుపు మూసి లాక్ చేశాడు. ఆమె సోఫాలో కూర్చుంది. అతడామె పక్కనే కూర్చున్నాడు.

"వసంతా, అంతా నువ్వు కోరినట్లు సాగిపోయింది. మన పెళ్ళి అయినట్లు మీ వాళ్ళకు తెలియదు. ఇటువైన నీకు యే టెంగా లేదు. హాయిగా యిక్కడుండొచ్చు" అన్నాడతను.

"ఇవాళ వచ్చేటప్పుడు నేను నాన్న కొక చీటీ రాసి పెట్టాను" అందామె.

"ఏం రాశావు?"

"మామయ్యను పెళ్ళాడ్డం నా కిష్టం లేదన్నాను. నేను దూరంగా పోతున్నా, నా కోసం వెతకొద్దు అన్నాను."

"ఈపాటికి వాళ్ళు నీ కోసం వెతుకుతూ వుంటారు!" అన్నాడతను.

"ఈ మహాపట్నంలో నే నెక్కడున్నానో వాళ్ళు కనుక్కోలేరు" అందామె.

అతడామె చెయ్యి పట్టుకుని గాడ్ రెజ్ బీరువా దగ్గరకు తీసుకెళ్ళాడు. తాళం తీసి బీరువాని తెర్చాడు. ఒక సొరుగును ముందుకు లాగాడు. అందులో నోట్ల కట్టలు పేర్చబడి వున్నాయి.

"అమ్మ నీకు యెన్నో నగలు యిచ్చింది. ఈ డబ్బంతా నేను నీ కిచ్చేస్తున్నాను. ఆ డబ్బు నీది" అన్నాడతను.

"అంత డబ్బు నేనేం చేసుకోను?" అందామె అమాయకంగా.

"నీ యిష్టం!" అన్నాడతను.

ఆమె బీరువా తలుపు మూసి తాళం వేసింది. ఇద్దరూ పరుపుమీద కూర్చున్నారు.

"మనం హనిమూన్ కి వెళ్ళాలి!"

"మూడు రాత్రులు ఇక్కడ గడిపి తర్వాత వెళ్దాం" అందామె.

"ఎక్కడకు వెళ్దాం?" ప్రశ్నించాడతను.

"ఊటీకి" అందామె.

"కాశ్మీర్ పోదాం. అక్కడ స్వర్గంలా వుంటుంది" అన్నాడతను.

"కాశ్మీర్ లో పరిస్థితులు బాగా లేవని విన్నాను."

"ఇప్పుడు బాగానే వుంది" అన్నాడతను.

ఆమె పరుపుమీద వాలింది. పక్కనే పడుకొని అతడామెను ముద్దాడాడు. ఆమె పెదిమలను చప్పరించాడు.

"యూ ఆర్ లవ్లీ! ఇది మన మొదటిరాత్రి!" అన్నాడతను.

అతడి ఒళ్ళు వేడెక్కుతోంది. అతడి చేతుల్లో వుక్కిరిబిక్కిరవుతోంది. అమాంతంగా ఆమె లేచింది. బాత్రూమ్‌లోకి పరుగెత్తింది. కొంతసేపయ్యాక తిరిగివచ్చింది. అతడివైపు దీనంగా చూసింది.

"వసంతా, ఏమిటలా వున్నావు?" అడిగాడతను.

"మీరు మూడురోజులదాకా నా దగ్గరకు రాకూడదు!" అందామె.

అతడు పిచ్చివాడిలా ఆమెవైపు చూశాడు. అతడిలో చెలరేగే అగ్నిజ్వాలలమీద ఫైర్ సర్వీస్ మనుషులు చన్నీళ్ళు పోస్తున్నట్లు అనిపించింది.

"మన మొదటి రాత్రి పెద్ద సున్నాగా మారింది!" అన్నాడతను.

ఆమె పకపక నవ్వింది.

"మూడు రాత్రులు. మూడు సున్నాలు!" అందామె.

అతను మాట్లాడకుండా ఆమెవంక చూస్తూ వుండిపోయాడు.

"నువ్వు చాలా అందంగా వున్నావు."

"మూడు రోజులు ఓపిగ్గా వుంటే, అటుపైన నా అందమంతా మీదే!" అందామె.

"ఇప్పుడు కాదా?"

ఆమె నవ్వింది.

"అందుకోలేని ఆపిల్ కేసి చూస్తూ నుంచుంటే కోర్కె పెరుగుతుంది, కాని ఆకలి తీరదు!" అందామె".

"కవయిత్రిలా చెప్పావు!"

"మన పరిస్థితి చూస్తూంటే కవిత్వం పుట్టుకొస్తుంది

అందామె.

అతడు సిగరెట్ వెలిగించాడు. పొగ వదుల్తూ ఆమె వంక చూశాడు.

"ఒక దుప్పటి యిలా పడేయండి. నేను కింద పడుకుంటాను" అందామె.

"అదంతా పాత కాలపు పద్ధతి. నువ్వు పరుపుమీదే పడుకోవచ్చు."

"పెద్దలు చెప్పింది మనం పాటించాలి" అందామె.

"మొదటి రాత్రి మరొకళ్ళదైనప్పుడు పెద్దలు అలా చెప్తూనే వుంటారు!"

ఆమె నవ్వింది.

"పరుపుమీదే పడుకుంటాను. మీరు నా దగ్గరకు జరగకూడదు" అందామె.

"మనిద్దరి మధ్య పెద్ద దిండు పెడదాం."

ఆమె పరుపుమీద పడుకుంది. పక్కనే దిండు పెట్టి అతను యిటువైపున మేను వాల్చాడు.

"ఇవాళ నిద్ర పట్టదు. జాగారం చేయాలి" అన్నాడతను.

"నిద్ర రాకపోతే పోయిందేమిటి? రేపు పడుకోవచ్చు" అందామె నవ్వుతూ.

## 5

రెండు రోజులు వ్యర్థంగా గడిచిపోయాయి.

పదిహేను రోజులు సెలవు పెట్టిన రంజిత్ పది దాకా నిద్రపోయి మేలుకొన్నాడు.

పక్కకు తిరిగిచూశాడు. పక్కన దిండు లేదు, వసంత లేదు. అతడు కిందకు దిగాడు. నిద్ర నుంచి లేవగానే

ఆమె ముఖం చూడ్డం అతడికి అలవాటైంది. ఇవాళ ఆమె కనబడలేదు!

ఆమె కిందకు వెళ్ళిందేమో! అన్ని తలగడల కిందా చూశాడతను. ఎక్కడా ఆమె చీటీ లేదు.

అతడు మెట్లు దిగి కిందకు వెళ్ళాడు. హాల్లో వున్న తల్లివైపు చూశాడు.

"వసంత ఏదమ్మా?"

"పైన లేదూ?" ఎదురు ప్రశ్న వేసిందామె.

"నువ్వామెను చూడలేదా?"

ఆమె తల అడ్డంగా తిప్పింది.

అతడు తండ్రి గదిలోకి వెళ్ళాడు.

అతను దినపత్రిక చూస్తున్నాడు.

"నాన్నగారూ, వసంతను చూశారా?" అడిగాడతను.

"ఎక్కడో వుంటుంది. నేను చూడలేదు" అన్నాడు శంకరరావు.

రంజిత్ పైకి పరుగెత్తాడు. బాత్‌రూమ్‌లోకి వెళ్ళాడు. వెనక్కి తిరిగివచ్చాడు. ఆమె తన యింటికి వెళ్ళిందా?

అక్కడకు వెళ్ళివుండదు. అతడు గాడ్‌రెజ్ బీరువా తెరిచాడు. అక్కడ ఆమె నగలు లేవు. సొరుగు లాగి చూశాడు. అక్కడ నోట్లకట్టలు లేవు!

అతడి గుండె దడదడ లాడింది. అతడి కాళ్ళూ, చేతులూ వణుకుతున్నాయి. అన్ని నగలతో, అంత డబ్బుతో ఆమె ఎక్కడకు వెళ్ళింది?

బాత్‌రూమ్‌లో కెళ్ళి అతడు వేగంగా మొహం కడుక్కున్నాడు. పాంటు, స్లాక్ ధరించి అతడు కిందకు వెళ్ళాడు.

అతని తలిదండ్రులు పెద్ద సోఫాలో కూర్చుని వున్నారు.

"వసంత కనిపించిందా?"

"లేదు!" అన్నాడతను.

అతడి కళ్ళమ్మట నీళ్ళు జలజల కారాయి. అతడి తల మీద తల్లి చెయ్యి వేసింది.

"నగలు, గాడ్‌రెజ్ బీరువాలో వున్న యాభై వేలు తీసుకుని ఆమె వెళ్ళిపోయింది" అన్నాడు రంజిత్.

"ఆమె యిల్లెక్కడ?"

"తెలియదు."

"ఆమె తండ్రి పేరు?"

"తెలియదు."

"బాబూ, నేను మొదటే చెప్పాను. ఆమె గురించి అంతా తెల్సుకోమన్నాను. గుడ్డిగా ప్రేమలో పడి అంతా పోగొట్టుకున్నావు" అన్నాడు శంకరరావు.

"నా వసంత యెక్కడికీ పోదు. అలా యెక్కడికో వెళ్ళుంటుంది. కాస్సేపట్లో వస్తుంది" అన్నాడు రంజిత్.

"అయితే చూద్దాం, ఏం చేస్తుందో!" అన్నాడు తండ్రి.

రంజిత్ పిచ్చివాడిలా బయటకు నడిచాడు. "కాఫీ తాగి వెళ్ళరా!" అంది తల్లి.

"వద్దమ్మా, అలా వెళ్ళి చూసి వస్తాను" అన్నాడతను.

అతను తన కారును వేగంగా బయటకు పోనిచ్చాడు. అనేక చోట్ల ఆమె కోసం చూశాడు.

అతడు యింటికి తిరిగొచ్చేసరికి మూడు దాటింది.

"ఎక్కడా ఆమె కనబడలేదు" అన్నాడతను.

"బాబూ, భోజనం చేద్దువుగాని రా! కాస్సేపు ఆమెను గురించి ఆలోచించకు!" అంది తల్లి.

బిస్మిల్లాఖాన్ షేనాయి విషాదకరంగా టేప్ రికార్డర్ నుంచి వినపడ్తోంది. షేనాయి పాట వింటుంటే అతడి గుండెను ఎవరో నులుపుతున్నట్లు అనిపిస్తోంది.

అతడు మెల్లెక్కి పైకి వెళ్ళాడు. పరుపుమీద పడి వెక్కి వెక్కి ఏడ్వసాగాడు. అతడి తల్లి గదిలోకి వచ్చి పక్కనే కూర్చుంది.

"తిండి తినరా" అందామె.

"ఆకలి లేదమ్మా."

"అది నిన్ను నట్టేట వదిలి పారిపోయింది. ఆమె యిలా చేస్తుందని నేననుకోలేదు" అందామె.

"ఆమె పుట్టింటికి వెళ్ళి వుంటుందమ్మా. తప్పక వస్తుంది" అన్నాడతను.

"భోజనం చేసి ఆమె కోసం ఎదురు చూడు!"

"నేను తినలేనమ్మా!" అన్నాడతను ఏడుస్తూ.

అతడివైపు ఆమె జాలిగా చూసింది.

"బాబూ, దేవుడు నిన్ను రక్షిస్తాడు. వసంతను యిక్కడకు తప్పక పంపుతాడు. ధైర్యంగా వుండు" అందామె.

# 6

మూడు రోజులు దొర్లిపోయాయి. ఎక్కడా వసంత జాడలేదు.

రంజిత్ పట్నంలో తిరిగి తిరిగి వస్తున్నాడు. ఆమె గురించి ఏ సమాచారమూ అందడంలేదు.

పడగ్గదిలో కూర్చుని రంజిత్ విస్కీ తాగుతున్నాడు. రెండు గంటలు పైన తాగుతూనే వున్నాడు. తాగుడుతో

తన జీవితాన్ని నాశనం చేసుకోవద్దని తలిదండ్రులు ఎంత హెచ్చరించినా అతను వినలేదు.

టెలిఫోన్ మ్రోగింది. తూలుతూ వెళ్ళి అతడు రిసీవర్ని అందుకున్నాడు.

"హలో!" అన్నాడు.

"మిస్టర్ రంజిత్!" అందో స్త్రీ కంఠం.

"నేనే, రంజిత్" అన్నాడతను.

"నేను వసంతని" అందామె.

ఆ పేరు విని అంత నిషాలో కూడా అతడు త్ళుళ్ళిపడ్డాడు.

"వసంతా! ఎక్కడున్నావు?"

"మీరు బాగా నిషాలో వున్నట్లున్నారు?" అందామె.

"విస్కీ తాగేస్తున్నాను. ఫైన్ డ్రింక్! వసంతా, నీ కోసం తాగుతున్నాను!"

"నా కోసం తాగొద్దు. తాగడం మానండి."

"నువ్వు ఎక్కడున్నావో చెప్పు! అక్కడకు వెంటనే వస్తాను."

"మ్యూజియమ్ ఎదురుగా వుంటాను, రండి."

"వస్తున్నాను" అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

వసంతతో మాట్లాడగానే అతడి నిషా కొంచెం తగ్గింది.

అతడు మెట్లు దిగాడు. హాల్లో తండ్రి అతడికి అడ్డుపడ్డాడు.

"ఎక్కడికిరా?"

"వసంత ఫోన్ చేసింది. మ్యూజియం దగ్గర వుంటానంది. నన్ను రమ్మంది. వెళ్తున్నాను."

"ఈ స్థితిలో నువ్వు కారు నడపలేవురా!"

"నడపగలను."

"వాడితో మీరూ వెళ్ళండి" అంది రంజిత్ తల్లి.

అతడిని ముందుసీటుమీద కూర్చోబెట్టి శంకరరావు కారును పోనిచ్చాడు. ఓరగా కొడుకువైపు చూశాడు.

"బాబూ, వసంత నిజంగా ఫోన్ చేసిందా?"

"చేసింది నాన్నగారూ. నేను మాట్లాడాను."

"ఇలా అధికంగా తాగడం వలన నీ ఆరోగ్యం దెబ్బ తింటుంది" అన్నాడు తండ్రి.

"మీరూ, అమ్మా రోజూ అదే చెప్తున్నారు! మనసు గాయపడినపుడు ఆరోగ్యం పోతే దిగులెందుకు?" అన్నా డతను.

మ్యూజియమ్ యెదురుగా తండ్రి కారును ఆపాడు. ఇద్దరూ దిగారు. ఆమె కోసం వెతికారు. ఆమె ఎక్కడా కనబడలేదు.

"ఆమె ఫోన్ చేసినట్లు కలగన్నావు, నిషా సృష్టిం చిన కల!" అన్నాడు తండ్రి.

"ఆమెతో మాట్లాడాను. నన్ను నమ్మండి!"

గంటపైగా అక్కడే వుండి ఆమె కోసం చూశారు వాళ్ళు. ఎక్కడా ఆమె లేదు!

"ఇంటికి పోదాం పదరా!" అన్నాడు తండ్రి.

"నేను రాను. ఆమె నాకోసం వస్తుంది. వసంత వచ్చినదాకా యిక్కడే వుంటాను" అన్నాడు రంజిత్.

కొడుకును బలంగా తోసుకెళ్ళి అతడు సీటుమీద కూర్చోబెట్టాడు. కారును పోనిచ్చాడు.

రంజిత్ పసిపాపలా ఏడుస్తున్నాడు.

"బాబూ, వసంత మర్యాదగా బతికే పిల్లకాదు. డబ్బు, నగలు అన్నీ పట్టుకుని ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళి

పోయింది. ఆమె గురించి పోలీసు రిపోర్టివ్వడం మంచిది" అన్నాడు తండ్రి.

"ఆ డబ్బును నేను ఆమెకిచ్చాను. తన వస్తువులతో ఆమె వెళ్ళిపోయింది. ఆమె దొంగ కాదు!" అన్నాడు రంజిత్.

"అదంతా దేనికి బాబూ, నీ భార్య కనబడ్డంలేదని రిపోర్టిద్దాం" అన్నాడు తండ్రి.

"ఇవాళ ఆమె నాకు ఫోన్ చేసింది. రేపో, ఎల్లుండో ఆమె వచ్చేస్తుంది. పోలీసులు ఆమెను కష్టపెట్టడం నాకిష్టంలేదు" అన్నాడు రంజిత్.

కొంతసేపు ఎవ్వరూ మాట్లాడలేదు. కారును యింటివైపు పోనిచ్చాడు శంకరరావు. ఇంటిముందు కారును ఆపాడు. కిందకు దిగి ముందు తలుపు తెరిచాడు. రంజిత్ నిద్రపోతున్నాడు!

కారు దగ్గరకు అతడి భార్య పరుగెత్తుకొచ్చింది.

"వసంత కనిపించిందా?" అడిగిందామె.

"ఆమె కనిపిస్తే వీడీ స్థితిలో ఎందుకుంటాడే? తూనయ్యని రమ్మను. బాబును మోసుకెళ్ళి పడుకోబెట్టాలి" అన్నాడు శంకరరావు. ఆమె లోపలకు పరుగెత్తింది.

## 7

శంకరరావు టెలిఫోన్ రిసీవర్ ఎత్తి ఒక నంబరు తిప్పాడు.

"హలో, డేవిడ్" అందో కంఠం అటువైపునుంచి.

"మిస్టర్ డేవిడ్, నేను శంకరరావుని. యెలా వున్నావు?"

"ఫైన్ సార్. రంజిత్ ఎలా వున్నాడు?"

"రంజిత్ గురించి మాట్లాడ్డానికే నీకు ఫోన్ చేస్తే!"

"ఏమైందతనికి?"

"ఆఫీసుకు సెలవు పెట్టి ఇంట్లో కూర్చుని విస్కీ మహా తాగేస్తున్నాడు. తిండికూడా సరిగ్గా తినడంలేదు."

"గుడ్ హెవన్స్, ఎంత మార్పు! ఎందుకలన అతడలా మారిపోయాడు?"

"ఒకమ్మాయి అతడి జీవితంలోకి ప్రవేశించి, రహస్యంగా అతడిని పెళ్ళాడి మూడురోజులు తిరిగేలోపల మాయమైంది. ఆమెను గురించే ఆలోచిస్తూ రంజిత్ కృశించిపోతున్నాడు. నువ్వొకసారి వచ్చి అతడిని చూడాలి!"

"తప్పక వస్తాను. నేను సైకియాట్రిస్టుగా కాక ఫ్రెండులా వస్తాను."

"వాడిని కాపాడే బాధ్యత నీకు వదులుతున్నాను. ప్లీజ్ కమ్!"

"వీలుచూసుకుని వస్తాను" అన్నాడు డేవిడ్.

ఒక పేరు పొందిన హాస్పిటల్లో డేవిడ్ సైకియాట్రిస్టుగా వుంటున్నాడు. అతడూ, రంజిత్ ఒకప్పుడు అమెరికాలో చదువుకున్నారు.

శంకరరావు తన భార్యవంక చూశాడు.

"వసంతతో అంతా పోయిందనే భావం వాడిలో పాతుకుపోయింది. ఆ భావాన్ని చెదరగొడ్తేగాని వాడు బాగుపడడు. అందుకని డేవిడ్ని యిక్కడకు రమ్మన్నాను" అన్నాడతను.

"డేవిడ్ మూలంగా బాబు మార్తాడని ఆశించుదాం" అందామె.

మేడమీద తన పడగ్గదిలో రంజిత్ ఒంటరిగా

కూర్చుని వున్నాడు. తనకోసం తాగొద్దని వసంత అనడం అతడికి గుర్తుంది. అతడు యివాళ తాగలేదు. ఆమె ఫోన్ కాల్ కోసం ఎదురు చూస్తున్నాడు.

నిమిషాలు గడుస్తున్నాయి. గంటలు గడిచిపోతున్నాయి. ఆమెనుంచి ఫోన్ కాల్ రాలేదు. విస్కీ నిషాలో వసంత తనకు ఫోన్ చేసిందని తను వూహించుకున్నాడేమో!

టెలిఫోన్ మ్రోగింది. అతడు వెళ్ళి రిసీవర్ని ఎత్తాడు.

"రంభను పిలవండి" అన్నాడొకతను.

"మీకే నంబరు కావాలి?" అడిగాడతను.

అతడు నంబరు చెప్పాడు.

"రాంగ్ నంబర్" అని అతడు రిసీవర్ని పెట్టేశాడు.

సోఫాకు బోర్లాబడి అతడు తివాసీమీద కూర్చున్నాడు. రోడ్డుమ్మట రణగొణ ధ్వనిచేస్తూ ఏదో ట్రాక్టర్ కదుల్తోంది. ఆ ట్రాక్టర్ కిందపడి నలిగి, పచ్చడవాలని పిస్తోందతనికి!

రంజిత్ సిగరెట్ వెలిగించాడు. రెండుసార్లు పొగ పీల్చి, వదిలి, దాన్ని యాష్ట్రేలో పడేశాడు. ఏదో తపన!

టెలిఫోన్ మ్రోగింది. మెల్లిగా వెళ్ళి రిసీవర్ని తీసుకున్నాడతను.

"హలో, రంజిత్ హియర్!" అన్నాడతను.

అటువైపునుంచి ఏ శబ్దంలేదు.

"హలో!" అన్నాడతను మళ్లా.

"వసంత" అందామె.

అతను ఏడ్వసాగాడు.

"ఏడుస్తున్నారా?" అందామె.

"నాకు మిగిలింది కన్నీళ్ళే" అన్నాడతను.

"ఆ రోజు ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళిపోయాను. పొద్దుటే మీ మొహం చూశాను. నాకెందుకో అసహ్యమేసింది. వెంటనే వెళ్ళిపోయాను" అందామె.

"నువ్వు ఎక్కడున్నావు?"

"ఎందుకు?"

"వచ్చి నిన్ను కలుసుకుంటాను."

"మిమ్మల్ని మళ్ళా చూడాలనే ఉద్దేశంలేదు నాకు!"

"వసంతా, నువ్వు నా భార్యవు. మన పెళ్ళి అయింది!"

"అటువంటి పెళ్ళిళ్ళు ఎన్నో అయ్యాయి నాకు!" అని ఆమె పకపక నవ్వింది.

"వసంతా, నిన్ను నేను ప్రేమిస్తున్నాను. నే నెవర్నీ యింతకుముందు ప్రేమించలేదు. ఇది నా మొదటి ప్రేమ. నువ్వు లేకుండా నేను బతకలేను!" అన్నాడతను.

"అలా అన్న మగాళ్ళు చావడం నేను చూడలేదు" అందామె వ్యంగ్యంగా.

"వసంతా, నేను నిద్రాహారాలు మాని నీకోసం తపిస్తున్నాను. నువ్వు త్వరలో తిరిగిరాకపోతే నా మరణం గురించి నువ్వు పత్రికల్లో చదువుతావు" అన్నాడతను.

ఆమె పకపక నవ్వింది.

"నేను చెప్పింది చేస్తారా?"

"ఏం చెప్పినా చేస్తాను" అన్నాడతను.

"శెలూన్‌కి వెళ్ళి గుండు చేయించుకోండి. ఇంట్లో కూర్చుని నా కోసం తపిస్తూ వుండండి" అందామె.

"అలా చేస్తే వస్తావా?"

"చేసి చూడండి!"

"వెంటనే చేస్తాను. నీ మాటే నాకు వేదం."

ఆమె రిసీవర్ పెట్టేసింది. అతడు కిందకు దిగి కారు వైపు నడిచాడు. కారును వేగంగా పోనిచ్చాడు. తిలక్ శెలూన్ ముందు కారాపి దిగాడు. శెలూన్‌లోకి వెళ్ళి కాస్సేపట్లో తిరిగివచ్చాడు. తలమీద ఒక్క వెంట్రుక లేదు! సూర్యకాంతిలో బోడిగుండు మెరుస్తోంది.

అతడు కారును తన యింటికి పోనిచ్చాడు. తండ్రి, తల్లి అతనివైపు ఆశ్చర్యంగా చూశారు.

"ఏమిట్రా యీ వేషం?" అన్నాడు తండ్రి.

"వసంత గుండు చేయించుకోమంది, నాన్నా. ఆమె కోసం ఏదైనా చేస్తాను. ఆమె నా దేవత! నా దైవం" అని అతడు మెట్లెక్కి పైకి వెళ్ళాడు.

# 8

సైకియాట్రిస్టు దేవిడ్ తన అంబాసిడర్ కారును వేగంగా పోనిస్తున్నాడు.

ఒక యువతి రోడ్డు మధ్యగా నడుస్తోంది. అంతవరకూ పక్కన నడిచే ఆమె రోడ్డు మధ్యకు జరిగింది. అతడు నాలుగుసార్లు హారన్ నొక్కాడు. ఆమె పక్కకు కదలేదు. వెనుదిరిగి కారువైపు చూసి మళ్ళా ముందుకు నడక సాగింది.

ఆమె వెనకనే కారాపి అతడు హారన్ నొక్కాడు. ఆమె కారు దగ్గరకొచ్చి అతడివైపు నవ్వుతూ చూసింది.

"ఆత్మహత్యా ప్రయత్నమా?" ప్రశ్నించాడతను.

"కారును ఆపే ప్రయత్నం" అందామె.

"ఎక్కు" అన్నాడు దేవిడ్.

ముందు సీటుమీద కూర్చుని ఆమె తలుపు మూసింది. దేవిడ్ కారును పోనిచ్చాడు.

"నా పేరు పద్మ. నా తండ్రి టింబర్ వ్యాపారంలో లక్షలు గడించాడు. నన్ను మామయ్యకిచ్చి పెళ్ళిచేయాలని నా తలిదండ్రుల సంకల్పం. ఆ పెళ్ళి నా కిష్టంలేదు. ఇంట్లోంచి పారిపోయి యిలా వచ్చాను. ఎక్కడికేనా పోవాలి" అందామె.

ఓరగా ఆమెవైపు చూశాడతను. ఆమె చెవులకున్న కమ్మలు మెరుస్తున్నాయి. మెళ్లో ఆరు పేటల చంద్రహారం వుంది. ఆమె ధనవంతుల పిల్లయి వుండాలి. చాలా అందంగా వుంది.

"నువ్వు ఎక్కడికెళ్ళాలి?"

"మీరెక్కడి కెళ్తారు?" ఎదురు ప్రశ్న వేసిందామె.

"తేనాంపేట కెళ్ళాలి."

"అక్కడ దిగుతాను" అందామె.

అతడు కారును పోనిచ్చాడు.

డేవిడ్ ఆమెను గురించే ఆలోచిస్తున్నాడు. ఇంత అందమైన యువతి, నగల్తో రోడ్లమ్మట తిరగడం ప్రమాదకరం.

"పద్మా, నేను అర్జంటు పనిమీద వెళ్తున్నాను. నీతో మాట్లాడాలి. సాయంత్రం ఎక్కడ కలుసుకుందాం? నువ్వు చెప్పిన చోటుకు నేనొస్తాను" అన్నాడతను.

అతడివైపు ఆమె నవ్వుతూ చూసిలది.

"మౌంట్ రోడ్డులోని బుహారీ హోటల్ ముందు వుంటాను ఐదింటికి" అందామె.

"తప్పక అక్కడికొస్తాను" అన్నాడతను.

తేనాంపేటముందే ఆమె దిగిపోయింది. అతడు కారును పోనిచ్చాడు. ఒక యింటిముందు కారాపి దిగాడు.

హాల్లోకి వెళ్ళాడు. శంకరరావు అతడివైపు నవ్వుతూ

చూశాడు.

"హలో దేవిడ్, నువ్వు వచ్చినందుకు సంతోషం. పైనున్నాడు రంజిత్. వెళ్ళి మాట్లాడు" అన్నాడతను.

దేవిడ్ పైకి వెళ్ళాడు. మఠం వేసుకు కూర్చుని తపస్సు చేస్తున్న రంజిత్ వంక చూశాడు. రంజిత్ బోడి గుండుతో బుద్ధుడిలా వున్నాడు.

"హలో రంజిత్!" పిల్చాడతను.

అతడు కళ్ళు తెర్చి చూశాడు.

"హల్లో, దేవిడ్ నువ్వా!" అన్నాడు రంజిత్.

"ఇలా వెళ్తూ నిన్ను చూసి పోదామని వచ్చాను" అన్నాడు దేవిడ్.

రంజిత్ అతడివైపు చూసి నిట్టూర్చాడు.

"రంజిత్, ఏమైందో చెప్పు!" అన్నాడు దేవిడ్.

జరిగినదంతా వివరంగా రంజిత్ అతడికి చెప్పాడు. అదంతా విని దేవిడ్ తృళ్ళిపడ్డాడు. తన కారెక్కిన పద్మ అతడికి గుర్తొచ్చింది.

రంజిత్ కన్నీళ్ళతో దేవిడ్ చేతులు పట్టుకున్నాడు.

"దేవిడ్, నేను ప్రస్తుతం గాఢాంధకారంలో వున్నాను. నాకు తోవ చూపించు" అన్నాడు రంజిత్.

"మైడియర్ ఫ్రెండ్, నీకు చెయ్యగలిగినది తప్పక చేస్తాను. వసంత ఫోటో నీ దగ్గర వుందా?"

"లేదు."

"డోంట్ బాదర్, నేను అంతా చూస్తాను" అని దేవిడ్ కిందకు దిగాడు.

శంకరరావు మెట్లు దిగిన దేవిడ్ వంక చూశాడు.

"బాబుకోసం ఏం చెయ్యదల్చావు, దేవిడ్?"

"త్వరలో రంజిత్ బాగుపడ్తాడు. మీరు బెంగెట్టు

కోవద్దు!" అన్నాడు డేవిడ్.

రంజిత్ తల్లి డేవిడ్‌కి కాఫీ యిచ్చింది. అతడు కాఫీ తాగుతూ చెమ్మగిల్లిన ఆమె కళ్ళవైపు చూశాడు.

"అమ్మా రంజిత్‌కి ఏ ప్రమాదమూ రాదు. వారం రోజుల్లో అతను మునుపటిలా వుంటాడు" అన్నాడతను.

"వాడిని రక్షించు నాయనా" అందామె.

సైకియాట్రిస్టు డేవిడ్ బయటనున్న కారులో కూర్చున్నాడు. ఆలోచిస్తూ కారును పోనిచ్చాడు.

# 9

సాయంత్రం ఐదింటికి డేవిడ్ తన కారును బుహారీ హోటల్ ముందు ఆపి దిగాడు. పేవ్‌మెంట్ మీద నడుస్తూ చూశాడు.

ఒక చోట ఆమె నిలబడింది. అతడామె దగ్గరకు నడిచాడు.

"వెళ్దాం రా," అన్నాడు.

"ఆకలేస్తోంది" అందామె.

ఇద్దరూ హోటల్లోకి వెళ్ళారు. కస్టర్డ్, చికెన్ పులావ్ తిని, టీ తాగి వాళ్ళు బయట కొచ్చారు. అతడి కారులో కూర్చుని తలుపులు మూశారు. అతడు కారును పోనిచ్చాడు. తన ప్రయివేట్ క్లినిక్ ముందు కారు ఆపాడు. ఇద్దరూ దిగారు.

క్లినిక్‌లో ఎవ్వరూ లేరు. అతడి కెదురుగా ఆమె కూర్చుంది. ఆమెవైపు అతను తీక్షణంగా చూశాడు. ఆమె రెప్పలు చిట్లించింది.

"నీ పేరు పద్మ. నీకు వేరే పేర్లు వున్నాయి!" అన్నాడతను.

"నా పేరు పద్మ. మరో పేరు నాకు లేదు."

అతడు రొటేటింగ్ కుర్చీలోంచి లేచాడు. ఆమెను బల్లమీద పడుకోమన్నాడు. ఆమె పడుకొని అతడివైపు నవ్వుతూ చూసింది.

డేవిడ్ సైకియాట్రిస్టు మాత్రమే కాదు. అతడు పేరు పొందిన హిప్నటిస్టు. టేబుల్ పక్క నిలబడి ఆమె కళ్ళలోకి చూశాడతను.

అతడి కళ్ళు కత్తుల్లా వున్నాయి. అతడివైపు చూడ లేక ఆమె కళ్ళు మూసుకుంది.

"పద్మా, నీ గతాన్ని గురించి చెప్పు!" అన్నాడతను.

ఆమె మాట్లాడలేదు. చలనం లేకుండా పడుకొంది.

"పద్మా, నీ గతం! నీ గతం! నీ గతం!" అన్నాడు డేవిడ్.

ఆమె కళ్ళు తెరవలేదు.

"అమ్మా, నాన్నా పోయారు. మామయ్య ఇంట్లో పెరిగాను. ఒక రాత్రి మామయ్య నా పక్కలోకి రహస్యంగా చేరాడు. నన్ను రేప్ చేయబోయాడు. అతడిని తోసేసి బయటకు పారిపోయాను" అందామె.

"తర్వాత?"

"టికెట్ లేకుండా పట్నం చేరుకున్నాను. టికెట్ ఎగ్జామినర్ నన్ను పట్టుకుని ఒక సెల్‌లో దింపేశాడు. పట్టాల పక్కన నన్ను బలాత్కరించడానికి ప్రయత్నించాడు. దేవుడు నన్ను రక్షించాడు. అక్కడ నుంచి పారిపోయాను."

"అటుపైన ఏమైంది?"

"మద్రాసు పట్నం చేరుకున్నాను. ఒక అనాథాశ్రమంలో చేరాను. ఆ అనాథాశ్రమం సెక్రటరీ నన్ను బాత్‌రూమ్‌లో రేప్ చేయడానికి ప్రయత్నించాడు,

అతడికి నేను లొంగలేదు. మగాళ్ళు అంటే నాకు అసహ్యం ఏర్పడింది. మగాళ్ళను ఏడిపించాలి! బాధించాలి!" అరిచిందామె.

అతడు మౌనంగా వుండిపోయాడు.

"నేను చూసిన మగాళ్ళందరూ రాక్షసులే!" అందామె.

"పద్మా, మగాళ్ళలో దేవతలు కూడా వున్నారు" అన్నాడతను.

"లేరు" అరిచిందామె.

"రంజిత్ ని జ్ఞాపకం తెచ్చుకో! అతడు దేవుడిలాంటి వాడు. నిన్ను ప్రేమించాడు. నిద్రాహారాలు మాని, గుండు చేయించుకొని. నీ కోసం అతడు తపస్సు చేస్తున్నాడు" అన్నాడు డేవిడ్.

అమాంతంగా ఆమె బల్లమీద లేచి కూర్చుంది. అతడి వైపు పిచ్చిదానిలా చూసింది.

"నన్ను నిజంగా ప్రేమించే వ్యక్తి యీ లోకంలో వున్నాడా?" అందామె.

"ఒక్కే ఒక రంజిత్ వున్నాడు. నువ్వు డబ్బూ, నగలూ పట్టుకొని పారిపోయినా అతడు పోలీసు రిపోర్టు యివ్వలేదు. తన ప్రియురాలి కోరిక ప్రకారం గుండు చేయించుకొని, తిండి మాని, అతడు ఆమె కోసం తపిస్తున్నాడు. మగాళ్ళమీద నీలో యేర్పడిన కక్ష అతడి ప్రేమ ముందు మాయమవ్వాలి" అన్నాడు డేవిడ్.

బల్లమీద నుంచి ఆమె కిందకు దూకింది. డేవిడ్ చెయ్యి పట్టుకొంది.

"రంజిత్ దగ్గరకు నన్ను తీసుకెళ్ళండి! ఒంటరిగా వెళ్ళడానికి నాకు భయంగా వుంది" అందామె.

"వెళ్దాం, పద" అన్నాడు డేవిడ్.

పడగ్గదిలోని ఫ్లోరసెంట్ లైట్లు వెల్గుతున్నాయి. తపస్సులో వున్న రంజిత్ కళ్ళు తెర్చి చూశాడు. ఎదురుగా డేవిడ్, వసంత నిలబడి వున్నారు!

"వసంతా, నువ్వేనా?" అని అతడామెను బుగ్గమీద గిల్లాడు.

ఆమె కెవ్వుమంది.

"నువ్వు నిజంగా వసంతవే! నువ్వు తిరిగివచ్చినందుకు సంతోషిస్తున్నాను" అన్నాడు రంజిత్.

ఆమె డేవిడ్ వంక చూసింది.

"అన్నయ్యా డేవిడ్ నా కళ్ళు తెర్చాడు. ఆయన మూలంగా మీరు నన్నెంతగా ప్రేమించారో నేను గుర్తించాను" అందామె.

"మైడియర్ ఫ్రెండ్, థాంక్స్" అన్నాడు రంజిత్.

ఆమె చెయ్యిని డేవిడ్ రంజిత్ చేతిలో వుంచాడు. వాళ్ళిద్దరివైపు చూశాడు.

"గాడ్ బ్లెస్ యూ!" అని డేవిడ్ కిందకు వెళ్ళిపోయాడు.

శంకరరావు అతడివైపు సూటిగా చూశాడు.

"డేవిడ్, ఏమైంది?" అడిగాడు.

"వసంత తిరిగి వచ్చింది. ఈ జీవితంలో యెన్ని బాధలనో ఎదుర్కొన్న యువతామె. ఆమెను అర్థం చేసుకోండి!" అన్నాడు డేవిడ్.

డేవిడ్ మెల్లిగా కారు దగ్గరకు నడిచాడు. అతడి వెనకనే వెళ్ళాడు శంకరరావు. డేవిడ్ కార్లో కూర్చున్నాడు.

"బాబుని రక్షించావు, డేవిడ్. నీకు నా ధన్య

వాదాలు" అన్నాడు శంకరరావు.

"రంజిత్, వసంత యిటుపైన చాలా ఆనందంగా వుంటారు" అన్నాడు డేవిడ్.

"వాళ్ళు సుఖంగా వుండడమే నాకు కావల్సింది" అన్నాడు శంకరరావు.

సైకియాట్రిస్టు డేవిడ్ తన కారును బయటకు పోనిచ్చాడు. శంకరరావు హాల్లోకి తిరిగివచ్చాడు.

"బాబూ, వసంతా పైన ఆనందంగా వున్నారే. చూసిరా" అన్నాడతను భార్యతో.

—: అయిపోయింది—

సీరియల్



## ప్రతాప రవిశంకర్

(గత సంచిక తరువాయి)

దిక్కుతోచక అరుస్తున్నారు ప్రయాణీకులంతా.... కిందికి దూసుకుపోతున్నట్టు అనిపిస్తోంది విమానం.

అరుస్తున్నారు. ఆర్తనాదాలు చేస్తున్నారు.

అందరి కళ్ళలోనూ మృత్యుభయం.

"బయటకు దూకండి. ప్రాణాలు దక్కితే దక్కుతాయి. సముద్రం మీదనించే వెళుతోంది ప్లేన్."

ఏర్ హోస్టెస్ గొంతుచించుకొని అరుస్తోంది.

ఎవరో ఎంట్రెన్స్ డోర్ ఓపెన్ చేశారు.

ఒక్కసారిగా గాలి లోపలకు దూసుకువచ్చింది. మంటలు మరింత ఎత్తుకు పైకిలేచాయి.

కొంతమందిలో చావు తెగింపు వచ్చింది.

అంతే.

క్షణాల్లో బయటకు దూకేశారు—చీకట్లోకి కొంత

వరకూ మంటల వెలుగు పడుతోంది.

"ఓ గాడ్ .... సేవ్ మీ .... సేవ్ మీ ...."

ముసలాయన అరుస్తున్నాడు.

ఆయన ఎక్కడ వున్నాడో ఎవ్వరికీ తెలీదు.

కొంతమంది భయంతో స్పృహ తప్పిపోయారు.

"స్టెల్లా" అరుస్తున్నాడు భారత్ ....

ఎక్కడినుంచో "భారత్" అంటోంది స్టెల్లా.

విమానం దొంగల్లో ఒకడు చచ్చిపోయాడు. అందాల సుందరి తర్వాత. మిగిలిన ముగ్గురు యెలా వున్నారో తెలీదు.

నాలుకలు చాచుకుని పైకి లేస్తున్నాయి మంటలు. మండిపోతోంది విమానం.

"భారత్ ....బయటకు దూకెయ్. మంటలు లోపలకు వస్తున్నాయ్.... నేనూ దూకుతాను. నన్ను పట్టుకో.... ఇద్దరం ఒకేసారి దూకుదాం."

స్టెల్లా దగ్గరనించే అరుస్తున్నట్టు అనిపించింది.

"వద్దు....స్టెల్లా మనం బతకటం అసాధ్యం....సముద్రంలో దూకినా మనకు చావు తప్పదు. మన జీవితాలు ఈ ఆకాశంలోనే అంతమవుతాయి. ఇది కెరోన్ పెట్టిన శాపం."

అరిచాడు భారత్ లోపలకు దూసుకుని వచ్చి కొండ చిలువలా చుట్టుకుంటున్న ఆ గాలి హోరులో....

"డర్టీ కెరోన్, యూ ఆర్ ఎ సెంటిమెంటల్ ఫూల్! ఉయ్ మస్టు సేవ్ అవర్ లైవ్స్.... నాకు ఈత వొచ్చు. సముద్రంలో దూకితే నిన్ను నేను రక్షిస్తాను. క్విక్ .... జంప్ ...."

అలా అంటూనే మనుషులను నెట్టుకుంటూ వచ్చి

భారత్ చేతిని పట్టుకుంది స్టెల్లా.

"వద్దు.... నేను దూకను....ఇంకో క్షణంలో ఈ ప్లేన్ సముద్రంలోనే కూలిపోతుంది."

"భారత్ మూర్ఖంగా మాట్లాడకు...ఈ ప్లేన్ సముద్రంలో కూలిపోతుందో గాల్లోనే పేలిపోతుందో మనకు తెలీదు. నా మాట విను. క్విక్....ఇదంతా ఈ ఇడియట్స్ ప్లేన్ రాబర్స్ వల్లనే జరిగింది....ఇంకో ముగ్గురు వెధవలు బయటకు దూకినట్టున్నారు. దొరికితే షూట్ చేసేదాన్ని" అన్నది.

సెకన్లు గడిచాయి.

లోపలకు దూసుకు వస్తున్న చల్లటి గాలి కత్తిలా కోస్తూ బయటకు ఈడ్చుకు వెళుతోంది గొలుసులు వేసి బలవంతంగా లాకెళుతున్నట్టు.

హాహాకారాలు చెలరేగుతున్నాయి.

బయటకు దూకే ధైర్యంలేనివాళ్ళు దేవుడ్ని ప్రార్థిస్తూ లోపలే వూగిపోతూ అరుస్తున్నారు.

మృత్యుభయంతో కేకలు పెడుతున్నారు.

ఇంకొక్క క్షణం....

సర్రున దూసుకుపోయింది ప్లేన్ బాణంలా.

సెకన్లలో పెద్ద శబ్దంతో కూలిపోయింది.

* * *

స్టెల్లా చిన్నగా అటూ ఇటూ కదిలింది. కదిలింది కాని ఆమె స్పృహలోకి వచ్చి కదల్లేదు. కొంచెంసేపటి తర్వాత స్పృహలోకి వచ్చి కళ్ళు తెరిచేందుకు ప్రయత్నించింది.

కళ్ళు తెరిచి వెంటనే మళ్ళీ మూసుకున్నది. ఆమె కళ్ళలోకి సూదులతో గుచ్చుతున్నట్టుగా సూర్యుడి కిర

ణాలు పడుతున్నాయి. అందుకే కళ్ళు తెరవలేక పోయింది.

అప్పుడే ఆమెకు అంతా ఒక్కసారిగా గుర్తుకువచ్చి అంతులేని ఆశ్చర్యానికి లోనయ్యింది.

జరిగిపోయినదంతా మెదడులో గిర్రున తిరిగింది.

తను ఇంకా బతికే వున్నదా?

ఇదెలా సాధ్యం?

అప్పుడు చటుక్కున లేచి కూర్చుని కళ్ళు తెరిచింది.

ఎదురుగా అంతా ఇసుక. ఇసుకలో అక్కడక్కడ దగ్గరగానే పెరిగిన అంతగా ఎత్తులేని ముళ్ళ పొదలు. వాటి మధ్యలో భూమిలోనించి పొడుచుకు వచ్చినట్టున్న పెద్ద పెద్ద చెట్లు.

ఆశ్చర్యం కలిగింది స్టెల్లాకు. అయితే తను ఇంకా ప్రాణాలతో వున్నదా?

అవును. సందేహంలేదు.

ఒళ్ళంతా సన్నని ముళ్ళు గీరుకుపోయి మంటగా వున్నది.

తలతిప్పి పక్కకు చూసేసరికి సగం పైగా కాలి పోయిన విమానం ఓ పెద్ద పొదలోకి దూసుకుపోయి కన పడింది.

అప్పుడు స్టెల్లాకు చప్పున భారత్ గుర్తుకు వచ్చాడు.

అవును. భారత్ యేడీ?

ఏమిటి?

ఎవ్వరూ కనపడరేం??

ఒక్కసారి స్టెల్లాకు విమానం కూలిపోవటానికి ముందు సంఘటనలన్నీ నెమరుకు వచ్చాయి.

ప్లేన్ కూలిపోతున్నప్పుడు ఎర్రగా పైకి లేచిన వికృతంగా వున్న మంటలు.... అంతా చావు భయంతో చేసిన హాహాకారాలు ఆమెకు తిరిగి కనిపించాయి—వినిపించాయి.

ఐతే—మిగిలిన వారంతా మరణించారా?

మంటల్లో పడి మాడిపోయారా?

చివరకు తన భారత్ కూడా....

సెల్లా ఉలిక్కిపడింది. చివాలున లేచి నిలబడింది. ఆమె శరీరానికి అంటుకునివున్న ఇసుక లేచినిలబడటంతో కిందికి రాలింది.

వెచ్చటి గాలి విసురుగా వీస్తోంది.

దూరంగా ఎక్కడో వుంది పెద్ద చెట్టు.... ఎండ కాల్చేస్తున్నట్టుగా వుంది.

రెండడుగులు వెనక్కి వేసింది.

ఆమె గుండె ఒక్కసారి వేగంగా కొట్టుకుంది. భారత్ బోర్లాపడి వున్నాడు ఇసుకలో. అతని తలనిండా ఇసుక కొట్టుకుని వుంది. కొంచెం దూరంలో అతని సూట్కేసు కూడా వుంది.

వేగంగా అతని దగ్గరకు వెళ్ళి మోకాళ్ళమీద వంగి కూర్చుని అతని వీపుమీద చెయ్యి వేసింది.

"భారత్ .... భారత్!"

అతను పలకలేదు.

బతికే వున్నాడా? అనుమానం వచ్చింది.

పరిశీలనగా చూసింది. అతడి వీపు కదులుతోంది చిన్నగా.

మైగాడ్ ....ఫర్వాలేదు.

అతడి భుజంమీద రెండు చేతులతో కదుపుతూ

"భారత్" అని మళ్ళీ పిల్చింది.

విసురుగా వీస్తోన్న గాలికి ఇసుకఎగిరి వచ్చి ఆమె కళ్ళల్లో పడుతోంది.

కళ్ళు చిట్లించి అతడినే చూస్తూ మరి కొన్నిసార్లు పిల్చింది.

కొంచెంసేపటి తర్వాత ఆమె ప్రయత్నం ఫలించింది. భారత్ చిన్నగా కదిలి మరో నిమిషం తర్వాత కళ్ళు తెరిచాడు.

ఎదురుగా స్టెల్లా కనపడగానే గుర్తు పట్టనట్టుగా చూశాడు.

"భారత్ .... నేను స్టెల్లాని."

కొన్ని నిముషాల తర్వాత భారత్ ఈ లోకంలోకి వచ్చాడు.

నెమ్మదిగా లేచి కూర్చుని "స్టెల్లా! మనం బతికే వున్నామా?" అనడిగాడు.

స్టెల్లా నవ్వి "నాకూ మొదట్లో యిలాంటి సందేహమే వచ్చింది. కాని మనం నిజంగానే బతికివున్నాం. అందుకు నిదర్శనం...." అంటూ చటుక్కున అతనిమీదకు వంగి భారత్ పెదవులమీద ముద్దు పెట్టుకుంది.

ఊహించని ఆ చర్యకు అతను ఉక్కిరి బిక్కిరయ్యాడు.

తర్వాత "నిజమే. మనం బతికే వున్నాం? కాని నాకంతా ఆశ్చర్యంగా వుంది. మన ప్లేన్ సముద్రంలో కూలిపోలేదా?" అన్నాడు.

"లేదు. ఈ దీవిలో కూలిపోయింది. అలా జరగడం వల్లనే మనం బతికి బయటపడ్డాం."

"ఐనా ప్లేన్ కాలిపోకుండా వుందా?"

"కాలిపోలేదు. మూసుకురావటంతో ఈ పక్కనే వున్న పెద్ద పొదలోకి మూసుకుని పోయింది."

ఇద్దరూ లేచి నిలబడ్డారు.

భారత్ తన సూట్కేసు అక్కడే పడివున్నందుకు సంతోషపడ్డాడు.

"శ్వేతా! నిజంగా నేనింతో భయపడిపోయాను. ఎందుకంటావా కిరోన్ శాపం నిజమవుతుందని-కాని కాలేదు. మనం ప్రాణాలతోనే వున్నాం. లక్షలు విలువచేసే వజ్రాలు కూడా మన దగ్గరే వున్నాయి. ఇక మనం అసలు ఈ దీవి యేమిటో, ఇక్కడినించి బయటపడటం ఎలాగో ఆలోచించాలి" అన్నాడు భారత్.

"అవును. ఇదిగో ప్లేన్. చాలావరకు కాలిపోయింది. కాని పూర్తిగా యెందుకు కాలిపోలేదో నాకు తెలీటం లేదు" శ్వేతా అంది. అతడి పక్కగా అడుగులు వేస్తూ—

ఒక్క నిముషం ఆగిపోయాడు భారత్.

ఇసుకను కాలితో తవ్వాడు. అడుగున ఇసుక తడిగా వుంది.

అతను నవ్వి "ప్లేన్ పూర్తిగా ఎందుకు కాలిపోలేదో ఇప్పుడు అర్ధమయ్యింది. ప్లేన్ కూలిపోయే సమయానికే యీ దీవిలో పెద్ద వర్షం మొదలయి వుంటుంది" అన్నాడు.

"అవును. అందుకే మన బట్టలనిండా, వంటినిండా బాగా ఇసుక కొట్టుకుపోయింది."

"ఇంతికీ ఈ ప్రమాదంనించి మనిద్దరమే నా ప్రాణాలతో బయటపడింది?"

"కాకపోవచ్చు. ఇంకా చుట్టూవున్న ఆ పొదల్లో

వెతకాలి. మనలాగే యెవరైనా బయటపడివుండవచ్చు. ప్లేన్ కూలిపోయేటప్పుడు ఇంకొంతమంది అందులో వున్నారు కదా!"

"పద. అలా చూద్దాం...."

సూట్కేసుసు ఎడమచేతిలోకి మార్చుకుంటూ ముందుకు కదిలాడు భారత్.

పొదలో వాళ్ళ వెనకవైపు యేదో అలికిడయ్యింది. ఐతే ముందు నడుస్తున్న యిద్దరూ అలికిడిని గమనించలేక పోయారు.

* * *

"మర్యాదగా చేతులెత్తండి."

ఉలిక్కిపడ్డారిద్దరూ.

చేతులెత్తడం కానే వెనక్కి తిరగబోయారు.

"వద్దు. ప్రమాదం.... చేతులెత్తిన తర్వాతనే ఎదురుగా తిరగండి."

మళ్ళీ వినపడింది ఆ హెచ్చరిక.

నిజంగా ఆశ్చర్యం!

ఎవరు?

ఆ మనిషి ఎవరు?

ప్లేక్ లోనించి బయటపడిన మనిషేనా?

అయితే ఇప్పటివరకూ ఎక్కడ వున్నాడు?

తమకంటే ముందుగానే స్పృహలోకి వచ్చాడా? ఐతే ఎందుకు బయటపడలేదు.

"ఏమిటి ఆలస్యం? నా చేతిలో పిస్తోలు వుంది. క్షణం ఆలస్యమైతే పేలుతుంది."

ఆ కంఠస్వరం ఇంతకు ముందు ఎక్కడో విన్నట్టుగా అనిపించింది ఇద్దరికీ. ఎక్కడ విన్నారు?

ఇలా అనుకుంటూ చేతులెత్తి వెనక్కి తిరిగి ఒకేసారి ఎంతో ఆశ్చర్యపడ్డారు.

ఎదురుగా షాంకీల్ నిలబడి వున్నాడు. అతని చేతిలో పిస్తోలు వాళ్ళకే గురిపెట్టబడి వుంది. అతను బతికి వుంటాడని వాళ్ళు ఏమాత్రం వూహించనే లేదు.

వికృతంగా నవ్వాడు షాంకీల్.

నవ్వు ఆపి ఒక్క నిముషం "ఆశ్చర్యంగా వుందా?? ఈ షాంకీల్ మృత్యుంజయుడు. మీ ఇద్దరూ మీ దగ్గర వున్న లక్షలు విలువ చేసే వజ్రాల గురించి మాట్లాడుకోవటం పొదలో మీకు కొంచెం దూరంలో పడివున్న నేను స్పృహ వచ్చి విన్నాను. ముందు మీ దగ్గరవున్న ఆ సూట్కేసును ఇలా పడెయ్యండి" అన్నాడు పిస్తోలును తొణక్కుండా పట్టుకుని.

భారత్ తలతిప్పి స్టెల్లాకేసి చూశాడు.

స్టెల్లా చూపులు నిశ్చలంగా వున్నాయి యెదురుగా వున్న షాంకీల్ మీద—అతని చేతిలో వున్న పిస్తోలు మీద.

ఎదురుచూడని ప్రమాదం.

షాంకీల్ ఇలా శనిలా మళ్ళీ తగులుతాడని అనుకోలేదు.

ఇప్పుడేమిటి చెయ్యటం?

ఇవ్వకపోతే జరిగేదేమిటి? స్టెల్లా ఏ మాలోచిస్తోంది. మళ్ళీ అదే టెన్షన్.

గాలి తీవ్రంగా వీస్తోంది.

క్షణాలు....నిముషాలు....

అసహనంగా వుంది.

సూట్కేసు భారత్ కాళ్ళదగ్గరే వున్నది.

షాంకీల్ ఇంకోసారి నవ్వాడు.

"సరే.... నేనే అక్కడికి వస్తాను. వీరు నిరాయుధులు. నా చేతిలో పిస్తోలు వుంది" అంటూ ఒక్కొక్క అడుగే ముందుకు వేస్తూ కొంచెం దగ్గరగా వచ్చాడు.

స్టెల్లా వూపిరి బిగబట్టి ఆలోచిస్తోంది.

షాంకీల్ చేతిలో పిస్తోలు ఆకలిగా చూస్తోంది.

రెండడుగుల దూరంలోకివచ్చి "సూట్కేసు ముందుకు నెట్టండి" అన్నాడు.

"భారత్! ఈ వజ్రాల గురించి ప్రాణాలు పోగొట్టుకోవటం నా కిష్టం లేదు. సూట్కేసును నే నిస్తాను" అన్నది స్టెల్లా.

తల వూపాడు భారత్.

స్టెల్లా అలా అనడంలో యేదో మర్మం వుందని అతని నమ్మకం.

సూట్కేసు తియ్యటానికన్నట్టు ముందుకు వంగింది స్టెల్లా. పూర్తిగా వంగలేదు. వంగుతూనే బాణంలా ముందుకు దూసుకుపోయింది.

తలతో షాంకీల్ గుండెలమీద గట్టిగా కుమ్మింది.

కెవ్వున అరిచాడతను బాధతో.

చేతిలో పిస్తోలు ధామ్మని పేలింది. అతను యెగిరి వెనక్కు పడుతున్నప్పుడు. ఆ చప్పుడుకు దూరంగా వున్న చెట్టుమీది పక్షులు గోలగా అరుస్తూ పైకి లేచాయి.

క్రిందపడిన షాంకీల్ ను స్టెల్లా లేవనివ్వలేదు. కాలితో అతడి మొహంమీద శక్తికొద్దీ తన్నింది.

షాంకీల్ రెండు పళ్ళు విరిగాయి.

ఆ పోరాటంలో భారత్ కలిగించుకోలేదు. స్టెల్లా శక్తి సామర్థ్యాలు అతనికి బాగా తెలుసు. షాంకీల్

లాంటి నలుగురు మనుషులను ఐదు నిముషాల్లో చిత్తు చేయగలదు.

షాంకీల్ లేవటానికి ప్రయత్నం చేస్తున్నాడు. కాని సెల్లా అతనికి అవకాశం యివ్వకుండా అతన్ని బంతిలా దొర్లిస్తోంది.

ఐదు నిముషాల్లో షాంకీల్ ఇక కదల్లేని స్థితికి వచ్చేశాడు.

"భారత్ ....ఇప్పుడు ఈ వెధవ మనకు బంది...." అంటూ పక్కనే పొదలో వున్న చెట్టుతీగలను తెంపి వాటితో షాంకీల్ చేతులు వెనక్కు విరిచి కట్టేసింది.

అక్కడికి కొంచెం దూరంలో పడిన అతని రివాల్వర్‌ను తీసి భారత్‌కు యిచ్చింది. షాంకీల్‌ను లేవదీసి నిలబెట్టింది.

* * *

ముగ్గురూ నడక మొదలుపెట్టారు.

వాళ్ళకు అతి సమీపంలోనే ఓ పొద కనపడింది.

ఆ పొద పక్కనే పడివున్న మనుషులను చూడగానే వాళ్ళకు ఆశ్చర్యం, సంతోషం కలిగాయి.

"ఓ గాడ్ ....మనకు తోడుగా మరికొంతమంది మనుషులు కూడా బతికే వున్నారు" అన్నది సెల్లా వాళ్ళ దగ్గరకు పరుగెత్తి.

మొత్తం పన్నెండుమంది. అందులో ముగ్గురు స్త్రీలు-ఓ ముసలాయన కూడా వున్నాడు.

సెల్లా—భారత్ ఇద్దరూ ఓ పావుగంట సేపు శ్రమపడి అందరికీ స్పృహ తెప్పించారు.

ఒకరినొకరు చూసుకుని అంతా ప్రాణాలతో వున్నందుకు సంతోషపడ్డారు వాళ్ళంతా.

వాళ్ళకు స్పృహ వస్తుంటే పాంకీల్‌కు ప్రాణాలు పోతున్నంత భయమేసింది. వాళ్ళంతా లేస్తే తనని బతకనిస్తారా?

అతని భయం నిజమే అయ్యింది.

ఆశ్చర్యం నించి తేరుకున్నాక వాళ్ళు పాంకీల్‌ను గమనించారు. అప్పటివరకు అతను పాద పక్కగా నక్కి నిలబడ్డాడు.

ముందుగా ఓ నలభై యేళ్ళ మనిషి పాంకీల్‌ను చూసి "యూ ఇడియట్....నువ్వింకా బతికే వున్నావా?" అన్నాడు.

అప్పుడే మిగిలిన వాళ్ళంతా అతన్ని చూశారు.

సెలా కలిగించుకొని అన్నది "బతికివుండటమే కాదు. పిస్టల్‌తో మా యిద్దరినీ వెనుక నుంచి బెదిరించాడు చంపుతానని....యెలాగో వాడ్ని దెబ్బతీసి బంధించాము."

"అసలు ఈ ప్లేన్ రాబర్స్ వల్లనే మనం యిన్ని కష్టాలు పడవలసి వచ్చింది. ఈ రోగ్‌ను బతకనివ్వకూడదు" అన్నాడు ముసలాయన.

అంతే. అంతా ఒక్కసారిగా ముందుకు నూకారు.

"వద్దు. నన్ను చంపొద్దు ... నేనూ మీలాంటి మనిషినే....ప్లీజ్! చంపొద్దు."

వెనక్కి నడుస్తూ ప్రాధేయపడ్డాడు.

వాళ్ళు వినలేదు.

వాళ్ళ ఉద్రేకం తారస్థాయిలో వుంది.

పిస్టళ్ళతో బెదిరించి నిర్దాక్షిణ్యంగా తమ దగ్గర వున్న విలువైన వస్తువుల నన్నింటినీ వల్చుకున్న మనిషి యిప్పుడు నిస్సహాయంగా ఒంటరిగా తమ యెదురుగానే

వున్నాడు.

అలాంటి మనిషిని ప్రాణాలతో వదిలెయ్యటమా?

సాధ్యమేనా?

స్త్రీలుకూడా షాంకీల్ అంటు చూడటానికి ముందుకు వూగారు.

షాంకీల్ భయంతో వణికిపోయాడు. ఆ భయంతో అతని కళ్ళకు మేకులు కొట్టినట్టుగా అక్కడినించి కదలేకపోయాడు.

ఒక్కసారిగా అందరూ అతనిమీద పడేసరికి కెవ్వుమన్నాడు. తర్వాత "వద్దు....వద్దు....నన్ను చంపొద్దు... దయతో వదలండి....ప్లీజ్....సేవ్ మీ" దీనంగా అరిచాడు.

అతన్ని చేతికందినట్టుగా కొడుతున్నారు వాళ్ళు.

సెల్లా—భారత్ ఒకరినొకరు చూసుకున్నారు.

"నాకు జాలిగా వుంది. ఇంతమంది మధ్య ఒక్కడు. ఎముకలుకూడా మిగలవు" అన్నాడు భారత్.

"ఆపండి" అరిచింది సెల్లా.

ఒక్కసారి అంతా ఆగిపోయి షాంకీల్‌ను వదిలారు.

"డియర్ ఫ్రెండ్స్....ఈ వెధవను చంపినందువల్ల ఇప్పుడు మనకు ప్రయోజనం ఏమీ లేదు. కేవలం కసి తీరుతుంది. అంతేకదా! అలా కాకుండా ఇతన్ని ప్రాణాలతో వుంచినందువల్ల మనకు ఒక ఉపయోగం వుంది. మనందరికీ ఈ షాంకీల్ సేవకుడుగా ఉపయోగపడతాడు. ఈ దోపిడీ దొంగకు ఇదే తగిన శిక్ష. ఇందుకు మీరేమంటారు?"

వాళ్ళు కొంచెంసేపు ఒకరినొకరు చూసుకున్నారు. సెల్లా ఆలోచన వాళ్ళకు నచ్చినట్టుంది.

అందుకే "నీ యిష్టం" అన్నారు.

"థాంక్ యూ. ఇక ఈ ఒప్పందానికి షాంకీల్ ఒప్పుకుంటాడో లేదో తెలియజెయ్యాలి. ఇందులో బలవంతం ఏదీ లేదు. ఒక వేళ మనందరికీ అతడు సేవకుడుగా వుండటాని ఒప్పుకోని పక్షంలో అతను మనకు చేసిన ద్రోహానికి ఈ క్షణంలోనే అందరం కలిసి చంపేస్తాం."

"వద్దు....మీ షరతుకు నేను ఒప్పుకుంటున్నాను. నేను మీ బానిసను. నన్ను మీరు ఎలాంటి పనులకైనా ఉపయోగించుకోవచ్చు. దయచేసి నన్ను ప్రాణాలతో వుంచండి" అన్నాడు.

"గుడ్. ఇక నీ ప్రాణాలకు ఎలాంటి భయంలేదు మావల్ల. కాని నువ్వు దొంగవి. నీలో దొంగబుద్ధి అంత సులభంగా పోదు. మేమందరం ఏమరుపాటుగా వున్న సమయంలో మమ్మల్ని దెబ్బతీసి మా వస్తువులను తీసుకుని పారిపోయే ప్రయత్నంచేస్తే నువ్వు ఎక్కడ దాగినా నిన్ను వేటాడి చంపి ఇక్కడే సమాధి చేస్తాను" అన్నది స్టెల్లా.

"అంత మాటలు వద్దు. నన్ను నమ్మండి. ఈ కట్లు తీసెయ్యండి. చేతులు వొరుసుకుపోయి మండుతున్నాయి" అన్నాడు బాధగా.

షాంకీల్ గొంతుకూడా మారిపోయింది బాధతో.

నవ్వుతూ స్టెల్లా అతని వెనక్కు వెళ్ళి తీగకట్లు వూడదీసింది.

వెంటనే రెండు చేతులనూ ముందుకు తెప్పించి ఆప్యాయంగా చూసుకుంటూ "థాంక్ యూ" అన్నాడు షాంకీల్.

తర్వాత జేబులోనించి కర్చీఫ్ బయటకుతీసి నోటికి అంటిన రక్తాన్ని తుడుచుకున్నాడు.

మళ్ళీ అంతా విమానం కూలిపోయిన పొద దగ్గరకు నడిచారు. కొంచెమే బయటకు అగుపడుతోంది ప్లేన్.

దానికి దగ్గర్లో, పొదలో కొన్ని లగేజీలు దొరికాయి వాళ్ళకు. ఎవరికి దొరికినవి వాళ్ళు తీసుకున్నారు.

ఇక అక్కడ విలువైనవేమీ లేవని నిర్ధారణ చేసుకున్న తర్వాత ఇవతలికి వచ్చారు.

అప్పుడు తెలిసింది అందరికీ ఆకలిగురించి.

* * *

"ఎవరి దగ్గరైనా ఏదైనా ఫుడ్ వుందా?" అడిగింది స్టెల్లా.

అంతా లేదన్నారు.

ఓ. స్త్రీ తన దగ్గర వున్న బ్యాగ్ తీసి అందులోనించి రెండు బిస్కెట్ ప్యాకెట్లు బయటకు తీసింది. నిజానికి ఆ రెండూ ఒక్క మనిషికి కూడా సరిపోవు. అంతమందికి ఎలా సరిపోతాయి.

అప్పటికే ముందుకు అడుగు వేసే శక్తికూడా లేకుండా వున్న ముసలాయనకు ఆ రెండు ప్యాకెట్లనూ ఇచ్చేసింది స్టెల్లా.

గబగబా వాటిని తినేశాడాయన.

"దాహంగా వుంది నీళ్ళు" అన్నాడు.

అక్కడ నీళ్ళు వున్న జాడ లేవీ కనిపించలేదు.

"ఇక్కడ ఎండ మాడుస్తోంది. ముందు మనం ఆ చెట్టుకిందికి వెళ్ళి నిలబడదాం" అన్నాడు భారత్.

ఓ ఇద్దరి లగేజీలను పాంకీల్ పట్టుకున్నాడు.

అంతా నీరసంగా నడిచి ఆ పెద్ద చెట్టు కిందకు వెళ్ళారు. చాలా ఎత్తుగా వుంది ఆ చెట్టు. వెడల్పుగా వున్నాయి ఆకులు. కాని దానికి ఒక్క కాయకూడా

కనపడలేదు.

అక్కడ వున్న యెవ్వరూ ఇంతకుముందు అలాంటి చెట్టును చూడలేదు.

గాలికి విసురుగా కదులుతూ చిత్రమైన ధ్వనిని పుట్టిస్తోంది.

"ముందు మనకు ఆహారం కావాలి. తర్వాత నీళ్ళు కావాలి. ఈ రెండూ దొరికిన తర్వాత మనం ఈ దీవి నించి బయటపడే మార్గంకోసం ప్రయత్నం చెయ్యాలి. ఈ దీవి పేరేమిటో మనకు తెలీదు. ఇది ఏ ప్రాంతంలో వుందో మనకు తెలీదు. ఇక్కడ మనకు ఎలాంటి ప్రమాదాలు ఎదురవుతాయో మనకు తెలీదు. అందువల్ల మనం అనుక్షణం ఎంతో జాగ్రత్తగా వుండాలి."

భారత్ అందరినీ హెచ్చరించాడు.

సరేనన్నట్టు తలలు వూపారు.

ముగ్గురు స్త్రీలు భయంగా ఒకరినొకరు చూసుకున్నారు.

అందులో ఒకామె "నా చెల్లికి ఆరోగ్యం సరిగా లేదని తెలిసి చూట్టానికి బయల్దేరాను. ఇప్పుడామెకు ఎలా వుందో? నాకోసం ఎదురుచూస్తూ వుంటుంది. కాని నేను ఈ దీవిలో ఇలా" ఆ తర్వాత ఆమెకు దుఃఖం ముంచుకు వచ్చింది.

"ప్లీజ్, డోంట్ క్రయ్....ఏడ్వకండి. ఏడుపు మనుషులను బలహీనపరుస్తుంది. ఇందుక్కారణం ఎవరయినా మనం పరిస్థితులను నిందిస్తూ బాధపడినందువల్ల ప్రయోజనంలేదు. జరగవలసిందేమిటో చూడాలి. ఇప్పుడు మనం ఆహారంకోసం వేట మొదలుపెట్టాలి. ఆకలితీరిన తర్వాత మిగిలిన కార్యక్రమం గురించి ఆలోచిద్దాం."

ఇలా అని ముందుగానే తనే అక్కడినించి కదిలింది ట్సెల్లా.

మిగిలినవాళ్ళు ఆమెను అనుసరించారు.

వెచ్చని గాలి రివ్వుమని వీస్తూ వాళ్ళని బాధిస్తోంది. దానికి తోడుగా పైన ఎండవేడి, పెద్ద పెద్ద చెట్లు ఎక్కడో దూరంగా వున్నాయి.

దగ్గరగా వున్నవి అన్నీ పొదలే.

నడుస్తూనే అంతా ఆ పొదల్లోకి ఆత్రంగా చూస్తున్నారు. ఏవైనా చిన్న చిన్న జంతువులు దొరుకుతాయోమోనని.

అక్కడ దారి వున్నట్టుగా లేదు. మనుషుల అడుగు జాడలు ఇసుకలో ఎక్కడా కనపడటంలేదు. ఆ రాత్రి వర్షం కురియటంవల్ల తర్వాత ఎవరైనా ఆ ప్రాంతంలో నడిచే వాళ్ళ అడుగుల ముద్రలు స్పష్టంగానే కనపడేవి. కాని గాలికి పైకి తెరలు తెరలుగా లేస్తున్న ఇసుక ఆ అడుగుజాడలను చెరిపేసి వుండొచ్చు.

ట్సెల్లా—భారత్‌ల వెనుక పాంకీల్ నడుస్తున్నాడు. అతడి మనసులో ఎలాంటి ఆలోచనలు వున్నాయో ఎవరికీ తెలీదు. కాని పైకి మాత్రం ఎంతో వినయంగా కనపడుతున్నాడు.

భారత్—ట్సెల్లాతో మాట్లాడుతూ నడుస్తున్నాడు.

ట్సెల్లా అతడి మాటలు వింటూనే ఓ కంట పాంకీల్‌ను కనిపెడుతోంది. దోపిడీ దొంగల్లో అంత సులభంగా మార్పురాదని ఆమె నమ్మకం.

వెనుక నడుస్తున్న మనుషులంతా వాళ్ళకు వచ్చిన కష్టం గురించి మాట్లాడుకుంటూ బాధపడుతున్నారు. ఒకరి కష్టసుఖాల గురించి మరొకరు చెప్పుకుంటున్నారు.

ఉన్నట్టుండి పక్కన ఎక్కడో తిరుగుతున్న చిన్న కుందేలు పరిగెత్తుకుంటూ వచ్చి అక్కడే వున్న చిన్న పొదలో దూరి అదృశ్యమయ్యింది.

దాన్ని పాంకీల్ చూడనే చూశాడు.

పొద దగ్గరకు వెళ్ళాడు.

అంతా అక్కడే ఆగిపోయారు.

"అది నీకు దొరుకుతుందా?" స్టెలా—పాంకీల్‌ను అడిగింది.

"మీకే తెలుస్తుంది. పాంకీల్—కుందేళ్ళను పట్టుకోవటంలో ఆరితేరినవాడు" అంటూ చేతుల్లో వున్న లగేజిని కిందపెట్టి చిన్న చిన్న ముక్కలను పక్కకు తీసుకుంటూ పొదలో దూరాడు. అతడి సూచనల ప్రకారం వాళ్ళంతా ఆ పొదచుట్టూ చేరారు.

పాంకీల్ నోటితో చిత్రమైన శబ్దాలు చేశాడు. పది నిమిషాల తర్వాత కుందేలు చెవులు పట్టుకుని విజయగర్వంతో ఆ పొదలోనించి బయటకు వచ్చాడు.

అప్పటికప్పుడే ఎండిన పుల్లల్ని చేర్చి మంటచేసి ఆ కుందేలును మంటలో కాల్చారు. దాని మాంసాన్ని అంతా కొంచెం కొంచెంగా తినేశారు.

భలే రుచిగావుంది. కాని ఎవ్వరికీ ఆకలి తీరలేదు. నీళ్లు మాత్రం అక్కడ దొరకలేదు.

* * *

మళ్ళీ ఆహారంకోసం అన్వేషణ మొదలయింది. ఆశ్చర్యమేమిటంటే ఆ దీవిలో పండ్లున్న చెట్లు అప్పటి వరకూ వాళ్ళకు కనపడలేదు.

అన్నీ ఒకేరకం చెట్లు. ఆకులు వెడల్పుగా వున్న ఎత్తుగా పెరిగిన చెట్లు.

కొంచెం దూరం నడిచేసరికి ఆ ఎండలో వాళ్లు అలసి పోయారు. ఒక్కొక్కళ్ళు నీరసంగా అడుగులు వేస్తున్నారు.

వాళ్ళందరికీ భయమేసింది. ఆ దీవిలో అసలు ఆహారమే దొరకవా?

ఆహారం దొరక్క అలమటించి పోవలసిందేనా?

నాలుగు గంటలు కావస్తోంది.

అప్పుడే ఎండ వేడి క్రమంగా తగ్గుతున్నది.

ఒకరితో ఒకరు మాట్లాడుకోవటం ఆపేశారు. మాట్లాడుకుంటుంటే శక్తి నశిస్తోంది.

పాంకీల్ కు బాగా ఆకలివేస్తోంది. రెండు చేతుల్లో వున్న సూట్కేసులను మొయ్యలేకపోతున్నాడు. ఐనా తప్పదు మొయ్యక.

అక్కడినించి ఆ దీవి స్వరూపం మారిపోయినట్టు గ్రహించారు వాళ్ళు. అక్కడితో చిన్న పొదలు, ఎత్తుగా పెరిగే వెడల్పాటి ఆకులున్న చెట్లు అంతమయి పోయాయి.

ఇసుకలో తేమకూడా ఎక్కువగానే కనిపించింది అక్కడ. అక్కడినించి కొంచెం ఎత్తులో వున్న సన్నని ఆకులున్న చెట్లు దగ్గర దగ్గరగానే కనిపించాయి.

చెట్ల కిందనించి నడుస్తూంటే నీడగా వుంది.

ఆ చెట్లమధ్యగా కొంచెం ఎత్తుగా పెరిగిన ఓ చెట్టును ముందుగా నెల్లా చూసింది. తర్వాత భారత్ — పాంకీల్ చూశారు.

ఇది మామిడి చెట్టులా వుంది—అనుకున్నాడు భారత్.

దానికి పైన ఎక్కడో గుత్తులు గుత్తులుగా ఎర్రగా పండిన పండ్లు కనిపించాయి. బహుశ ఆ పండ్లనుంచే నేమో

తియ్యని వాసన వస్తోంది.

అందరి దృష్టి ఆ చెట్టుమీద—పండ్లమీద పడింది.

వాళ్ళందరి ముఖాంలో సంతోషం కదలాడింది.

"మై గాడ్ ....ఎన్ని పండ్లో ఈ దెబ్బతో మనందరి ఆకలి క్షణంలో తీరిపోతుంది" అన్నది సైల్లా.

"అవును. మన శ్రమ ఫలించింది. ఇక్కడినించి అన్నీ పండ్ల చెట్లే అనుకుంటూను. మనం ఆహారం గురించి దిగులు పడాల్సిన అవసరంలేదు. కావలసినన్ని పండ్లు. ఈ దీవి నించి బయటపడేవరకు మనం ఈ పండ్లు తినే ప్రాణాలు నిలుపుకోవచ్చు."

భారత్ అన్నాడు చేతిలో వున్న సూట్కేసు కింద పెట్టి.

అంతా ఎవరి చేతుల్లో వున్న బరువులను వాళ్ళు కింద పెట్టి తలలు పైకెత్తి చెట్టున వున్న పండ్లకేసి ఆశగా చూశారు.

అప్పటికే షాంకీల్ చెట్టును ఎక్కే ప్రయత్నంలో వుండిపోయాడు. అలవాటులేని కారణంగానేమో పైకి ఎక్కటానికి కొంచెం శ్రమపడవలసి వచ్చింది.

"షాంకీల్ .... ఆలస్యం చెయ్యకు. ముందు చేతికి అందుబాటులో వున్న పండ్లని కోసి కిందపడెయ్యి" అన్నది సైల్లా.

పైనుంచి తల వూపాడు.

అతనికి దగ్గర్లో బాగా లావుగా వుండి ఎర్రగా పండి పోయిన పండు ఒక్కటే కనిపించింది. దాన్ని చూడ టంతోనే షాంకీల్ ఆకలి వున్నట్టుండి రెట్టింపుగా పెరిగి నట్లనిపించింది. ముందుగా తను గబగబా ఆ పండును తిని మిగిలిన పండ్లను కొయ్యాలనుకున్నాడు.

ఆ పండును తెంచాడు. మెత్తగా వుంది.

"షాంకీల్.... దాన్ని కింద పడెయ్యి" భారత్ అన్నాడు.

"సారీ....ముందు ఈ పండును నేను తింటాను. నేను ఈ ఆకలిని భరించలేకుండా వున్నాను" అంటూ ఆ పండును కొరికి తిన్నాడు.

వెంటనే దాన్ని దూరంగా విసిరేశాడు "ఛీ" అంటూ.

అతడి చర్య కింద వున్న వాళ్ళకు అర్థంకాలేదు. ఆశ్చర్యం అనిపించింది.

"షాంకీల్, ఏమయ్యింది? ఎందుకా పండును అలా విసిరేశావ్?" అడిగింది సెల్లా.

సెల్లా ప్రశ్నకు షాంకీల్ జవాబు ఇవ్వలేదు. అతనికి తల తిరుగుతున్నట్టుగా అనిపించింది. నోరంతా చేదుగా ఐపోయింది. నాలుక పీక్కుపోతున్నట్టు నరాల్లోకి ఏదో జరజరా పాకుతున్నట్టుగానూ అనిపించింది.

అతనికి కళ్ళు తిరిగాయి.

రెండు చేతులతో గట్టిగా కొమ్మను పట్టుకున్నాడు. అయినా అతడి చేతులపట్టు జారిపోయింది. కళ్ళు మూతలు పడిపోయాయి.

ఒక్కసారిగా ఎవరో గట్టిగా నెట్టేసినట్టు కెవ్వుమంటూ అంత ఎత్తుమీదనించి కిందికి పడిపోయాడు.

పక్కకు తప్పుకున్నారు అంతా.

సెల్లా — భారత్ అతన్ని కిందపడకుండా పట్టుకోవాలని చూశారు కాని కుదర్లేదు.

బోర్లా పడిపోయాడు.

అతని చుట్టూ చేరారు.

"షాంకీల్! ఏం జరిగింది? ఎందుకలా పడిపోయావ్?"

భారత్ అడుగుతున్నాడు.

షాంకీల్ నోట్లోనించి నెత్తురుతో పాటు నురుగు కూడా వచ్చింది.

"ఆ పండ్లు తినకండి. అవన్నీ విషపూరితాలు" అంటూ తల వాల్చేశాడు షాంకీల్.

వాళ్ళంతా షాక్ కొట్టినట్టు అదిరిపడ్డారు అతని మాటలు విని.

భయంతో ఒకరినొకరు చూసుకున్నారు.

క్షణాల్లో షాంకీల్ శరీరం నల్లగా మారిపోయింది.

• • •

"థాంక్ గాడ్ ....మనందరం ఈ జన్మలో షాంకీల్ ఋణం తీర్చుకోలేము. అతను మనల్నందరినీ ఈ విషపూరితమైన పండ్లనించి రక్షించాడు. ముందుగా ఆ పండును అతను తిని మన ప్రాణాలను కాపాడాడు. అతనే ముందుగా పండ్లను కోసి కిందపడేసినట్లయితే మనందరం వాటిని ఆవురావురుమంటూ తిని ప్రాణాలు పోగొట్టుకునే వాళ్ళమే."

స్టెల్లా అన్నది బాధగా—

"అవును, మనందరం షాంకీల్‌ను చంపాలనుకున్నాం. కాని చివరికి మనం చంపాలనుకున్న షాంకీల్ మనల్ని చావునించి బయటపడేశాడు. షాంకీల్ ఋణం తీర్చుకోలేనిది" అన్నాడు భారత్.

వాళ్ళంతా అచేతనులై వాళ్ళిద్దరి మాటలు వింటూ వుండిపోయారు. ఎందుకో వాళ్ళకు ఒక్కసారి ఎదురుగా వున్న చెట్లను, పొదలను పరిసరాలను చూస్తుంటే వెన్ను లోంచి ఏదో విచిత్రమైన భయం పుట్టుకుని వచ్చింది.

ఆ దీవి మొత్తాన్ని మృత్యువు ఆక్రమించుకుని వున్న

ట్టుగా అనిపించింది.

ఎర్రగా పండిన పండ్లు భయంకరమైన విషాన్ని నింపు కని ఉన్నాయా?

ఏమిటీ చిత్రం!

ఇక ధైర్యంచేసి ఈ దీవిలో యే పండును తినాలి? యెలా ఆకలి తీర్చుకోవాలి?

ఆకలితోనే ఈ దీవిలో చావు తప్పదేమో!

అందరిలోనూ ఇవే రకమైన ఆలోచనలు.

షాంకీల్ ఆత్మశాంతికోసం వాళ్ళంతా కొంచెంసేపు మౌనం పాటించారు.

నోట్లోనించి నెత్తురు, నురుగు కారి తల ఓ పక్కగా పగిలిన షాంకీల్ శవం వికృతంగా అందరికీ భయాన్ని కలిగించేలా వుంది.

"ఈ శవాన్ని ఏం చేద్దాం?" స్టెల్లా అన్నది.

"ఇలా వదిలెయ్యటానికి వీల్లేదు. ఇక్కడే పూడ్చి వెయ్యాలి" భారత్ అన్నాడు.

"ఇప్పుడా? యెవరికి ఓపిక వుంది. తిండి, నీళ్ళు దొరక్క అలమటించిపోతూ ఇప్పుడు ఈ శవంకోసం గోతిని తివ్వే శక్తి ఎవరికి వుంది?" ముసలాయన అడిగాడు.

"ఓపిక వున్నా లేకపోయినా తప్పదు. ఈ మనిషి ఇప్పుడు ఓ కోపిష్టి దొంగకాదు. మన ప్రాణాలు కాపాడిన మనిషి. అందుకే ఇలా వదిలెయ్యటానికి మేము ఒప్పుకోము. మీకు ఓపిక లేకపోతే మీరలా చెట్టు నీడన కూర్చోండి. నేను స్టెల్లా గొయ్యి తవ్వి ఈ శవాన్ని పూడ్చిపెడతాం."

భారత్ — స్టెల్లా అప్పటికప్పుడే కొంచెం యెత్తు తక్కువగా వున్న చెట్టుకొమ్మల్ని కొంచెం గట్టిగా వున్న

వాటిని విరుచుకు వచ్చారు.

అక్కడే గట్టి కర్రలతో గబగబా ఇసుకలో గొయ్యి తవ్వారు.

అరగంటలో మనిషి పట్టేంత గొయ్యి ఏర్పడింది. దాన్లో పాంకీల్ శవం ఉంచి క్షణాలమీద ఆ గొయ్యిని పూడ్చేశారు.

"ఇప్పుడు మనకు సేవకుడు లేడు. మనలో అప్పుడే ఓ మనిషి తగ్గిపోయాడు. ఈ దీవికి బలైపోయాడు" అన్నాడు భారత్.

అందరి హృదయాలూ భారంగా ఐపోయాయి.

ఒక్కసారి పూడ్చిన గొయ్యిని చూసి మళ్ళీ అక్కడి నించి కదిలారు.

* * *

"ఎంతదూరం ఈ ప్రయాణం?" ఎవరో అడిగారు.

"ఏమో! తెలీదు. ముందు మన ఆకలి, దప్పిక తీరాలి. ఆ తర్వాతనే మిగిలిన విషయాల గురించి ఆలోచించటం. ఆకలితో నీరసంతో కళ్ళు తిరుగుతున్నాయి. ఇలాగైతే ఎక్కువ దూరం మనం నడవలేము" ఇంకెవరో అన్నారు.

అప్పటికే ఎండ చాలావరకు తగ్గిపోయి క్రమంగా నల్లని నీడలు యెక్కడినించో వచ్చి ఆ దీవిని చుట్టుకుంటున్నాయి.

అప్పటిదాకా వేడిగా వీచిన గాలి నిముషాలమీద చల్లగా చలిగాలిగా మారిపోయింది.

"చీకటి పడకముందు మనం ఈ ఆకలిబాధలు తీర్చుకోగలమా?"

"ఏమో? నమ్మకం లేదు. ఇదేదో చాలా ఘోరమయిన దీవిలా వుంది. ఇలాంటి దీవులు కూడా వుంటా

యని నేను ఎప్పుడూ విన్లేదు" ఓ యువకుడిలా వున్నతను అన్నాడు.

"దయచేసి యెక్కువగా మాట్లాడకండి. మన శక్తి వృధా అవుతుంది. మౌనంగా నడవండి" భారత్ అన్నాడు.

అప్పుడే కొంచెం దూరంనించి వున్నట్టుండి యేవో పక్షులు గుంపులుగా పైకి లేచి ఆకాశంలో అరుస్తూ ఎగిరి పోతూ కనిపించాయి.

ఆ వైపునించే సరిగ్గా చల్లగా వున్న గాలి ఒక్కసారి వీచింది.

శైలా సంతోషంగా అన్నది.

"మనకు దగ్గర్లోనే యేదో జలాశయం వుంది. ఆ ఎగిరి పోయిన పక్షులు, ఈ చల్లని గాలి అందుకు నిదర్శ నాలు."

అందర్లో ఒక్కసారి ఆశ కలిగింది.

నీరసించిపోతున్న శక్తిని కూడగట్టుకుంటూ గబగబా ముందుకు నడిచారు.

పదినిముషాలు నడిచేసరికి దట్టంగా చెట్లు వున్న ప్రాంతం వారికి కనపడింది. ఆ చెట్ల మధ్యగా చిన్న నీటి మడుగు దర్శనమిచ్చింది.

అందులో నీళ్ళు స్వచ్ఛంగా వున్నాయి.

ఒడ్డునే రంగు రంగుల పక్షులు నీళ్ళు తాగుతూ కన పడ్డాయి.

ఆ నీళ్ళను చూడగానే అందరి కళ్ళు సంతోషంతో మెరిశాయి.

"నీళ్ళు....నీళ్ళు" అంటూ అరిచారు కొందరు.

చేతుల్లో వున్న బరువులను ఒడ్డునే వదిలి రివ్వున నీటి దగ్గరకు పరుగుదీశారు. పరుగుతీసి ఎవరో పట్టి ఆపినట్టు

తక్కున ఆగిపోయారు.

"ఆగిపోయారేం?" అన్నది స్టెల్లా వాళ్ళ దగ్గరకు వెళుతూ—

"భయంగా వుంది. ఈ నీళ్ళు తాగితే ప్రాణాలు పోవు కదా?!"

స్టెల్లా నవ్వి "అలాంటి భయం అవసరం లేదనుకుంటాను. ఎందుకంటే అటు చూడండి. ఆ పక్షులు నీళ్ళు తాగుతున్నాయి. మనమూ తాగొచ్చు" అంటూనే వంగి దోసిలితో నీళ్ళు తీసుకుని నోట్లో పోసుకుంది.

"ఎక్సలెంట్. అద్భుతంగా వున్నాయి నీళ్ళు...." అన్నది ఇంకా తాగుతూ—

అంతే. క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా అంతా నీళ్ళమీద దాడి చేశారు. ఆకలిబాధ తీర్చుకోటానికి ఆహారం బదులు కూడా నీళ్ళనే తాగారు. నీటిని ఒంటి నిండా చల్లుకున్నారు.

కొంతమంది స్నానాలు చెయ్యటానికి సిద్ధమయ్యారు. కాని భారత్ వద్దన్నాడు.

"చీకటి పడుతోంది. ఈ నీటిమడుగు దగ్గరకు ఏమయినా క్రూరమృగాలు రావొచ్చు. అంతే కాదు. ఈ రాత్రి గడపటానికి మనం సురక్షితమయిన ప్రదేశాన్ని వెతుక్కోవాలి. అందువల్ల యిప్పుడు స్నానాలు వద్దు."

మడుగు గట్టున వున్న చెట్లకు చిన్న చిన్న పండ్లు వ్రేలాడుతున్నాయి.

"ఈ పళ్లను తినవచ్చునేమో" అన్నాడు భారత్.

"వద్దు. ఈ దీవిలో పండ్లన్నీ విషపూరితాలేమో" ఎవరో అన్నారు.

"అలా భయపడితే ఆకలితోనే మనం ఈ దీవిలో చచ్చిపోతాం.... చూడండి.... కొన్ని పళ్ళను పక్షులు సగం తిని వదిలేశాయి. కొన్ని పండ్లను పక్షులు తింటు న్నాయి. సందేహంలేదు. ఈ పండ్లు విషపూరితాలు కాదు" అంటూ కింద పడివున్న ఓ పండును తీసుకుని కొరకబోయింది.

"వద్దు.... వద్దు" అరిచారు ఎవరో.

స్టెల్లా నవ్వి "ఎవరో ఒకరు సాహసం చెయ్యాలి. తప్పదు. ఆ సాహసాన్ని నేనే చేస్తాను" అని ఆ పండును కొరికింది.

తియ్యగా వుంది ఆ పండు.

అంతా స్టెల్లా మొహంలోకి చూస్తున్నారు.

"ఎలా వుంది?"

"డామ్ స్వీట్" నవ్వింది.

"నే నడిగేది రిజల్టు" భారత్ అన్నాడు.

"ఎలాగూ లేదు. మామూలుగానే వుంది. ఇవి మంచి పళ్ళే. అంతా తినండి" అన్నది ఆ పండును పూర్తిగా తింటూ.

అంతే. అంతా కిందికి వాలిన కొమ్మలను పట్టుకుని మరింత కిందికి లాగి వాటికి వేలాడుతున్న పండ్లను గబ గబా కోసుకు తిన్నారు.

క్షణాలమీద చేతికి అందిన పండ్లన్నింటినీ అవురావురు మంటూ తినేశారు. ఎన్ని పండ్లు తిన్నారో వాళ్ళకే తెలీదు.

ఆ గొడవల్లో చీకటి పడటాన్ని గమనించనే లేదు. ముందుగా స్టెల్లా గమనించింది.

"క్విక్...., ముందు మనం యిక్కడినించి బయల్దేరాలి.

సురక్షితమయిన ప్రదేశాన్ని సెర్చ్ చెయ్యాలి" అన్నది.

సెకన్లలో వాళ్ళు అక్కడినించి కదిలారు.

ఆ చెట్లు దాటి బయటకు వచ్చిన తర్వాత "ఇప్పుడు మనం యెటు వెళ్ళాలో యెలా తెలుస్తుంది?" అన్నాడు భారత్.

"తెలీదు. కానీ ఏదో ఓ వైపు నడవాలి. ఈ చెట్ల దగ్గరే ఈ రాత్రికి మనం గడపొచ్చు. కాని ఇక్కడ నీటి మడుగు వుంది. క్రూర జంతువులు తప్పకుండా యిక్కడికి వస్తాయి. అందువల్ల మనకు ప్రమాదం. కాబట్టి మనం యిక్కడినించి దూరంగా వెళ్ళక తప్పదు" అన్నది స్టెల్లా.

"ఐతే ఎటు వెళదాం? మన విమానం కూలిపోయిన ప్రదేశానికే వెళదామా?"

"ఎందుకు?"

"అక్కడే సురక్షితంగా వుంటుందని నా నమ్మకం. ఎందుకంటే ఈ రాత్రికి మనం కూలిపోయిన ప్లేన్‌లో తల దాచుకోవచ్చు. ఈ రాత్రి ఎలాగో గడిపామంటే తెల్లారినతర్వాత ఈ దీవిలో తిరిగి మనం ఇక్కడినించి ఎలా బయటపడాలో తెలుసుకోవచ్చు" అన్నాడు భారత్.

అంతా అందుకు అంగీకరించారు.

సగం కాలిపోయి కూలిపోయిన విమానం కంటే ఆ రాత్రి తల దాచుకోటానికి మంచి ప్రదేశం యేదీ లేదని అంతా ఒప్పుకున్నారు.

తెలిసున్న దారే కాబట్టి వేగంగా నడవటం మొదలు పెట్టారు.

స్టెల్లా ముందు నడుస్తోంది. వెనకనే భారత్ వున్నాడు. అతడి వెనుక మిగిలినవాళ్ళంతా వున్నారు.

స్టెల్లా తాను అంతకుముందు వచ్చిన అడుగుజాడలను చూసుకుంటూ నడుస్తోంది. చీకట్లు అలుముకోవటంవల్ల అడుగు జాడలు అంత స్పష్టంగా కనిపించటం లేదు.

పినా ప్రయత్నం చేస్తోంది.

వెడల్పాటి ఆకులున్న చెట్లు వచ్చాయి.

అప్పుడే వాళ్ళు షాంకీల్‌ను బలిగొన్న విషపండ్ల చెట్లను దాటారు. అక్కడికి రాగానే అందరికీ ఒళ్ళు ఒక్కసారి జలదరించింది.

నడుస్తున్నదల్లా స్టెల్లా ఠక్కున ఆగిపోయింది.

• • •

"ఏమయ్యింది?" ఆగిపోతూ అడిగాడు భారత్.

"నీ లైటర్ ఇలా ఇవ్వు."

ఇచ్చాడు.

స్టెల్లా దాన్ని వెలిగించి వంగి నేలమీద పరీక్షగా చూసింది. క్షణం తర్వాత "మై గాడ్, ఈ దీవిలో మనమే కాకుండా మరికొంతమంది మనుషులు వున్నారు" అన్నది.

"నిజమా!" అంతా ఒక్కసారి అన్నారు.

"అవును. అంతేకాదు. వాళ్ళు మనకంటే భారీ మనుషులు. కావాలంటే ఈ అడుగుజాడలు చూడండి."

అంతా ముందుకు వంగారు.

వాళ్ళకు ఇసుకలో కొంచెం దిగబడినట్టుగా వున్న రెండు పెద్ద వెడల్పుగా వున్న పాదాల ముద్రలు కనిపించాయి.

అంతా భయంతో నోరు తెరిచారు.

"జాగ్రత్తగా వినండి. మనం వెళ్ళిన తర్వాత ఈ ప్రాంతంలో ఆ మనుషులు తిరిగారు. బహుశ మన అడుగు

జాడలను వాళ్ళు పసికట్టి వుండాలి. అంటే వాళ్ళు మనలను వెంటాడుతూ వుండొచ్చు. అంటే ప్రమాదం మన వెనుకే వుంది. దీవుల్లో మనుషులంటే చాలావరకు నాగరిక మనుషులకు హాని చేసేవాళ్ళే ఐవుంటారు. కాబట్టి మనందరం వెయ్యి కళ్ళతో సంచరించాలి....” అంటూ చెబుతున్నదల్లా ఒక్కసారి ఆగిపోయింది స్టెల్లా.

ఏదో ఘాటయిన వెగటు వాసన ఆమె ముక్కుపుటాలను తాకింది.

గట్టిగా ఒక్కసారి గాలిపీల్చి యెందుకో తలెత్తి చుట్టూ చూసి అదిరిపడింది.

వాళ్ళెవ్వరూ గమనించలేదు.

“మై గాడ్” అని స్టెల్లా అనటంతో చూశారు.

అప్పటికే ఓ పాతికమంది దీవి మనుషులు వాళ్ళని చుట్టుముట్టారు. ఒకరిద్దరి చేతుల్లో అప్పటికప్పుడే కాగడాలు వెలిగాయి.

ఆ వెలుతుర్లో యమదూతల్లా వున్న వాళ్ళందరినీ చూడటంతోనే అంతా కొయ్యబారిపోయారు. పై ప్రాణాలు పైనే పోయాయి.

నల్లగా పోతపోసిన విగ్రహాల్లా వున్నారు. చింపిరి జుట్టు దానిచుట్టూ తోలు రిబ్బనులాంటిది చుట్టుకున్నారు. ఎర్రగా వున్న కళ్ళు—చప్పిడి ముక్కులు — బాగా పొడుగ్గా వున్న నోళ్లు—

మొలచుట్టూ ఏదో జంతు చర్మాన్ని చుట్టుకున్నారు. అరటిబోదెల్లాంటి కాళ్ళు— వెడల్పుగా వున్న పాదాలు బాగా ఎత్తుగా—లావుగా భయంకరంగా ఉన్నారు. వాళ్ళందరి చేతుల్లోనూ పొడుగాటి ఈటెలు ఉన్నాయి.

స్త్రీలు కెవ్వున అరవబోయారు కాని భయంతో

అరుపు బయటకు రాలేదు.

భారత్ కు కూడా వాళ్ళను చూడటంతో నే ప్రాణాల మీద ఆశపోయింది. అలాంటి అనాగరిక మానవులు నాగరిక మనుషులు దొరికితే ప్రాణాలతో వదలక పోవచ్చు.

అంతా శిలల్లా నిలబడిపోయారు. కదలికలు లేకుండా-చివరకు గాలి పీల్చటం, వదలటంకూడా మరచిపోయారు.

ఏం చెయ్యాలి?

ఆ మనుషుల బారినించి తప్పించుకోవటం సాధ్య మేనా? సాధ్యం అవకపోవచ్చు.

వాళ్ళు చాలామంది వున్నారు. వాళ్ళందరి దగ్గర ఈటెలు వున్నాయి. పైనా ముందుగా వాళ్ళ గురించి ఏమీ తెలియకుండా ప్రతిఘటనకు పూనుకోవటం అవివేక మేమో!

భారత్ ఆలోచనలు ఇలా వుండగానే ఆ పాతిక మంది వాళ్ళలో వాళ్ళే కిచకిచలాడుకున్నారు. ఆ భాష యేమిటో అక్కడ వున్న యెవ్వరికీ అంతుబట్టలేదు.

తర్వాత పొడుగాటి పళ్ళని బయటపెట్టి వికృతంగా నవ్వుతూ ఈటెలతో—శాగడాలతో ముందుకు వచ్చారు.

అప్పుడే ఊహించని విధంగా—

ముగ్గురు స్త్రీలు గుండెలు పగిలేలా ఆర్తనాదాలు చేశారు.

* * *

ఆ షాక్ నించి ముందుగా స్టెల్లా తేరుకొని వెంటనే రియాక్టు అయ్యింది. పర్సులోనించి రివాల్వర్ బయటకు లాగబోయింది.

ఆమె చర్యను కనిపెట్టిన భారత్ "స్టెల్లా....తొందర

పడవ.... ప్రతిఘటన క్షేమంకాదు" అన్నాడు.

వెంటనే తన ప్రయత్నాన్ని ఆపుచేసింది.

ఐతే అప్పటికే వాళ్ళు ఏదో కనిపెట్టినట్టు మళ్ళీ నవ్వారు.

నవ్వుతూనే మళ్ళీ కిచకిచలాడారు.

ఆ కిచకిచలు వాళ్ళకు ఎంతమాత్రం అర్థంకాలేదు. వాళ్ళు అప్పటికి తెలుసుకున్నట్టు భయపడవద్దన్నట్టు సైగచేసి శత్రువులంకాదు మిత్రులమే అన్నట్టు రెండు చేతులనూ ఒకదానికొకటి కలిపి చూపించారు.

భారత్ కు సెల్లాకు వాళ్ళ సైగలు బాగానే అర్థం అయ్యాయి. అప్పుడు వాళ్ళు మిగిలిన వాళ్ళకు ఆ విషయాన్ని వివరించి చెప్పారు.

అంతా హాయిగా నిర్భయంగా గాలి పీల్చుకున్నారు.

వాళ్ళు సైగలతోనే "మీరంతా ఎవరు?" అని అడిగారు.

అందుకు భారత్ కొంచెం దూరంలో వున్న కూలిపోయిన విమానం దిక్కు చూపుతూ దాన్లో ఈ దీవిలోకి వచ్చిపడ్డామని సైగలతోనే చెప్పాడు.

అందుకు వాళ్ళలో వాళ్ళే కిచకిచలాడుతూ యేదో మాట్లాడుకుని "మాతో రండి" అంటూ సైగచేశారు.

"వెళ్ళక తప్పదా?" అన్నది సెల్లా.

ఆమెకు ఆ ఆటవిక జాతులతో కలిసి వాళ్ళ గూడానికి వెళ్ళటం ఇష్టంలేదు. వాళ్ళ దగ్గరనించి కొడుతున్న ఆ వెగటు వాసనకే తల తిరుగుతున్నట్టు అనిపిస్తుంది. వాళ్ళ వల్ల యేమంత ప్రమాదంలేదని అనుకున్నా అక్కడకు వెళ్ళటం యెందుకో సెల్లాకు మనస్కరించలేదు.

కాని "తప్పదు సెల్లా. ప్రస్తుతానికి మనం ఈ మను

షులను అనుసరించక తప్పదు. వీళ్ళ సహాయంతో నే మనం ఈ దీవినించి బయటపడే మార్గాన్ని తెలుసుకోవాలి. నిజంగా మన అదృష్టం వీళ్ళంతా మంచివాళ్లు కావటం నేను ఎన్నో పుస్తకాల్లో చదివాను. ఇలాంటి దీవుల్లో ఉండే జాతి మనుషుల్లో చాలావరకు నరమాంస భక్షకులే. మిగిలిన వాళ్లు నరమాంసం తినకపోయినా నాగరిక మనుషులను ప్రాణాలతో వదలరు. ఇప్పుడు మనకు అలాంటి భయంలేదు. ధైర్యంగా వీళ్ళతో వెళ్ళవచ్చు" అన్నాడు భారత్.

"వెళ్ళొచ్చు నిజమే భారత్. కాని వాళ్ళదగ్గరనించి వస్తున్న ఆ వెగటు వాసనను నేను భరించలేకుండా ఉన్నాను."

నవ్వాడు అతను చిన్నగా—

నవ్వి "ఒక్కోసారి యెలాంటి వెగటువాసనైనా భరించాలి స్టెల్లా. నిజానికి నాకూ ఈ వాసనను భరించటం కష్టంగానే వుంది. ఐనా తప్పదు. ప్రస్తుతం మనం ఎలాంటి క్లిష్టమైన స్థితిలో ఉన్నామో గుర్తుచేసుకో" అన్నాడు.

స్టెల్లా మాట్లాడలేదు.

"పదండి" అన్నట్టు సైగచేశాడు భారత్.

వాళ్ళు వెనక్కు తిరిగారు.

చేతిలో కాగడా ఉన్న మనిషి ముందు నడుస్తున్నాడు. మరో కాగడా ఉన్న మనిషి చివరగా నడుస్తున్నాడు. మధ్యలో భారత్—స్టెల్లా మిగిలిన వాళ్ళంతా ఉన్నారు.

మిగిలిన అందరికీ మనసులో ఏదో భయంగా ఉంది.

ఈ దీవిలో అటవికుల మధ్య ఏమిటీ నడక?

కలలోకూడా వూహించని పరిణితి.

ఒక్కొక్కరికీ మనసులో యెంతో దిగులుగా ఉంది. ఒకరకంగా ఈ దీవిలో చిక్కుపడిపోయినట్లే.

తిరిగి ఈ దీవినించి విముక్తి ఎప్పుడు? అసలు విముక్తి అనేది ఉంటుందా?

ఓ పొద పక్కనించి దారి మారింది. అది కొత్తదారి. ఆ దారి ఆ మధ్యాహ్నం వాళ్ళకు కనిపించలేదు. లేక పోతే ఆ దారిలోనే ప్రయాణం చేసేవాళ్ళు. అప్పుడే ఆ ఆటవికుల గూడేనికి చేరేవాళ్ళు.

దారి పొడుగునా వాళ్ళుకూడా ఏమీ మాట్లాడలేదు. సన్నని కాలిబాట పొదల మధ్యనించి ఉంది. ఆ పొదల మధ్యనించి నడుస్తుంటే చిన్న చిన్న ముళ్ళు గీసుకు పోతున్నాయి. బట్టలు చీరుకుపోతున్నాయి.

భయంగా వుంది. ఆ చీకట్లో యే పొదలోనించి యే జంతువువచ్చి మీద పడుతుందోనని.... అప్పటివరకూ ఆ దీవిలో ఒక్క జంతువుకూడా కనపడలేదు—ఆ కుందేలు తప్ప.

ఆ దీవిలో క్రూరజంతువు లేవేల?

అడగాలని ఉంది భారత్ కి వాళ్ళను.

కాని వాళ్ళ భాష రాదు. యెలా అడగాలో తెలీదు. గూడేనికి వెళ్ళిన తర్వాత యేదోవిధంగా తన సందే హాలను తీర్చుకోవాలి.

అతనా ఆలోచనల్లో ఉన్నప్పుడే స్టెల్లా చిన్నగా అతడిని పిల్చింది.

"ఏమిటి?"

"ఈ అడవిమనుషులకు వస్త్రాల గురించి తెలుసా?"

"ఎందుకు?"

## "ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డుపై వ్రాసి, ఈ నెల 6 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు ఏడాదిపాటు పత్రిక లేదా సప్లిమెంట్ బహుమతిగాపంపుతాము.

## "హోమ్ డెలివరీ"

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 10/- లకే వి.పి. ద్వారా మీ యింటి దగ్గర అందజేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

అయితే, ఈ స్కీము అపన ఏజంట్లు వున్న ప్రాంతాలకు వర్తించదు. మీరు హోమ్ డెలివరీ సభ్యత్వము పంపే ముందు మీ వూరిలో మా ఏజంటు లేదనే విషయం నిర్ధారణ చేసుకోండి.

"నీ దగ్గర ఉన్న వజ్రాలను చూశారంటే వీళ్ళు వదులుతారా?"

ఉలిక్కిపడ్డాడు భారత్.

అవును. ఇప్పటిదాకా తనకు ఆ అనుమానమే రాలేదు. యే దీవిలో ఉండే మనుషులకైనా వజ్రాలగురించి తెలీకుండా ఉంటుందా?

తెలిసే ఉంటుంది. అలాంటప్పుడు ఈ మనుషులబారి నించి ఆ వజ్రాలను దాచటం ఎలా?

''మాట్లాడవేం?''

"ఇప్పుడేమీ చెప్పలేను. ఏమయినా ఇబ్బందే. నువ్వేదయినా ప్లాను ఆలోచించు."

సెల్లా మౌనం వహించింది.

పొదలు అంతరించిపోయాయి. పొడుగ్గా ఉన్న చెట్లు మొదలైనాయి. ఆ చెట్ల మధ్యనించి వాళ్ళందరికీ ఎర్రటి రంగులో ఉన్న ఏదో దేదీప్యమైన కాంతి కనపడింది.

ఎన్నో ఇళ్ళు ఒక్కసారిగా కలిసి అగ్నికి ఆహుతి అవుతుంటే అటువంటి కాంతి వస్తుంది.

భారత్ —సెల్లా ముందుగా ఆ వైపు చూసి మిగిలిన వాళ్ళందరికీ ఆ వెలుగు గురించి చెప్పారు. అంతా చెట్ల మధ్యనించి ప్రసరిస్తున్న ఆ కాంతిని చూసి వాళ్ళు ఆశ్చర్యంతో మునిగిపోయారు.

ఉదయిస్తున్న సూర్యుడి కిరణాల తేజస్సులా ఉంది అది. రాత్రివేళ ఆ వెలుగు యెక్కడినుండి వస్తోంది.

ఆ దీవిలో అంత ఎత్తునుండి అలాంటి తేజస్సును వెదజల్లే దీపాలు ఉండటం సాధ్యమేనా?

నడుస్తున్నకొద్దీ ఆ కాంతికి దగ్గరవుతున్నట్టుగా వాళ్ళు గ్రహించారు.

"స్టెల్లా ఆ వెలుగు యేదై ఉంటుంది?"

"ఆశ్చర్యంగా ఉంది. నాకు అంతుపట్టటం లేదు. యెన్నో విద్యుత్ లైట్లను ఫోకస్ చేసినాగానీ అలాంటి వెలుగు రాదు" అన్నది.

"గూడెంలో ఇళ్ళు తగలబడుతున్నాయేమో?"

నవ్వింది స్టెల్లా.

"నీ బ్రెయిన్ సరిగా వర్క్ చెయ్యటం లేదను కుంటాను. గూడెంలో ఇళ్ళు తగలబడుతుంటే ఈ మనుషులు మనముందు ఇలా నడుస్తారా? పరుగులు పెట్టి ఉండేవాళ్ళు ...ఆ వెలుగు ఈ మనుషులకు బాగా అల వాటైనదిలాగే అనిపిస్తోంది. అందుకే దాన్ని గురించి యెలాంటి అదుర్దా లేకుండా తాపీగా నడుస్తున్నారు."

"అవును. నువ్వు చెప్పింది నిజం."

మిగిలిన మనుషులుకూడా ఆ వెలుగు గురించి వాళ్ళలో వాళ్ళు చర్చించుకున్నారు.

చివరకు భారత్ ఆ సస్పెన్స్‌ను భరించలేక తన ముందు నడుస్తున్న ఆ జాతి మనిషిని పిల్చి చేత్తో ఆ వెలుగు వైపుకు చూపించి అదేమిటని అడిగాడు సైగ తోనే.

వాడు చెప్పలేదు.

నవ్వి వూరుకున్నాడు. వాడి నవ్వు మరీ వికృతంగా ఉంది. నవ్వినప్పుడు వాడి నోట్లో ఉన్న పళ్ళు ఆ వెలుగులో వంకరటింకరగా పొడుగ్గా కనపడినాయి.

గూడేనికి దగ్గరవుతున్నప్పుడు వాళ్ళు మళ్ళీ కిచకిచ లాడుకోవటం మొదలుపెట్టారు.

చెట్లన్నింటినీ దాటేశారు.

(సశేషం)

